# ఆనంద నిలయునికి
# అక్షర నీరాజనం

రచన

జూలకంటి బాలసుబ్రహ్మణ్యం
తిరుపతి




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
2014

# ANANDA NILAYUNIKI AKSHARA NEERAJANAM

*By*
**Julakanti Balasubrahmanyam**

*Editor-in-Chief*
**Prof. Ravva Sri Hari**

T.T.D. Religious Publications Series No.1134


*First Edition : 2014*

*Copies :* 2000

*Price :*

*Published by*
**M.G. GOPAL,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507

***D.T.P:***
Office of the Editor-in-Chief
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507

## ముందుమాట

"నేను వైకుంఠాన్నయినా వదలివుంటాను గాని, నా భక్తులను మాత్రం ఒక్క క్షణమయినా విడిచివుండలేను" – అన్న దృఢసంకల్పంతో భూలోక వైకుంఠం అయిన వేంకటాచలంమీద కొలువైవున్న స్వామి శ్రీ వేంకటేశ్వరుడు.

ఎప్పుడో, ఏనాడో వక్షఃస్థల శ్రీమహాలక్ష్మీసమేతుడై, అద్భుతమైన సాలగ్రామ శిలామూర్తిగా స్వయంవ్యక్తమై ఆవిర్భవించిన దేవుడు ఆనందనిలయుడు.

ఆ స్వామివారి స్మరణం సర్వపాపహరణం! ఆ దేవుని కీర్తనం కోరిన కోరికలకు ఆలంబనం. ఆ దేవదేవుని దర్శనం ముక్తికి మార్గదర్శనం.

కనుకనే, ఈ కలియుగంలో అందరిపాలిటి ఏకైక దిక్కైన ఏడుకొండలవాడికి "కలౌ వేంకటనాయకః" అన్న ప్రసిద్ధి కలిగింది. అందుచేతే తిరుమల శ్రీవారి నందకాంశసంభూతుడైన అన్నమయ్య.

**"ఏమి వలసిన నిచ్చు నిప్పుడైనను,**
**ఏమరక కొలిచిన నితడే దైవము"**

అంటూ శ్రీనివాసభగవానుని అఖండ పరిపూర్ణత్వాన్ని మరియు సర్వదాతృత్వాన్ని కొనియాడినాడు. అంతేకాదు, ఆనందనిలయంలోని శ్రీవారి మూలమూర్తి "ఒక్కటే" అయినా, ఆ మూర్తిలో శ్రీరాముణ్ణి, ఓ నరసింహుణ్ణి, ఓ కృష్ణుణ్ణి... ఇలా ఎందరో దేవుళ్లను ప్రత్యక్షంగా దర్శించడమేగాక పరవశించి గానం చేశాడు అన్నమయ్య.

చెప్పిన మాటే మళ్లీ చెప్పకుండా, పాడిన పాటే మళ్లీ పాడకుండా ముప్పైరెండువేల సంకీర్తనల్లో శ్రీవేంకటేశ్వరుని అధ్యాత్మతత్త్వాన్నీ, మహిమలనూ, లీలలనూ, ఉత్సవవైభవాలనూ ఆవిష్కరించాడు అన్నమయ్య.

ఆనందనిలయుని దర్శించిన అన్నమయ్య దివ్యానుభూతులను పొందుతూ ఆనందించి ఆవిష్కరించిన అనేక విషయాలతో కూడివున్న ఆధ్యాత్మిక వ్యాససంకలనమే ఈ **“ఆనందనిలయునికి అక్షరనీరాజనం!”**. ఇందులోని వ్యాసాలన్నీ “సప్తగిరి”, ‘ఆంధ్రప్రభ’, ‘ఆంధ్రజ్యోతి’ మున్నగు మాస, వార దినపత్రికల్లో గతంలో ప్రచురింపబడినవే!

ఇందులో ప్రతివ్యాసం ఏడుకొండలవాడికి సంబంధించిందే కావడం విశేషం! అంతేకాదు. ఆనందనిలయుని ఆలయకవీ, భక్తుడూ అయిన అన్నమయ్య, ఏదో ఒక కోణంలో ఆనందనిలయుణ్ణి, అక్షరాత్మకంగా ఆవిష్కరించిందే కావడం మరో విశేషం! అందువల్లే రచయిత శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యంగారు సమర్పణ చేసికొంటున్న సార్థకమైన గ్రంథం ఈ **“ఆనందనిలయునికి అక్షరనీరాజనం!”**

ఇలా **‘అక్షరార్చన’** తో జీవితం పండించుకుంటున్న ఈ రచయితకు ఏడుకొండలవాడి అండదండలు మెండుగా ఉండాలనీ ఆకాంక్షిస్తూ...

సదా శ్రీవారి సేవలో...

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

# కృతజ్ఞతాంజలి

**వేంకటేశా త్పరోదేవో నాస్త్యన్యః శరణం భువి ।**
**వేంకటేశ సమో దేవో నాస్తి నాస్తి మహీతలే ॥**

శ్రీ వేంకటేశ్వరస్వామిని మించిన పరదైవం ఈ భువిమీద ఎక్కడా లేదు. లేనే లేదు. ఉండదు కూడా. అలాగే శరణు వేడటానికి ఘన వేంకటేశునికి మించిన లేదా ఆయనకు సాటి రాగల దేవుడు ఈ భూమండలంలోనే నాస్తి! నాస్తి!

ఇంతటి ప్రశస్తి వున్న తిరుమల పరంధాముడు తెలుగునేలలో తెలుగువారి ఇలువేలుపుగా ప్రత్యక్షంగా నిలిచివుండటం ఎంతటి భాగ్యమో కదా! అలాంటి స్వామివారి వైభవాన్ని, మహిమలను, లీలలను తెలుగుప్రజల్లో చాటడానికి సాక్షాత్తు తిరుమల శ్రీవారి నందకఖడ్గం ‘అన్నమయ్య’గా అవతరించింది.

నందకాంశసంభూతుడైన అన్నమయ్య ‘దేవుడు మెచ్చునట్లుగ లోకము మెచ్చునట్లుగ’ తిరుమలేశుని తత్త్వాన్ని తెలుగునాట ఊరూరా, వాడవాడలా తిరుగుతూ ప్రచారం చేశాడు. అనేక పుణ్యక్షేత్రాల్లోని దేవుళ్లను దర్శించి ఆనందనిలయునితో అభేదంగా చెప్పాడు. ఆ సంచారంలో మంచిని పెంచుకుంటూ, చెడును తుంచుకుంటూ లోకాన్ని ఉద్ధరించడంతోపాటు కొండలరాయని కొండంత దయను చాటుతూ కృతకృత్యుడైన అన్నమయ్య సాక్షాత్తు ‘హరి యవతారం’ అని కొనియాడబడినాడు.

తిరుమలేశుని బ్రహ్మోత్సవం, పుష్పయాగం, పవిత్రోత్సవాలు, అన్నమయ్యజయంతి, వర్ధంతి ఉత్సవాల వంటి విశేష సమయాల్లో ‘సప్తగిరి’ ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, నృసింహప్రియ వంటి అనేక దిన, వార, మాసపత్రికల్లో అనేక ప్రత్యేకవ్యాసాలు గతంలో చాల ఏండ్లక్రిందట ప్రచురితమయ్యాయి.

అలా ప్రచురితమైన వాటిల్లో 28 వ్యాసాలను సంకలనం చేసి **“ఆనందనిలయునికి అక్షరనీరాజనం”** పేరుతో దేవస్థానం ప్రచురణగా వెలువడుతున్నందులకు సంతోషంగా వుంది.

గడచిన 30 ఏళ్లలో ఆ యా విశేష సమయాల్లో ఆ యా పత్రికల్లో ముద్రింపబడిన ఈ ప్రత్యేకవ్యాసాల్లో కొన్ని శ్లోకాలు, తిరుమలేశుని విషయాలు పునరుక్తులు అయివుండవచ్చు. పాఠకులు వాటిని దోషాలుగా పరిగణింపకుందురని వినతి.

ఈ వ్యాస సంకలనాన్ని ముద్రించుటకు ప్రోత్సాహపరచిన తి.తి.దేవస్థానం ఎడిటర్–ఇన్–చీఫ్ ఆచార్య శ్రీ రవ్వా శ్రీహరిగారికి నా కృతజ్ఞతాంజలులు.

ఈ ఆధ్యాత్మిక వ్యాస సంకలన గ్రంథాన్ని తి.తి.దేవస్థానం ప్రచురణగా ఆమోదించి అనుగ్రహించిన సహృదయవరేణ్యులు, తి.తి.దేవస్థానం కార్యనిర్వహణాధికారులు శ్రీ ఎం.జి. గోపాల్ **I.A.S** గారికి, జె.ఇ.ఓలు శ్రీ పోలాభాస్కర్ **I.A.S** గారికి, శ్రీ కె.ఎస్. శ్రీనివాసరాజు **I.A.S** గారికి భక్తి పూర్వక నమస్కారాలు.

ఈ గ్రంథాన్ని రంగుల అట్టతో ముచ్చటగా ముద్రించి వెలువరించుటలో సహాయ సహకారాలందించిన దేవస్థానం ప్రెస్ ఇన్చార్జి మేనేజరు మరియు పి.ఆర్.ఓ శ్రీ టి. రవిగారికి నా కృతజ్ఞతాంజలులు.

ఇంకా ఈ పుస్తకం తయారీలో మిక్కిలి శ్రమించిన ఎడిటర్–ఇన్–చీఫ్ ఆఫీసు డి.టి.పి ఆపరేటర్లుకు, చక్కగా ముద్రణకు తోడ్పడిన దేవస్థానం ప్రెస్సు సిబ్బందికి నా కృతజ్ఞతాంజలులు.

**శ్రీజయనామసంవత్సరం**
**తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవం,**
**25-9-2014**

**రచయిత**
**జూలకంటి బాలసుబ్రహ్మణ్యం**
**తిరుపతి**

# విషయసూచిక

# 1. కోరిక తీర్చిన కొరవంజి

అది కలియుగ వైకుంఠం తిరుమల. శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయం. అది అర్ధరాత్రి పండ్రెండుగంటల సమయం. అప్పుడప్పుడే శ్రీ స్వామివారికి పవ్వళింపు సేవ (ఏకాంతసేవ)ను పూర్తిచేసి అర్చక స్వాములు ఇళ్లకు వెళ్లారు. దాంతో తిరుమల క్షేత్రం అంతటా సద్దుమణిగింది. అలాంటి ప్రశాంత వాతావరణంలో పద్మావతీదేవి, శ్రీస్వామివారికి పాదాలు ఒత్తుతూ వున్నది. ఆ సమయంలో ఆ దివ్యదంపతుల మధ్య సంభాషణ ఇలా కొనసాగింది.

దేవీ! పద్మావతీ! ఏమిటీ. ఏదో నీలో నీవే బలే దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లున్నావే! దగ్గరపడుతున్న మన వివాహదినోత్సవం గురించేనా! అని అడిగాడు శ్రీనివాసుడు.

అవును స్వామీ!...మీరు సరిగ్గానే ఊహించారే! బలే విచిత్రంగా ఉందే!

ఇందులో విచిత్రమేముంది దేవీ! మీ ఆడవాళ్లు ఎప్పుడూ ఎక్కువగా ఆలోచించేది పెళ్లిళ్ల గురించీ, పేరంటాల గురించే కదా! పైగా ఆడంబరాల కోసం వింత వింత కోరికలు కోరి మగవాళ్లని సాధిస్తూ వుంటారు.

పాపం మీరు మాత్రం తక్కువ దిన్నారా! మీ మగరాయుళ్లు మా గురించి ఆలోచనే చెయ్యరా! పైగా చీరలిస్తాం...నారలిస్తాం...నగలు చేయిస్తాం... అంటూ నీటిమీది రాతలల్లె వింత వింత వరాలు గుప్పిస్తూ బలే కోతలు కోస్తారు. ఇట్లే కాలం గడుపుతారు అని కోపంతో మూతి ముడుచుకుంది పద్మావతీదేవి.

అబ్బ! అంతలోనే అలుక! ఈ అలుక ఎక్కడుంటుందో అమాంతంగా ముక్కు మీద మూతిమీద వాలుతుంది! అయినా మన వివాహదినోత్సవం దగ్గర పడుతూవున్న శుభవేళ నీవు మూతి ముడుచుకోవడం ఏమీ బాగులేదు. పద్మావతీ!

---

కొరవంజి= ఎరుక చెప్పే స్త్రీ; ఎరుకలసాని



సరేలే స్వామీ! ఇంతకూ... మనం వైకుంఠాన్ని వదలి భూలోకానికి వచ్చి ఎన్నేళ్లు అయిందంటావ్.

మనం వైకుంఠాన్ని వీడి ఐదువేల ఏళ్లు దాటింది. భృగుమహర్షి పుణ్యమా! అని ముందుగ నీవు వైకుంఠాన్ని విడిచి భూలోకాన్ని చేరావు.

ఆ తర్వాత ఏమయింది స్వామీ!

ఏమయిందేమిటి? అంతా మరచి పోయావేమిటి! నీవు వెళ్లిపోగా, నీ విరహాన్ని భరించలేక వైకుంఠాన్ని వీడి నీకోసం భూలోకమంతా తెగ వెదికాను. చివరకు ఇదిగో ఇక్కడే నీవు, నేను స్థిరపడ్డాం!

అసలు భూలోకంలో తొలుత నన్ను ఎక్కడ చూశారండీ!

ఎక్కడ ఏమిటీ! నీవు ఆకాశరాజుపుత్రిక పద్మావతిగా ఈ కొండల్లో కోనల్లో వనవిహారం చేస్తుండగా నిన్ను తొలిగా చూశా! అవునూ అప్పట్నుంచే కదా ఇటు నాకూ, అటు నీకూ ప్రేమజ్వరాలు సోకాయి! అవునా దేవీ!

(సిగ్గుతో) పోండి స్వామీ! ఆ తర్వాత మళ్లీ నన్ను ఎప్పుడు చూశారు స్వామీ!

ఎప్పుడంటావా! ఎప్పుడంటే...ఆఁ ఆఁ నీ కోసం ఎరుకత వేషం వేశాను. ఎరుకలసాని (కొరవంజి)గా నీ దగ్గరికి వచ్చి నీ అందం చూస్తూ,



నీ చేయి పట్టుకుని సోది చెప్పాను. అదే భూలోకంలో నిన్ను తొలిసారిగా స్పృశించిన ఆనందవేళ.

అంతా దొంగవేషాలు, కొంటె బుద్ధులూను. ఈ వేషాలు ఈ బుద్ధులు ఈ నాటివా ఏమన్నానా?

ఇంతకూ. ఆ ఎరుకలసాని (కొరవంజి) వేషంలో నేను అందంగా ఉండినానా! దేవీ!

ఆఁ! అవును స్వామీ! బలే అందంగా వుండినారు. వేషమే కాదు మీ మాటలతీరు కూడా చాల సొంపుగా వుండి నాకు బలే హాయిని చేకూర్చాయి. ఎంతైనా ఎన్నో వేషాలు మార్చిన వింతదొంగవు కదా!

ఎన్ని వేషాలు మార్చినా, ఏ అవతారం ఎత్తినా లోకకల్యాణం కోసమేకదా దేవీ!

అది సరే స్వామీ! నాదో చిన్న కోరిక! మన వివాహదినోత్సవం సందర్భంగా కోరుతున్న నా యీ చిన్ని కోరికను తీర్చరూ!

(ఉల్కికిపడుతూ) మాయలేడిని తెమ్మని అడిగినట్లు మళ్లీ వింత కోరిక లేమిటి? ఆనాటి విపరీతపు కోరికతో ఎన్ని ఇక్కట్లు అనుభవించామో! అప్పుడే మరచిపోయావా! దేవీ! ఇక చాలు. నీవు కోరనూ వద్దు. నేను తీర్చనూ వద్దు.

ఎన్ని వింతకోరికలు కోరినా, మనం ఎన్ని కష్టాలు అనుభవించినా లోకకల్యాణం కోసమే కదా! భక్తులను అనుగ్రహించడానికే కదా స్వామీ! దయచేసి నా కోరికను తీర్చరూ!

ఫ్చ్! సరే తప్పుతుందా! పెళ్లాం మాట వినని మగనికి మనశ్శాంతి వుంటుందా! ఇంతకూ నీ కోరికేమిటో!

ఏమీ లేదండీ! మళ్లీ మిమ్మల్ని ఆనాటి ఎరుకలసాని వేషంలో మీ సోయగాలు చూడాలనీ, మళ్లీ మీ సోది మాటల సొంపులు వినాలనీ కుతూహలంగా వుందండీ!

ఇదేమి కోరిక! విచిత్రపు కోరిక! అయినా ఆ నాడంటే నా కోసం నీకు సోది చెప్పాను. మరి ఈనాడు ఎవరికి చెప్పాలి నా సోది!

ఎవరికేమిటండీ... మన భక్తులకు చెప్పండి. దీంతో భక్తులను అనుగ్రహించినట్టూ వుంటుంది. నా మురిపెం తీర్చినట్టూ వుంటుంది.

సరే...తప్పుతుందా...బేగి తెములు మరి!

* * * * *



ఎరుక... సెబుతానమ్మ... ఎరుక! ఎరుకో! ఎరుక! సోది సెబుతానమ్మ! సోదో! సోదెమ్మ! సోదో! సోది!

కొండదేవరమీద ఆన! ఉన్నదున్నట్టు సెబుతాను. జరిగిందీ సెబుతాను...జరిగేదీ సెబుతాను. జరుగబొయ్యేదీ సెబుతాను. ఎరుక సెబుతానమ్మ! ఎరుకో! ఎరుక! సోది సెబుతానమ్మ. సోదో! సోది!

ఓ సోదమ్మా! ఇలారా!

ఓ ఎరుకమ్మా! ఇటు... ఇలారా!

ఓ ఎరుకలీ! నిన్నే... ఇటు... ఈ వైపు ఈ వైపు ముందుగా రా...

మా తల్లె! మాతంగ్రి! వత్తున్నా... వత్తున్నా.



అందరికీ సోది సెబుతా... తొందర సెయ్యమాకండి. దరమ పెబువులు అందరికీ కలిసి కట్టుగ సెబుతాను. మా బాగా సెబుతాను. అందరూ సెవి బెట్టి ఇను కోంగ్రి... బాగా ఇనుకోంగ్రి... మా పెగ్గెగా సెబుతాను. మా కొండదేవరమీద ఆన! అయ్యిందీ సెబుతా. అయ్యేదీ సెబుతా. వున్నదున్నట్టు సెబుతా. సత్తెమే సెబుతా. కాదు...కాదే తల్లె! నేం జెప్పిందే సత్తెమవుతాదె తల్లె! నామాట ఏదమే బిడ్డ!

శాట్లో సేతినింద శారెడు ముత్తాలు పొయ్యండె తల్లె! దోసెడు రత్నాలు పొయ్యండె తల్లె! సేతి నింద... కానిక... పెట్టుకోని బాగా మొక్కోంగ్రి మరి! కొండదేవర బాగా పలికిస్తదు!

* * * * *

యాణ్ణించి వచ్చిందవు అని నన్నే అడ్గుతుందరు? దొరా! మా కొండదేవర ఎవరు అని అడ్గుతుందరు? ఇద్గో సత్తెంగ సెప్తున్నా బాగా ఇనుకోంగ్రి మరి!

ఏడుకొండల యనకాల వున్న గూడెంనుండి వచ్చింద దొర! ఏడుకొండలు దిగి వచ్చింద దొరసాని! ఆ కొండల మద్దెన ఒక బంగారు గుడిశుండాదె తల్లె! గుడిశలోన కొలువై వుండే కొండదేవరే మా ఎరుక (జ్ఞాన) మారాజు తల్లె! ఆ మారాజు సాచ్చిగా వున్నదున్నట్టు ఎరుక సెబుతానమ్మ!... ఎరుక!

* * * * *

ఏంటే తల్లె! సల్లని తల్లె! ఈ బిడ్డకు సోది సెప్పమంటున్నవు గద తల్లె! నీ బిడ్డ బాగా సదువుకుంటాడా లేదా అని అడ్గుతుండవ్ తల్లె! బాగా సదువుకోని పెద్దోడవుతాడా అని ఆరాటపడుతుండవే తల్లె!... నేం జెప్పేది నిజమయితే ఔననవే తల్లె! లేకపోతే తలకాయ అడ్డంగ దిప్పే తల్లె!

• • • • • • •

అవును మల్ల! నామాట కల్ల ఎట్టవుతాదే తల్లె! నీ బిడ్డ పెద్దగా సదవాలే తల్లె! పెద్ద పెద్ద సదువులు సదవాలే తల్లె!

దానికేం జెయ్యాల అని నన్నే అడ్గుతుండవు మల్ల! ఇద్గో సిన్న సిట్క సెబుతున్నా! కాసింత గమనం బెట్టి ఇనుకోవే తల్లె! ఇనుకొని అట్టా నడుసుకో.

ఏడుకొండలమీద... ఏడేడు కొండలమీద ఎలసిన ఆదిగుర్వును బత్తితో కొలుసుకోవే తల్లె! అట్టా జేత్తివంటే నీ కూనకు బాగా సదువొత్తది. బాగా బాగ సదువుకోని పెద్దోడవుతాడే తల్లె!

• • • • • • •

ఏంటి అట్టా జూత్తవె? అర్తం గాలే! ఇడ మరసి సెబుతానే. నా మీద గురిబెట్టి ఇట్టే ఇనుకోమరి!

ఏడుకొండలమీది కొండదేవర! అదేనే మా ఎరుకమారాజు! పెనుమచ్చెంగా మారిండే! మచ్చెమంటె అర్తం గాలే! మచ్చెమంటే పెద్ద చాపనే తల్లె! సొరచాపనే తల్లె! మా కొండరాజు సొరచాపగా మారి, రాకాసిని ఇట్టే రాచి రంపాన బేట్టిండే! సత్తెమైన సదువుల్ని రచ్చించి బెమ్మ కిచ్చిండే. ఆ బెమ్మేమో ఏదాలిచ్చిన ఆ ఆదిగుర్వుకు వొంగివొంగి దండాలుబెట్టి... జాతర్లు సేసిండే! పద్దినాల జాతర్లు సేసిండే! ఆ బెమ్మ దేవుడు సేసిన జాతర్లు ఇప్పుడుగూడ ప్రతియాట గనంగా జర్గుతుండయే తల్లె!

గన్క నేం జెప్పేదేమంటే మీరు గూడ ఆ ఏడుకొండలమీది ఆదిగురుణ్ణి బత్తితో కొలుసుకోండ్రి. నీ బిడ్డకు బాగా సదువొత్తాదె! మా బాగా సదుక్కొని పెద్దోడవుతాడే తల్లె!

* * * * *

సోది సెబుతానమ్మ! సోదో!...సోదెమ్మ! సోదో!... సోది!

పెద్దగా జదివిండవ్ దొర! శానా... శానా... సదివిండవు... కాని దొరా! నీకు కొలువు దొరకలా. కొలువు అయితదా లేదా? అని సోది అడ్గుతుండవ్ దొర!

• • • • • • •



అవునుమరీ! మా కొండదేవర మీద ఆన! నాను సత్తెమే సెబుతాను. బాగా సదివిండవ్! మా బాగా సదివిండవ్ దొర! ఇంగ జదవాల్సింది ఏముంది దొర! గానీ... దొరా! కొలువుకోసం శానా శానా సోట్లు తిరుగులాడిండవ్! శానా దేవుండ్లకు మొక్కిండవ్. అన్ని దిక్కులు సూశిండవ్. అన్ని దిక్కుల్లోనూ నీకు సుక్కెదరయ్యింది దొర! కానీ ఒక్క దిక్కు మాత్రం నువ్ సూళ్లా దొర!

• • • • • • •

అదేం దిక్కు అని నన్నే అడ్గుతుండవ్ దొరా! ఏడుకొండల్లో కొలువై వుండే కొండదేవర దిక్కు నువ్ జూళ్లేదే మరి!

ఏం అట్టా జూత్తవు! అర్తం గాలే? ఏడుకొండ లెక్కి ఆడ బంగారు గుడిలోన కొలువున్న కొండదేవరకు దండాలెట్టుకో! కొలువు దొరుకుద్ది. నీకు మాంచి కొలువు దొరుకుద్ది దొర!

* * * * *

సోది సెబుతానమ్మ! సోది! ఎరుక సెబుతానమ్మ! ఎరుకో!... ఎరుక!

పెంటికూన! నువ్ మనువు గురించి అడ్గుతూవుండవే! అవునుగదే తల్లె! నీ మనువుగూర్చి కుమిలిపోతుండవ్ మరి!

మా కొండరాజు మీద ఆన! సత్తెమే జెపుతానే తల్లె! ఎందరో మనువాడ నిన్ను జూసింద్రు. గాని యెవురూ నిన్నొప్పలా! మరి ఈ జల్మానికి లగ్గయోగం వుందా? అని అడ్గుతుండవ్ బిడ్డా!

• • • • • • •

నీకు బేగి లగ్గయోగం ముంచుకొస్తుండాదే తల్లె! మా కొండరాజు మీద ఆన! నేం జెప్పేది సత్తెమవుతాదే తల్లె! ఏడుకొండలమీది కొండదేవరకు లగ్గం సేత్తానని వరపడవే బిడ్డ! అట్టా జేత్తివంటే, ఆరు నెల్లు తిరక్కముందే... అంటే ఆర్నెల్లల్లో సుక్కల్లో సందమామంటి మగడొత్తాడే బిడ్డ!

సిగ్గుపడమాకె... నేం జెప్పింది సత్తమే తల్లె! మళ్లీ నీ లగ్గానికి వత్తా! కొత్త కోక పెట్టాలె తల్లె!

* * * * *

ఎరుక సెబుతానమ్మ! ఎరుకో! ఎరుక!

సోది సెబుతానమ్మ!... సోదో!... సోదెమ్మ!... సోదో!... సోది!

సక్కంగా గూకోవె తల్లె! నీ పురసెయ్యి సూపించే తల్లె! సక్కని తల్లె! నీకు అన్నీ బాగుండయ్యే తల్లె! నీ కాపురం సక్కంగ సాగుతుండాదె తల్లె!

కానీ... తల్లే! నువ్ ఒక ఏదనతో కుమిలి కుమిలి పోతుండావె బిడ్డ! నువ్ మనుమాడి శానా రోజులయ్యిందే! నీ కడుపున కసుకాయైనా కాయలేదే తల్లె!

• • • • • • • •

ఏమే... అట్టా... జూత్తవ్! అర్తం గాలే?

ఇంకా నీకు బిడ్డా పాప పుట్టలా! అవును గదే! సత్తెమైతే ఔననే తల్లె! లాకపోతే తలకాయ అడ్డంగ దిప్పే తల్లె!

అయ్యయ్యో అట్టా ఏడుత్తవ్? ఆడది ఏడుత్తే ఇంట్లోని సిరిలచ్చి ఇట్టే జారుకుంటాదే తల్లె!

మా కొండదేవర సాచ్చి! నీవు కన్నయ్య లాంటి బిడ్డను తొట్ల ఎయ్యాల్నే తల్లె! నేం జెప్పేది సత్తెమే తల్లె! నా మాట ఏదమే తల్లె! రామయ్యలాంటి రత్నాన్ని నువ్ ఊపాల్నే తల్లె! నేం. జెప్పినట్టు సెయ్ మరి!

ఏడుకొండలమద్దెన బంగారుగుడిశుండాదే తల్లె! సిరి లచ్చి ...బూలచ్చి...జోడుపెట్టలతో... ఆడ కులుకుతున్నాడే మారాజు! ఆయనే మా కొండరాజు! ఆ సింగార రాయుణ్ణి, ఆ సిరిలచ్చి మగణ్ణి, తొట్ల ఏస్తానని



వరపడవే తల్లె! ఆ సామిని తొట్లో ఏసి ఊపుతానని సల్లంగ సాగిలబడి సక్కంగ కొలుసుకోవే తల్లె!

సెనారం... సెనారం... దీపం బెట్టి ఒక్క పొద్దువుండి సక్కంగ వరపడవే తల్లె! అట్టా జేత్తివంటే నీ కడుపు సల్లంగ పండుతాదే తల్లె! యాడాది తిరక్కముందే ముత్తెమంటి బిడ్డ నిన్ను మురిపిస్తాడే తల్లె! నీ ముంగిట్లో తిరుగులాడునే తల్లె!

నేం జెప్పేది సత్తెమే తల్లె! ఎంకన్న దొరను సక్కంగ కొలుసుకోవే తల్లె!... నీ కడుపు సల్లంగ పండుతాదే తల్లె!

* * * * *

సోది సెబుతానమ్మ!... సోదో!... సోది!

ఎరుకో! ఎరుక! సోదో! సోది!

దొర! శానా ఇబ్బందుల్లో వుండవు దొర! శానా శానా సిక్కుల్లో సిక్కిందవు దొర! దిక్కుమాలిన అప్పుల్లో మునిగివుండవు దొర!

నీ యింటిదానికి వొల్లు వొలుపులేదు దొర!

నీ బిడ్డకు లగ్గం కుదర్లా దొర!

నీ కొడుక్కు కొలువు దొరకలా దొర!

• • • • • • • •

అవును మల్లా! ఏడుకొండల యంకన్న సాచ్చి! నేం జెప్పేది సత్తెమవుతాది దొర! నా మాట ఏదం దొర!

రోగాల్తో, రొప్పుల్తో, అప్పుల్తో, శానా శానా నలిగిపోతుండవ్ దొర! శానా శానా బాదల్తో కుమిలిపోతుండవ్ దొర!

దొరా! నా నొక సక్కని సిట్కా జెపుత! మా కొండదేవర సాచ్చి! ఇక్కట్లన్నీ ఇట్టె తీరుతయ్! సంకటాలన్నీ సాఫీ అయితయ్.

మా కొండరాజు... అదే ఏడుకొండల ఎంకన్నదొరకు మీ తలచిక్కు ఇస్తనని మొక్కో దొర! ఇట్టే మీ చిక్కులన్నీ మాసిపోతయ్ దొర! నేం జెప్పేది సత్తెం దొర! మీ "తలనీలాలు" ఇచ్చుకుంటే దొర! అట్టే మీ "కళ్లనీలాలు" ఆగిపోతయ్ దొర!

* * * * *

సోది సెబుతానమ్మ! సోదో!... సోది! ఎరుక జెపుతానమ్మ ఎరుకో! ఎరుక!

ఓ ఎరుకమ్మీ! నిన్నే... ఇలారా!

మల్లి వత్తానే తల్లె! పొద్దు పోయినాదె తల్లె! ఏడుకొండ లెక్కాల తండ్రె! ఏడుకొండల మద్దెన గూడెం జేరుకోవాల్నె బిడ్డ! మల్లి వత్తానె తల్లె!

ఓ ఎరుకమ్మీ! ఓ ఎరుకలసానీ! ఇట్లారా! నిన్నే... ఓ ఎరుకలీ!... ఓ కొరవంజీ!

• • • • • • •

ఏమండీ! ఏమండీ! ఏమిటా కలవరింపులు! ఎరుకలసాని ఎవరండీ! శనివారంపూట రేడియోలో శ్రీ స్వామివారి సుప్రభాతం ఎంచక్కా వినపడుతుందో! లేవండి! లేవండి!!

మా శ్రీమతి మేలుకొలుపుతో అదిరిపడి కళ్లు నులుముకుంటూ లేచిన నాకు, ఎదురుగ్గా గోడపై ముసిముసిగా నవ్వుతున్న వేంకటేశ్వరస్వామి కనిపించాడు!!

**(1993 మే లో తిరుమల శ్రీపద్మావతీ పరిణయోత్సవం సందర్భంగా)**

**– "సప్తగిరి" మే 1993**

# 2. తిరుపతి గంగ జాతర

జగన్మాత శ్రీదుర్గాదేవి యొక్క రూపాలు అనంతకోటి. ఆ జగజ్జనని త్రిగుణాతీత. ఏకత్వంలో భినత్వం భిన్నత్వంలో ఏకత్వం అన్నరీతిగా కొన్ని ప్రాంతాల్లో 'ఎల్లమ్మ'గా మరి కొన్ని ప్రాంతాల్లో 'బతుకమ్మ'గా వేరొక ప్రాంతంలో 'పోలేరమ్మ'గా ఇంకా 'మరియమ్మ'గా – కనకదుర్గమ్మ గా ఇలా ఎన్నోరూపాల్లో ఆ పరాశక్తి ప్రజలచే మొక్కులందుకుంటున్నది.

రాయలసీమలో ముఖ్యంగా చిత్తూరు జిల్లా ప్రాంతంలో ఆ శక్తి స్వరూపిణి 'గంగానమ్మ'గా 'గంగమ్మ'గా అత్యంత భక్తి ప్రపత్తులతో కొలవబడుతున్నది. ప్రధానంగా కలియుగ వైకుంఠమయిన తిరుపతి క్షేత్రంలో గ్రామదేవతగా వెలసిన గంగమ్మ భక్తుల పాలిటి కల్పవల్లిగా కరుణామయిగా ప్రసిద్ధికెక్కింది.

తిరుపతి గంగమ్మ, తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి సోదరి అని అనూచానంగా భావింపబడుతున్నది. అయితే గంగమ్మ పేరుతో తిరుపతి పట్టణంలో ఇరువురు దేవతలున్నారు. ఒకరు తాళ్ళపాక గంగమ్మ, మరొకరు తాతాయగుంట గంగమ్మ.

తాళ్లపాక గంగమ్మ ఆర్టీసీబస్టాండు దగ్గరున్నది. తాతాయగుంట గంగమ్మ మునిసిపల్ ఆఫీసు వెనుక తాతాయగుంట చెరువు (పూర్వంవుండేది) ప్రక్కన వున్నది. అయితే వీరిరువురిలో తాతాయగుంట గంగమ్మే ప్రధాన దేవత.

కాని చరిత్రను పరిశీలిస్తే తిరుపతి పురానికి ప్రాచీనం నుంచి తాళ్లపాక గంగమ్మనే మొదటి గ్రామదేవత అని తెలియ వస్తుంది. క్రీస్తుశకం 15వ శతాబ్దంలో కడపజిల్లా తాళ్లపాకనుంచి తిరుపతి చేరుకొన్న అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని భక్తునిగా ప్రసిద్ధుడైనాడు. అప్పటి దేవస్థానం అధికారులో, లేదా భక్తులో చెరువును (ఇప్పుడు ఆర్టీసీ బస్టాండు వున్నచోటు) దాని ప్రక్కనే వున్న తోటలను భగవత్కైంకర్యానికై ఉచితంగా అన్నమయ్యకు ఇచ్చారు. ఆనాటినుండి దానికి తాళ్ళపాకంవారి చెరువని పేరేర్పడింది.

అయితే అప్పటికే గ్రామదేవత గంగమ్మ ఆ చెరువుగట్టున వెలసివున్నది. తాళ్ళపాకంవారి చెరువుగట్టున వున్న ఆమెను తాళ్లపాక గంగమ్మ అని పిలవడం కాలక్రమంగా ఏర్పడింది.

తాళ్ళపాక అన్నమయ్య తొలిసారిగ తిరుపతికి వచ్చినపుడు



**"వేంకటగిరి యొద్దనున్నట్టి**
**పల్లెలో గొల్లెలపాలింటి శక్తి**
**యల్లారునని మును లనిశంబు బొగడ**
**గనుపట్టు యా గ్రామంపు శక్తి**
**గనుగొని బహునమస్కారముల్ జేసి"**

ఊరి వెలుపలనున్న ఈ ప్రాచీన గ్రామదేవతను అర్చించిన తరువాతే తిరుమల కొండ ఎక్కినాడు. ఈ వృత్తాంతంవల్ల గంగమ్మ ఎంత మహిమాన్వితమైన దేవతగా ప్రసిద్ధి పొందిందో ఊహించవచ్చు. అన్నమయ్య పేర్కొన్నట్లుగా తాళ్లపాకగంగమ్మ వద్ద యాదవులు అర్చకత్వం నెరుపుతున్నారు.



ఇక తాతాయగుంట గంగమ్మ ఈమెను గూర్చి ప్రసిద్ధంగా ప్రచారంలో ఒక కథ వుంది.

తిరుమలలో శ్రీవేంకటేశ్వర స్వామిచేత "తాతా, తాతా!" అని పిలిపించుకొన్న వైష్ణవ భక్తాగ్రగణ్యుడొకరు వుండినారు. అప్పటి నుండి ఆ వైష్ణవస్వామికి "తిరుమల తాతాచార్యులు" అని ప్రసిద్ధి. ఆయనకే కాదు. ఆయన వంశీకులందరికీ తాతాచార్యులు అనే పేరు ఏర్పడింది. 16వ శతాబ్దంలో ఒక తాతాచార్యులు శిష్య సమేతంగా సంచారం చేస్తూ కడప మండలంలోని ఒక గ్రామానికి వెళ్లాడట!. ఆ ఊరి గ్రామదేవత గంగమ్మ ఉగ్రరూపిణియై, ఎందరినో పొట్టన బెట్టుకుంటూ వుండేదట! అది భరించలేని జనం, ప్రతి సంవత్సరం ఆమెకు జాతర చేసేట్లుగా, ఆ జాతర్లో నరబలి ఇచ్చేట్లుగా ఒప్పందం చేసుకున్నారు. ఆ దేవత అందుకు ఒప్పుకున్నది. అలాగ జాతర జరుగుతున్న సమయంలో ఈ తాతాచార్యులను పట్టుకొన్నారు. ఆయన శిష్యులు చింతించారు. అందుకాయన ఏమీ భయపడవద్దని చెప్పి శంఖచక్రాల ముద్రలను కొలిమిలో బాగా ఎఱ్ఱగా కాల్చి వుంచుకొన్నారు. అంతలో అ గంగమ్మ ఒకనికి పూనకం వచ్చి 'బలి! బలి! నరబలి!' అని అరుస్తూ వచ్చిందంట! అంతే వెంటనే తాతాచార్యులు శంఖ చక్రాల ముద్రలను వాని భుజంపై వేశారట! వెంటనే గంగమ్మ భీతి చెంది పారిపోజాచిందంట. కాని ఆయన మంత్రశక్తిచే పరుగెత్తలేక ప్రక్కకు తొలిగింది. అంతే ఆ ముద్రలవాతలు భుజం తప్పి వీపుపై పడ్డాయి. అప్పటి నుంచే 'తాతాచార్యుల వాతలు భుజం దప్పినా వీపు తప్పవు' అను సామెత ఏర్పడింది. ఆ గంగానమ్మ ఆచార్యులను శరణువేడింది. ఆమెను శిష్యురాలిగా చేసుకొని, అనుగ్రహించి, తనవెంట పిలుచుకొనివచ్చి, తిరుపతిలో అప్పటికే తమ అధీనంలో వున్న చెరువుకట్టపై ఆమెను ప్రతిష్ఠించాడు. అప్పటినుంచి ఆమె 'తాతాయగుంట గంగమ్మ'గా ప్రసిద్ధి పొందింది.

ఈ కథను పండిత ప్రభాకరులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "అన్నమాచార్యుల జీవిత చరిత్ర పీఠిక"లో తెల్పియున్నారు.

18వ శతాబ్దంలో కవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ "జలక్రీడా విలాసం" అనే యక్షగానంలో తాళ్ళపాక గంగమ్మను తాతాయగుంట గంగమ్మను, పేర్కొంటుంది.

చిలిపి కృష్ణుడు తేళ్ళను పట్టుకొని గోపికలకు కుట్టిస్తాడు. వాళ్లకు విషం ఎక్కి చిందులేయగా, గోపికల అత్త తేలుమంత్రం వేస్తుంది. ఇలా విభూతి చేత బట్టుకొని

"ధూ మాయలమల్లి, మళయాళ భగవతీ! నందవరచౌడేశ్వరీ! నారాయణవనం ఆమ్నాయాక్షి పరమేశ్వరీ! శివకంచి ఏకామ్రేశ్వరీ! జంబుకేశ్వరాఖిలాండేశ్వరీ, అరుణాచలేశ్వర వున్నామలేశ్వరీ! కాళ హస్తీశ్వరాజ్ఞానాంబ... చిదంబరేశ్వర శివశంకరీ! శ్రీశైలభ్రమరాంబ! కాలభైరవ! గణేశ్వరా! కోళాలమ్మా! కొల్లా పురెమ్మా! తాళపాక గంగమ్మా! తాతాయగుంట గంగమ్మా! మీకు మ్రొక్కెద యీ కులుకులాడుల సళుకు దించుడు. తరిగొండ నారసింహునితోడే! నాకు జెప్పిన గురుపాదమానే! దిగు! దిగూ!"

పై తేలుమంత్రంలో ప్రసిద్ధ క్షేత్రాల్లో వెలసిన శక్తిదేవతల సరసన తిరుపతి గంగమ్మ లిరువురిని పేర్కొనడంలో వీరుకూడ ఎంత మహిమాన్వితమైన దేవతలుగా ప్రసిద్ధి పొందినారో స్పష్టమవుతున్నది.

వీరిద్దరేగాక తిరుపతిలో వేషాలమ్మ, అంకాళమ్మ, ముత్యాలమ్మ, పోలేరమ్మ, నేరెల్లమ్మ, అను శక్తి దేవతలున్నారు. వీరందరూ అక్కాచెల్లెళ్ళని వ్యవహారంలో వుంది. వీరందరి పుట్టిల్లు తిరుపతి సమీపంలోని అవిలాలగ్రామం. ప్రతి జాతరకు అక్కడినుంచే ఈ దేవతలకు పసుపు కుంకుమలు వస్తాయి.

తిరుపతి గంగమ్మ జాతర ప్రతి ఏటా తమిళమాసం చిత్రినెలలో చివరి మంగళవారంనాడు జరుగుతుంది. అంటే తెలుగు వైశాఖమాసంలో (మే నెల) వస్తుంది. ఈ చివరి మంగళవారానికి ఎనిమిదినాళ్లు ముందునుంచే జాతర సంరంభం ప్రారంభమవుతుంది. అంటే మరుసటిరోజు బుధవారం నుండి ఏడురోజులపాటు ప్రతిరోజు ఉదయం సాయంత్రం రెండు పూటలు వేషాలువేసి, 'వేషాలమ్మ' గుడినుండి ప్రారంభించి ఊరంతా తిరిగి చివరకు తాతాయగుంట గంగమ్మ దగ్గరి కెళ్లి మొక్కులు చెల్లించుకుంటారు. గంగమ్మజాతర చాటింపు వేసినపుడు ఈ గ్రామస్థులు ప్రయాణం చెయ్యరు. ఒకవేళ తప్పనిసరిగా ప్రయాణం చెయ్యవలసివస్తే జాతర రోజుకైనా తప్పక తిరిగి వచ్చేస్తారు.



1895 సంవత్సరంలో ముద్రింపబడ్డ మద్రాసు నార్తార్కాటు డిస్ట్రిక్టు మాన్యూవల్‌లో ఈ గంగజాతర విశేషాలు సుస్పష్టంగా ఇలాగ పేర్కొనబడ్డాయి.

గంగజాతరకు వారం రోజులముందుగా బుధవారంనాడు ఉదయం 'బైరాగి వేషం', ఆ సాయంత్రం పామువేషం వేసేవాళ్లట. ఇలాగ వరుసగా బండ వేషం, తోట వేషం వేసేవారు. అయితే ఆదివారం పొద్దునపూట వేసే 'మాతంగి వేషం' చాల ముఖ్యమైందిగా పేర్కొనబడింది. ఈ మాతంగి వేషాన్ని సాధారణంగా కైకోలన్ (సాలె కులస్థులు) వేసేవారు. ఈ వేషం వేసిన భక్తుడు అమ్మవారి విగ్రహం ముందుగాని, అమ్మవారి చిహ్నం ముందుగాని, వాయిద్యాల కనుగుణంగా మైమరచి నృత్యం చేస్తాడు. ఇతనికి నాలుకలో ఒక లోహపు తీగను గుచ్చేవారు. అయితే నొప్పిగాని, రక్తం కారడంగాని ఏవీ కన్పడేవి కావు. ఇలా వారు మహంతులమఠంముందు, బ్రాహ్మణుల ఇండ్లముందు నృత్యంచేస్తూ, సాగిపోయి గంగమ్మకు మొక్కు చెల్లిస్తారు. ఆ తరువాత అతని నాలుకలోని తీగ తీసివేసి ఇంత వేపాకు, బండారు (పసుపుకుంకుమ) నమిలి మింగితే ఆ గాయం మానుతుంది.

ఇలాంటిదే మరోవేషం సున్నపుకుండ వేషం వేసిన వ్యక్తి ఆడవేషం వేసి, తలపైన సున్నంపూసిన మూడు కొత్తకుండలను దొంతర్లుగా పేర్చికొని

వాటిని క్రిందపడకుండా తలవెంట్రుకలతో కుండలకున్న రంధ్రాలద్వారా బిగించి కట్టుకుంటాడు. అతనూ మైమరచి వాయిద్యాల కనుగుణంగా నృత్యం చేస్తూ అక్కడక్కడ ఆనవాయితీగల ఇండ్లలో పూజలందుకుంటూ వారికి ప్రసాదంగా పసుపు, కుంకుమలను ఇవ్వడం జరిగేదట! ఈ సున్నపు కుండవేషం ఏ మార్పు లేక ఈ నాటికీ (1987) వేయబడుతున్నది దీనిని కూడా సాలె కులస్థులే వేస్తారు.

గంగజాతర రోజున మంగళవారం ఉదయం పురుషులు నడుములకు వేప మండలు కట్టుకొని, కాళ్ళకు గజ్జెలు కట్టుకొని, కళ్లకు కాటుక, తలకు పూలు పెట్టుకొని, చప్రములను (సప్రాలు) మోస్తూ వేషాలమ్మ గుడిదగ్గర ప్రారంభించి తప్పెట్లు తాళాలతో ప్రధానవీధులగుండా ఆడుతూ గంగమ్మగుడికి పోతారు. ఈ సప్రాలు గోపురాకారం లేదా రథం మాదిరిగా వెదుళ్ళతో చేయబడతాయి. వీనికి బెండుతో చేయబడిన చిన్నచిన్న చిలుకలు మనుషులు బొమ్మలు వేలాడగట్టబడివుంటాయి. ఆ వెదురు గోపురానికి నాలుగుమూలలా వున్న వెదురుదబ్బల కాళ్ళను వెనుక వీపున రెండు కాళ్లు, ముందు రొమ్ముక్రింద తిత్తికడుపు పై రెండుకాళ్లు చర్మంలో గుచ్చుకునేవాళ్లని 1895 నాటి మద్రాసు నార్తార్కాటు గజట్‌లో పేర్కొనబడింది. అయితే ఈనాడు సప్రాలను మోస్తూ వాటికాళ్లను తాళ్లతో కట్టుకొనడం మాత్రమే కన్పిస్తుంది. ఒక రకంగా కోటప్పకొండలో భక్తులుకట్టే ప్రభల లాంటివి ఈ సప్రాలు.

చివరగా 'పేరంటాలు వేషం' ఈ వేషాన్ని భర్తకంటె ముందుగా, సుమంగళిగా చనిపోయిన పుణ్యస్త్రీకి ప్రతిరూపంగా భావిస్తారు. పూర్వం సాలె కులానికి చెందిన స్త్రీ ఈ పేరంటాలు వేషం వేసి గుర్రంపై స్వారీ చేస్తూ అనూచానంగా అలవాటువున్న ఇండ్లలో పూజలందుకొంటూ పసుపు కుంకుమలు వారికి పంచుతుంది.

కానినేడు సాలెకులానికి చెందిన స్త్రీ కాక పురుషుడే ఈ పేరంటాలు వేషం వేయడం జరుగుతున్నది.



ఇలాగ ఈ 'పేరంటాలు' ఊరంతా తిరిగి తాతాయగుంట గంగమ్మ దగ్గరకు వస్తుంది. అక్కడ అప్పటికే బంకమట్టితో తీర్చి సిద్ధం చేసిన 5 అడుగుల గంగమ్మకు (తలమాత్రం) పూజలు చేస్తారు. ఆ తరువాత ఆ మట్టి విగ్రహాన్ని సూర్యోదయాత్పూర్వమే భగ్నం చేస్తారు. ఈ మట్టి బొమ్మల తతంగం ఇరువురి గంగమ్మలవద్ద జరుగుతుంది. జాతర రోజు ఈ గంగమ్మ లిరువురికి 1895 నాడు 20 దున్నపోతులు, 400 మేకలు, 700 కోళ్లను బలి ఇచ్చేవారని తెలియవస్తున్నది. అయితే నేడు కాలానుగుణంగా బలులు నిషేధింప బడినందువల్ల కొద్దిపాటి మేకలు, కోళ్లు మాత్రం చాటుగా బలి ఇవ్వడం జరుగుతున్నది.

నేడు ఈ జాతర రోజుల్లో రోజు కొక్కటి వంతున వేషాలు వేసుకొని, రంగులు, మసిబొగ్గు పూసుకొని వేపమండలు నడుముకు కట్టుకొని విచ్చల విడిగ తిరుగుబాలురు, యువకులు, పెద్దలు, పిన్నలు కనపడతారు. వేషాలు వేసుకున్నవారు గంగమ్మ పై బూతుపాటలు పాడుతూ వెళతారు. వారికి ఎదురుగా వీధిలో కనపడిన స్త్రీ పురుషులను విచక్షణ లేకుండా పచ్చి బూతులు తిడుతూ ఆనందంతో వెళ్లడం కనిపిస్తుంది. అయితే కాలక్రమేణా కులమత విచక్షణ లేకుండా వేషాలు వేయడం, గ్రామదేవతకు మొక్కులు చెల్లించడం జరుగుతున్నది.

అంతేగాక పిన్నలు, పెద్దలు, స్త్రీలూ, తడిబట్టలతో, వేయికండ్ల (రంధ్రాల) కుండల్లో చలిపిండితో జ్యోతిని వెలిగించి వేపాకులు కట్టిన ఆ కుండలను తలపై పెట్టుకొని, నడుముకు కూడ వేపాకు మండలు కట్టుకొని అత్యంత భక్తి శ్రద్ధలతో గంగమ్మ గుడులకు వచ్చి గుడి దగ్గర "గంగమ్మ గంగమ్మా కావవమ్మా! మా పిల్లా పాపలను రక్షించమ్మా గంగమ్మో గంగమ్మా" అని అర్తితో వేడుకుంటూ మ్రొక్కులిడుతూ ఆ కుండలను పగలగొడతారు. తరువాత అమ్మవారికి కాయ కర్పూరం సమర్పించి దర్శనం చేసుకొని వెళతారు. మరి కొందరి స్త్రీలు, పెండ్లి కాని యువకులు వంట సామగ్రిని, పసుపూ కుంకుమ పూసిన కొత్తబుట్టల్లో పెట్టుకొని బుట్టను తలపై పెట్టుకొని, గుడి

దగ్గరకు వచ్చి, అక్కడ మూడురాళ్ల పొయిలు పెట్టి పొంగళ్లను వండి అమ్మవారికి నివేదించడం ఈ జాతర సమయంలో ఎక్కువగా చూడవచ్చు. ఇలా బుట్టలతో వెళ్లిన అమ్మాయిలకు పెళ్లిళ్లు అవుతాయనీ, సంతానం లేనివారికి పిల్లలు కలుగుతారనీ వారి ప్రగాఢ విశ్వాసం.

తిరుపతిలో జరుగుతున్న ఈ జాతర మాదిరే ప్రాచీనరోములో ఇలాగే ఒక సంప్రదాయం వేడుక జరుగుతున్నదని చెప్తారు.

ఇంతేగాక శ్రీవేంకటేశ్వరుని చెల్లెలైన గంగమ్మ ఒక రక్కసుని ఏడు రోజుల్లో ఏడు రూపాలలో (వేషాలతో) హోరా హోరీ యుద్ధంచేసి వానిని సంహరించిందట! ఆ గాథకు జ్ఞాపకంగానే ఈ జాతర అని అంటారు. ఇందుకు నిదర్శనంగా చివరిరోజు ఒకనికి చంపబడిన రాక్షసుని వేషం వేసి బండిమీద పెట్టుకొని గ్రామం పొలిమేరలోనికి తీసుక వెళతారు. గంగజాతర ముగిసిన తరువాతనే వానికి గ్రామ ప్రవేశం కలిగిస్తారని నార్త్‌ఆర్కాటు గజిట్‌లో తెల్పబడింది. ఇప్పుడు రక్కసుని వేషం ప్రచారంలో లేదు.

ఈ వేషాలన్నీ అలనాడు గంగమ్మ దాల్చిన రూపాలకు ప్రతీకలుగా భావిస్తారు. అందువల్లే ప్రతివేషంలోనూ స్త్రీ సంబంధించిన వస్త్రాలంకరణ కన్పిస్తుంది.

ఇలాగ మారుతున్న కాలంతో పాటు, ఎన్ని ఆచార వ్యవహారాలు మారినా, తిరుపతి ప్రాంతం ప్రజల్లో నాటికీ నేటికీ గంగమ్మ ఎడల భయమూ, భక్తీ ఏ మాత్రం సడలలేదని చెప్పవచ్చు.

తిరుపతి గంగమ్మతల్లి కొలిచినవారి కులదైవం! ఆయమ దప్పి దీర్చు కాలమేఘం! ప్రజలను బడిబాయక రక్షించే చింతామణి! కోరినవారి కోరికలిచ్చే కామధేనువు! ఆ చల్లని చూపుల తల్లి రోగాల నడచి రక్షించే దివ్యౌషధం! అమ్మలగన్నయమ్మ ఆర్తుల పాలిటి ఆనందవల్లి! భక్తులపై అమృత జల్లులు కురిపించే దయాస్వరూపిణి తిరుపతి గంగమ్మ!

# 3. అలమేలుమంగ అనుగ్రహం

ఊరికి ఒక వేపున దట్టంగా పరచిన తివాసీలా పచ్చని పంట పొలాలు. ఆ పొలాల్లో పాడుకుంటూ పనిచేసికుంటున్న పల్లె జనం. మరొకవైపు గట్టున వున్న కొబ్బరి, తాటి చెట్లను ప్రతిబింబిస్తూ అద్దంలా మెరుస్తున్న పెద్ద చెరువు. ఆ చెరువు గట్టున కొంతదూరంలో గుడి ఎవరైనా ఆ గుడి గోడలనూ, గోపురాన్ని పరిశీలనగా గమనిస్తే, వారికి ఆ గుడి చాలా ప్రాచీనమైనదని తోస్తుంది. ఆ గుళ్లో రెండడుగుల పీఠంపై చెన్నకేశవస్వామి నిలువెత్తు విగ్రహం. పక్కన వున్న చమురు దివ్వె వెలుగులో స్వామి విగ్రహం కొత్త కాంతులు వెదజల్లు తున్నది. అది మిట్ట మధ్యాహ్నం. ఆ లోగిలిలో ఎనిమిదేళ్ల బాలుడు తక్క మరొక్క మనిషి అలికిడి వున్నట్టు లేదు. ఆ బాలుడు ఇలా పాడుకుంటున్నాడు.

"చిన్న చెంబుతో నీళ్లు శీకాయ యుదకంబు
అల్లంబు బెల్లంబు అరటి పండు
తేనెతో మాగిన తియ్య మామిడి పండు
బంగారు పిడికిళ్లు పనస తొనలు
సొగసిన యోగులు సొజ్జెలు, కజ్జలు
చక్కెర మండగ లుక్కెరాళ్లు
అర్సెలు సిమ్మిలు...దోసెలు కల్లొసుల్
పాలకు లేలకుల్...పాలపొంగు
పోళి బురదాలు, గారెలు బూరె చుట్లు
అప్ప దప్పలున్ పప్పును పాయసములు
అమ్మ పంపెను ఆరంగిపన్న! బుజ్జి
అన్నయ్య వరదాళ్లుండు బుచ్చెన్న కేశ!"

ఆ పాట పరమ శ్రావ్యంగా వుంది. పాట ముగించాడు. అన్నా! బుజ్జి చెన్నకేశవా! అమ్మ నీకు స్నానం చేయించ మన్నది. అరటిపండ్లు, తేనెతో



మాగిన తియ్యమామిడి పండ్లు...మరేమో...మరేమో పనస తొనలు, చక్కెరమండగలు...అరిసెలు, పానకము ఇంకా... ఇంకా గారెలు, బూరెలు... ఇవన్నీ నీకు నివేదించమన్నది. నేను చిన్నవాణ్ని కదా...నీవేమో నా కంటె ఎత్తులో వున్నావే నాకు అందడం లేదు. మరి నేనొక ఉపాయం చెప్పనా? నీవేమో కొంచెం వంగు. అప్పుడు ఈ శీకాయ నీళ్లతో నీకు స్నానం చేయిస్తా. సరేనా? వంగుమరి!

ఆ బుజ్జి బాలుని మాటలకు చెన్నకేశవుడు చిరునవ్వులు చిందించాడు. ఆ అర్భకుడు చెప్పినట్లు ఊఁకొట్టి తలవంచి వంగినాడు. ఆ చిన్నవాడందించిన వన్నీ ఒక్కొక్కటే తృప్తిగా ఆరగింపు చేశాడు.

"ఏరా! అన్నయ్యా! వట్టి పళ్లెంతో ఇంటికి రావడం వరుసగా ఇది మూడోరోజు. ఆఁ మీనాయన ఊళ్లోలేడు. అన్నలకు పొలం పనులతో తీరిక లేదని నిన్ను గుడికి పంపితే నీవు చేసే నిర్వాకం ఇదా. స్వామికి పంపిన నైవేద్యమంతా తిన్నదిగాక, పైగా అసత్యం కూడానా, తాను ఒక్కొక్కటే అందించాడట! పాపం ఆ స్వామి గంగిరెద్దు వలె తలూపుతూ అన్నీ తిన్నాడట! ఒరేయ్ అబద్ధం చెప్పినా అతికినట్లు వుండాల్రా!" అని అన్నమయ్యతల్లి లక్కమాంబ కసురుకుంది.



"పనిలేదు పాటాలేదు పైగా ఇదొహటి! పొట్ట పగలతినడం కూనిరాగాలు తీస్తూ పాతగుళ్ల చుట్టూ తిరగడం" అని చిన్న వదిన దెప్పి పొడుపు.

"ఆ పశువులే నయం. గడ్డితిని వళ్లు దాచుకోకుండా పొద్దస్తమానం పని చేస్తాయి. నువ్వూ వున్నావ్ ఎందుకూ, మా ప్రాణానికి శని లాగ. దండగ తిండి తినడం. ఆదండె పట్టుకొని పనికిరాని పాటలు పాడటం" అని పెద్దొదిన సూటిపొడుపు.

"పశువులకు పొద్దుట్నుంచి గడ్డే లేదు. పొలానికెళ్లి తీసుకు రాపో" అని మరోవదిన హుకుం.

వాళ్లమాటలు శూలాలవలె గుచ్చుకున్నయ్. కళ్లనీళ్ల పర్యంతమయింది. కొడవలితో పొలానికి నడిచాడు అన్నమయ్య.

ఏదో వ్యథ. తెలీనిబాధ. ఏదో ధ్యాసతో గడ్డిని పరపర కోస్తున్నాడు. ఒకవైపు వదినగార్ల సూటిపోటి మాటలు చెవుల్లో గింగురు మంటున్నాయి. మరొకవైపు చెన్నకేశవుడు తాను పెట్టిన అన్నం ఆరగించిన దృశ్యం. కళ్లల్లో మెదలుతూనే వుంది. పరధ్యానంగా వున్న అన్నమయ్య గడ్డితో పాటు తనవేలిని కూడ కోసుకున్నాడు. కారుతున్న రక్తం కళ్ళబడింది. బాధగా మూలిగాడు. చేతి నుండి కొడవలి ఎప్పుడు జారిపోయిందో తెలియదు.

**"తగ బంధులా తనకుఁ దల్లులునుఁ దండ్రులును**
**వగలఁబెట్టుచుఁ దిరుగువారే కాక"**
**అంత హితులా తనకు నన్నలును దమ్ములును**
**వంతువాసికి బెనఁగువారే కాక..."**

అని ఉద్రేకంగా ఊగిపోయింది మనస్సు.

అంతలో అటుగా తిరుపతికి వెళ్తున్న యాత్రికుల బృందం కంటబడింది. అంత బాధలో కూడ అన్నమయ్య వారి గోవిందనామ భజనను వింటూ వారి వైపు ఆసక్తిగా చూచాడు.

వారంతా తనను చూచి చిరునవ్వు చిందించారు. ఆ నవ్వులో అన్నమయ్యకు అనంతార్థాలు పొడసూపినాయి. ఈ మార్గమే నిత్యమూ సత్యమూ కూడా. మమ్ములను అనుసరించి మాతో రా! అని తనను వారు పిలిచినట్లు అయింది అంతే!

**"తల్లియుఁ దండ్రియు దైవంబు గురువు**
**నెల్ల సంపదలు యెల్ల చందముల**
**నను బ్రోచు శేషాద్రినాథునిఁ గొలిచి**
**మనియెద ననుచు ... ... ... ... ...॥**

మనసును పదిలం చేసుకున్నాడు. తనకు తెలియకుండానే వారిలో ఒకడుగా కలిసి తిరుపతికి అడుగులు వేశాడు.

బాల అన్నమయ్య భజన చేసికుంటూ ఆడుతూ పాడుతూ తిరుమల కొండ ఎక్కుతున్నాడు. మొదట అలిపిరిలోవున్న శ్రీవేంకటేశ్వరుని పాదాలను సేవించినాడు. కొండల కోనల రామణీయకతను ఆహ్లాదంగా చూస్తున్నాడు. ఆ ప్రకృతిని చూస్తున్న కొద్దీ ఆ బాలునికి ఆనందం కలుగుతున్నది. అలాగే వాటిని కొంతసేపు నిలిచి చూస్తూ మురిసిపోతున్నాడు. మరికొంతసేపు భక్తితో తన్మయించి పాడుతూ అడుగులేస్తున్నాడు.

తలయేరు గుండు, చిన ఎక్కుడు, పెద ఎక్కుడు కర్పూర కాలువ... ఇలాగ అన్నీ కనులార తిలకిస్తూ నోరార గానం చేస్తున్నాడు. ఆ లోయలన్నీ తన గానంతో ప్రతి ధ్వనిస్తుండగా పక్షుల కిలకిలా రావాలు తన పాటకు వంత పాడుతున్నట్టనిపించేది. తన పాటనాపి ఆ పిట్టల రాగాల హోయలను గమనిస్తున్నాడు. అచ్చటచ్చటలేళ్లను దుప్పులను చూస్తున్నాడు, వింత అనుభూతితో పరవసించిపోతున్నాడు.

వెంట వున్నవారు ఇతన్ని గమనించ కుండానే ముందుకు సాగిపోయారు.





ఎఱ్ఱటి ఎండ దట్టంగా వుంది, పాపం అన్నమయ్య ఒక్కడుగా వెనుక మిగిలినాడు.

అలసివున్నట్టున్నాడు, ఆకలిగా వుంది. నాలుక పిడుచకట్టింది అలాగే కాళ్లీడ్చుకుంటూ అవ్వాచరికోన దాటాడు, ఇక మిగిలింది మోకాళ్లపర్వతం.

ఇంకా ఎంత దూరముందో స్వామివారి కోవెల. ఇంకా ఎన్నిమెట్లు ఎక్కాలో, తాను ఇదె మొదటి సారి కొండకు రావడం".

రెండు మూడు మెట్లెక్కాడు. కళ్ళు బైర్లు కమ్మినట్లునిపించింది. అరెరె ఇంతలో నాకేమయింది.

"అమ్మో! అయ్యో! గోవిందా! నన్ను ఎవరో తోస్తున్నట్లుంది. రక్షించండి!" అని అరుస్తూ స్పృహ లేకుండా కూలబడ్డాడు అన్నమయ్య.

"అన్నమయ్యా! లే లే తొందరగా లే లే" – అన్న పిలుపుతో అన్నమయ్యకు మెళకువ వచ్చింది.

తానెక్కడున్నాడు? ఎంత సేపుయింది. తానిలాగపడి? తన నెవరు పిలుస్తున్నారు? పిలుపు వినపడుతున్నది కాని మనుషులెవరు కనపడ్డం లేదే, ఇది తన భ్రమా! ఆకలితో తనకు కలుగుతున్న చిత్తభ్రమ! కాదుగదా!"

ఏదో తెలియని ఉద్రిక్తత... ఆరాటం... తనను ఏదో ఆవహించిన విషయం అప్పుడు తెలుసుకున్నాడు అన్నమయ్య.

"అన్నా! లే నాయనా! ఇటు చూడు!" అరె! మళ్ళీ అదె పిలుపు.

ఆ పిలుపులో ఎంత ఆత్మీయతవుంది. అరమరికలు లేకుండ హృదయం లోంచి... మనసులోంచి... పలుకరిస్తున్నట్టు వింత అనుభూతి కలుగుతున్నది తనకు.

ఆత్రుతతో చుట్టూ కలయచూశాడు అగమ్యగోచరం "అమ్మా ఎవరు నీవు? నాకేమి కన్పించడం లేదు తల్లీ! అనుగ్రహించి కాపాడవమ్మా!"

"నాయనా! నేను వేంకటేశురాణి అలమేలుమంగను. ఇది తిరువేంకటపుకొండ. అంతా సాలగ్రామమయం. కాళ్ళజోళ్లతో ఎక్కడం మహాపాపం జోళ్ళువిడిచి చూడు. నీకు అంతా అర్థమవుతుంది. గోచరమవుతుంది"

వెంటనే కాళ్ళకున్న చెప్పులను విసిరివేశాడు అన్నమయ్య. ఆ కొండంతా కోటిసూర్యకాంతుల దివ్యతేజస్సు వ్యాపించివుంది ఎదురుగా జగజ్జనని అలమేలుమంగ!

"అమ్మా! నా జన్మ చరితార్థమయింది. అంటూ చుట్టూ పరికించాడు. అరె ఎంత విచిత్రం. ఇవి రాళ్ళూ రప్పలు కాదే. సాక్షాత్తూ శ్రీలక్ష్మీనృసింహ స్వామి సాలగ్రామాలు. ఇదిగో ఇటువైపు విష్ణుసాలగ్రామాలు. అటువైపు రామ... కృష్ణ... అరెరె ఈ కొండంతా సాలగ్రామాలమయం. ఎంత అపరాధం చేశాను తెలియక చేసిన అపరాధం క్షంతవ్యం అంటారు కదా! తల్లీ!" సాష్టాంగపడ్డాడు అన్నమయ్య.

అలమేలుమంగ చిరునవ్వుతో అన్నమయ్యను లేపి కూర్చుండ బెట్టింది.



**"శౌరియుఁదాను నిచ్చలు పొత్తుఁగలసి**
**యారగించిన ప్రసాదాన్నముల్ దెచ్చి**
**పరిపరి రుచుల నేర్పడ సేద దేర**
**పెరిమతో భుజియింప బెట్టి..."**

తిరుమలప్పని కొండ అదిగో... అరుగుమటంచు... అయ్యరవింద వదన అలమేలుమంగ అన్నమయ్యకు కొండకు దారి చూపింది.

వింత వింత కాంతులతో వెలిగిపోతున్న తిర్మలకొండకు నమస్కరించాడు. వెంటనే భక్తితో అన్నమయ్యకు కవిత్వం పెల్లుబికింది.

**చొచ్చితిఁదల్లి నీమఱుఁగు సొంపుగ నీ కరుణా కటాక్షమె**
**ట్లిచ్చెదొ నాకు నేఁడు పరమేశ్వరి యో యలుమేలుమంగ నీ**
**మచ్చిక నందు నీ తరుణి మన్నన నే నిను గంటి నీకు నా**
**బచ్చెనమాట లేమిటికి బ్రాతివి చూడగ వేంకటేశ్వరా!**

అని వరుసగా నూరుపద్యాలు అమ్మ మీద ఆశువుగా చెప్పాడు అలమేలుమంగ అంతర్థానమైంది.

అమ్మ అనుగ్రహం పొందిన ఆ బాల భక్తునికి అలసట తీరింది. కొత్తసత్తువ వచ్చింది. దివ్యతేజస్సు ఆవహించింది. మళ్ళీ శ్రుతిమధురంగా భక్తితో పాడుకుంటు కొండ ఎక్కడానికి ఉపక్రమించాడు.

**అదివో అల్లదివో హరివాసము**
**పదివేలు శేషులపడగలమయము**

**("సప్తగిరి"లో ప్రచురితం)**

# 4. అందరికీ శ్రీహరే అంతరాత్మ

"ఇయాల సనారం. సనారమంటే ఎంకటేసులసామికి బలే ఇట్టమంట". అందుకే గావాల్ను అట్నుంచీ, ఇట్నుంచీ ఇయాల జనాలు గుంపులు గుంపులుగా కొండకు జేరుకుంటున్నారు. ఎవురు ఎట్నుంచొచ్చినా ఆల్లందరూ దిగువ తిరుపతిలో గలవాల్సిందే. అందరూ అక్కన్నించే ఎగువ తిరుపతికి కాలి నడకన పోవాల్సిందే. కాలిదారిన మెట్లు అలిపిరి నుండి మొదలయితయ్. అలిపిర్లో ఎంకటేసులసామి పాదాలున్నై. కొండకు ఎల్లేవాల్లంతా ఆ పాదాలకు మొక్కుంటారు. అ పాదాల పక్కనే ఉన్న నరసింహులు సామికి పూజసేత్తరు. ఆనక కొండకు ఎల్తరు. కొండమింద సామికి మొక్కెట్టుకొని జుట్టిత్తరు. ఎరికయిందా". అని అరవై ఏళ్ల గోవిందు తన కొడుకు వెంకటయ్యకు చెప్తుతూ నడుస్తున్నాడు. వెంకటయ్యకు సుమారు ఇరవై ఏళ్లుండచ్చు.

నల్లగా నిగ నిగ లాడుతున్న భారీ శరీరం. తలపాగా, బుర్రమీసాలు, మెలికలు తిరిగిన బలిష్ఠమైన కండలు, మెడలో కంటె. ఎడమరెట్టకు తాయెత్తు, మోకాళ్లదాకా బిగించి గోచీగా కట్టిన పసుపులో తడిపిన పచ్చని పంచ. నొసటన పెద్దనామాలు. కుడిచేతిలో జ్యోతి వెలుగుతున్న నిలువెత్తు గరడ గంభం. ఎడమచేతిలో 'టంగ్ టంగ్' అని మోగిస్తున్న గుండ్రని కంచు పలక గంటతో గోవిందు చూపరులను ఇట్టే ఆకర్షిస్తున్నాడు.

గోవిందు భార్యా, పిల్లలతో, చుట్టాపక్కాలతో నెత్తిమీద మూటాముల్లెతో అప్పుడే అలిపిరి చేరుకున్నాడు. వాళ్ళంతా చాలదూరం నుంచి వచ్చినట్టుంది. వారి ముఖాల్లో అలసట స్పష్టంగా గోచరిస్తున్నది. వాళ్లు 'గోయిందా! గోయిందా!! అంటూ అలిపిరిలో నెత్తిమీది బరువుల్ని చెట్లకింద దించుకున్నారు. అందరూ కాళ్లు మొగాలు కడుక్కొని చల్లని మంచి తీర్థం సేవించి కాసేపు అలసట తీర్చుకున్నారు.

గోవిందు భార్యా, కోడలు, ఇతర ఆడవాళ్లూ మూటముల్లెల్ని విప్పి, చెట్ల కింద మూడురాళ్ళ పొయ్యిలుపెట్టి వంటకు ఉపక్రమించారు.





దారిపొడుగునా 'గోవిందా! ఏడుకొండలవాడా! వెంకటరమణా! గోవిందా! అని భజనచేస్తూ చీమల బారులాగా నడుస్తూన్న యాత్రికులతో అలిపిరి ప్రదేశమంతా కన్నుల పండువుగా ఉంది. కొందరు అక్కడున్న వెంకటేశుని పాదాలకు మొక్కి కొండను ఎక్కుతున్నారు. మరికొందరు కొండ నుంచి దిగుతూ అక్కడ మొక్కుకొని పోతున్నారు.

ఇదంతా గమనిస్తూ వెంకటయ్య 'ఇదే తాను తొట్ట తొలీత కొండకు రావడం. మా అయ్య శానాసార్లు వచ్చిండట. వాల్లందరికి మల్లే ఎప్పుడబ్బా కొండ ఎక్కేది? బువ్వ దిని అనక కొండెక్కాల గావాల్ను' అని ఆలోచిస్తున్నాడు.

"ఒరేయ్ యంకటన్నా ఎందిరా ఇందాకన్నించి జూస్తున్నా, బలే దీరగంగా ఆలోసిస్తుండవ్? రా! రా! బేగి లేసిరా! నీజుట్టు సామికియ్యాల ఇక్కడ గూకో. ఆ మంగలిసామి జుట్టు గొరుగుతాడు. సామీ! గోయిందా! గోయిందా! గోయిందా! అని మొక్కెట్టుకో! ఎరికయిందా?" అని గట్టిగా గోవిందు కేకేశాడు.

తండ్రి కేకతో ఈలోకంలోకి ఊడిపడ్డాడు వెంకటయ్య. "ఏందబ్బా! మా అయ్య ఇట్లాగంటడు. ఇక్కడ్నే సామిపాదాల దగ్గర జుట్టు గొరిగించు కోవాల్నా... మరి వాల్లందరు అట్లా జేస్తుండారా ఇక్కడ ఎవురూ జుట్టు తీసేయించుకోడం లేదే అందరు కొండ కెల్తుండారే. ఇందాకనే గదా అయ్య జెప్పిండు అందరు కొండకెల్లి జుట్టిత్తారని. మరిట్ల జెప్తుతాడేంది? అయినా అయ్యను ఈ ఇసయం అడ్గాల్సిందే."

"ఒరే యంకటిగా! బేగి లెమ్మర్లా అంటే ఏందిరే తెగ ఆలోసిస్తుండవ్?"

"అది గాదయ్యా! మనం జుట్టు ఇక్కన్నే ఇయ్యాల్నా? ఆల్లందరూ కొండమింద ఇత్తారని ఇందాక నువ్ జెప్పినవ్ గదనే! మరిక్కడ్నే జుట్టు ఇచ్చేయాల అని అంటేన్నావేందే? అయ్యా ఇక్కడొద్దే, అల్లందరికి మల్లే మనం పైకి ఎల్దాం అక్కడ సామికి మొక్కెట్టుకుందాం"

"ఓరి నాయనోయ్ మనం కొండెక్క గూడ్దు. పాపం వత్తదిరా. మనం పెద్దింటోల్లం. అంటరానోల్లం. ఇక్కన్నే మనం మొక్కెట్టుకోవాల. ఈ పాదాల దగ్గిర్నే జుట్టిచ్చుకోవాల" అని గోవిందు కొడుకును సముదాయించాడు.

"ఏందె అయ్యావ్ అట్లాగంటవ్. మనం ఎందుకెల్ల గూడ్దే? వాల్లంతా ఎల్లేది లేంది మనం ఎల్లగూడ్దా? వాల్లకు మల్లే మనం కూడా మనుసులం కామా?"

ఏందెహె! నీకేమన్న పిచ్చెక్కిందా? మనం ఎల్లగూడదంటే ఇనుకోవే. మనం మాదిగోల్లం. మనం ఎల్తే మా పాపం. మాతాత ముత్తాతలు ఇక్కన్నే మొక్కుకుంఢ్రి ఇయాల కొత్తంగ ఎల్తే సెడిపోతం యరికయిందా నాను జెప్పినట్టు ఇను 'లెంపలు ఏస్కో తప్పు కాయమని యంకటరవునసామికి దండాలెట్టుకో! అట్టా జేత్తివంటే నీ బిడ్డా పాపా సల్లగుంటారు."

"కొండెక్కితే పాపమని యవరు జెప్పింఢ్రే? దేముడు అందర్నీ ఒక మాదిర్నే పుట్టించింఢ్రే"

"ఏమేవ్ నీ కొడుక్కి పిచ్చెక్కిందే. నీవన్న జెప్పే. మనం కొండకెల్ల గూడదంటే ఇనిపించుకోడంలా. పిచ్చి సన్నాసి" అంటూ గోవిందు, భార్యవైపు చూశాడు.

"ఓరేయ్ యంకటయ్య! ఎందుకురా అట్టామాట్టాడుతుండావ్ మీ అయ్యమాట కొంచం ఇనుకోరా. మనం అంటరానోల్లం. మనం యవర్ని తాకగూడ్దు. ఇంక దేముడి కొండక్కడవా? తప్పు తప్పు బుద్దిగ ఇనుకో. ఆ



స్వామికి మొక్కొంటుకుంటేనే నువు మాకు పుట్టినావ్. ఆ దేముడి పేరే నీకు పెట్టుకున్నాం అని తల్లి ప్రేమతో వెంకటయ్యను మందలించింది.

ఓ యమ్మావ్! అక్కడ జూడే. అల్లంతా కొండకు ఎల్తున్నారే. వార్ని పుట్టించినట్టే దేముడు నిన్నూ పుట్టించిండు. నన్నూ పుట్టించిండు, మరి మన మొగాలమింద అంటరానోల్లు అని ఏమన్న రాసిపెట్టింఢ్రా? తెలిసీ, తెలియనోల్లు అట్టా తయారు జేసింఢ్రు. అట్టా మనల్ని అనగ దొక్కింఢ్రు. గన్క నేం జెప్పేదేందంటే అందరం కొండకెల్దాం. సామికి మొక్కిచ్చుకుందాం." అని వెంకటయ్య తల్లితో తన నిశ్చయాన్ని తెలియజెప్పాడు.

తండ్రి గోవిందు ఆలోచనలో పడ్డాడు.

"తన కొడుకు జెప్పుతున్నది నిజవే గందవాడు జెప్పేది బాగుండాది. ఆల్లూ ఈల్లూ జెపింది ఇనడమే గాని యప్పుడైనా సామిని కండ్లారా జూసినామా! నిజ్జంగా కొండకెల్లి సామిని జూస్తే... అమ్మో ఇంకేమైనా వుందా! పెద్దోల్లు కొండ ఎక్కనిత్తారా? ఎక్కనియ్యకుండా కొడ్తే మనోల్లను కాపాడేదెవరు? వద్దు, బాబో! వద్దు. యీణ్ని ఎట్టాగయినా బుద్ధి మార్పించాల. ఆ ఏడు కొండలసామే మా యంకణ్ని రచ్చించాల" అని గోవిందు తనలో తానే గొనుకున్నాడు.

ఎవరిమాటా చెవిన బెట్టని వెంకటయ్య "గోయిందా! ఏడుకొండలవాడా! యంకట్రవనా! గోయిందా!" అని భక్తితో అరుస్తూ రెండు మూడు అడుగులేస్తూ కొండ ఎక్కడానికి ఉపక్రమించాడు.

తండ్రి గోవిందు మాటలను పెడసరంగా తీసేస్తూ విమర్శిస్తున్న వెంకటయ్యను అక్కడ గుంపులుగా చేరివున్న జనం గమనిస్తూనే వున్నారు.

ఇదంతా ఒకవారగా నిలబడి చూస్తున్న ఒకరిద్దరు స్వాములు "ఈ వెధవలు కొండెక్కితే ఆ శ్రీనివాసుడు మైలపడడా? ఇక మా ఆచారాలు అడుగంటినట్టే. గంగపాలైనట్టే. నిత్యమూ స్వామికి జరిగే ఉత్సవాలు,

ఊరేగింపులు ఇక జరిగినట్టే. తరతరాలుగా నిత్యకల్యాణం పచ్చతోరణంగా వెలిగిపోతూ ఉన్న వేంకటాచలపుణ్యక్షేత్రం బీడయిపోయింది. వీణ్ని కొండెక్కకుండా నివారించే నాథులే లేరా?" అని బిగ్గరగా గొంతెత్తి గగ్గోలు పెట్టారు.

"ఒరేయ్ యంకటిగా! ఆగరా! ఎట్లా ఎక్కుతావురా. తిరుపతి కొండ. నీలాంటి వెదవలంతా కొండెక్కితే స్వామివారి కొండ మైలపడతదిరా." అని జనంలోంచి ఒక ఆసామి గొంతు కర్కశంగా వినపడింది.

అంతే! ఆ అరుపు వినవస్తున్న దిక్కు చూస్తూ ఆగిపోయాడు. మాదిగ వెంకటయ్య

"ఏందిరా! అంతగా గుడ్లు ఉరిమి ఉరిమి జూస్తావ్? మాదిగ వెదవా? చెప్పులు కుట్టుకొని బదికే నీవు, మీ అయ్య గోవిందుగాడు సెప్పిన మాటల్ని వినకుండా కొండెక్కుతావా? వల్లు ఏమన్న తిమ్మిరెక్కిందేమిరా?" అని మరో పెద్ద ఆసామి మీసం దువ్వుతూ చేతి కఱ్ఱ చూపాడు.

వెంకటయ్య శాంతంగా వారి తిట్లన్నీ భరించాడు.

మెల్లగా "అయ్యలారా. మేం తిరుపతి కొండెక్క గూడదని యవురు జెప్పింఱ్రు? మీరే అట్టాగజెప్పుతుండరు. మేం మాదిగ యదవలమే. మేం అంటరానోల్లమే. కాని, మీ తాత, ముత్తాతా సచ్చి మా పాలనే బడినారే. రేపు మీరు గూడ మాపాలనే బడతారే. మేం గుట్టిన సెప్పులనే ఏస్కోని తిర్గుతారే. ఇదేం న్యాయం? ఊల్లో ఎవురన్న చస్తే, మేమే దిక్కు. మేం మీ మాదిరి మడుసులమే గంద. మీరు జెప్పితే సరిపోయిందా" – అని సమాధాన మిచ్చాడు.

"ఒరేయ్ తల దిమ్మెక్కిందేం? కొండెక్క కూడదంటే మాకే నీతులు జెప్పుతావా? చండాలపు వెధవా" అంటూ అక్కడున్న పిల్లా పెద్దా అంతా వెంకటయ్యను చుట్టి ముట్టి కఱ్రలతో బాదారు.



"వాని తప్పుకాయండి బాబో! వాణ్ని సంపమాకండి" అని గోవిందు అందరి కాళ్లా వేళ్లాపడ్డాడు.

"నా యంకణ్ని కొట్టమాకండి. దరమ పెబువులు, తప్పు ఒగ్గేయండి. మాకు దేముడొద్దు, గీముడొద్దు, బాబో! ఆ దేముణ్ని మీరే కొలుసుకోండి. మేం మా ఊరెల్లిపోతం, అయ్యో! నా యంకడికి రగతం ఎట్టా కారుతుందో... మమ్మల్ని కాసే మారాజే లేడా? అని ఎంకడి తల్లి రోదించింది.

ఆ తల్లిదండ్రుల ఆర్తనాదాన్ని వెంకటేశుడే విన్నాడు కాబోలు.

ఇంతలో "ఆగండి! పశువును బాదినట్టు ఇంత మంది చుట్టు మూగి ఒకణ్ని బాదుతున్నారే? అతను చేసిన తప్పేమిటి?" అని ఒక కంచుకంఠం పలికిన మాటలు ఆలిపిరి అంతటా ప్రతిధ్వనించాయి. ఆ కంఠ ధ్వనికి ఎక్కడి వాళ్లక్కడ ప్రాన్పడి పోయారు. అందరి చూపులు ఆ స్వరం వచ్చిన వైపుకు తిరిగాయి. సర్వత్రా నిశ్శబ్దం ఆవరించింది.

ఎడమ చేతిలో దండె. నొసటికి, భుజాలకి, వక్షఃస్థలానికి బాగా దిద్దిన తిరునామాలు. తలమీద పొడవైన ఎఱ్రని పట్టు కుళ్ళాయి (టోపి). భుజాలను తాకుతూ వ్రేలాడుతున్న కర్ణాభరణాలు. మెడలో కంటె, చేతులకు కంకణాలు. కాళ్లకు కడియాలు. నడుము నుండి మోకాళ్ళ కిందికి పింజ పోసి కట్టిన పట్టుపంచె. కొండపై నిలిచిన ఆ హరి అవతారమే తాను అన్నట్టుగా కుడిచేత్తో కొండను చూపిస్తూ నిగనిగ మెరుస్తున్న నల్లటి శరీరకాంతి. సుమారు ఏభై ఏళ్ల వయస్సుండవచ్చు. తిరుమలలో వెలసివున్న శ్రీ వేంకటేశ్వరుడే సాక్షాత్తు ఆ విధంగా తరలి వస్తున్నాడేమో! అన్ని సంభ్రమాశ్చర్యాలు అందరి మనస్సుల్లో కలిగాయి. ఆయనను చూచిన క్షణంలోనే కొందరికి భక్తి ఏర్పడింది, మరి కొందరికి భయమూ కలిగింది.

"ఎందుకు అతణ్ని అట్లా హింసిస్తున్నారు? అతను ఏం అపకారం చేశాడు?" అందర్నీ ఆజ్ఞాపిస్తున్నట్లుగా అడిగాడు ఆ మహానుభావుడు. ఆయన

తీక్షణమైన చూపులను భరించలేక అందరూ తలలు వంచుకున్నారు. ఎవరూ నోరు మెదపలేదు.

వెంకటయ్య తల్లిదండ్రులకు తమను కాపాడవచ్చిన దేముడుగా గోచరించాడు. కాళ్ళపై పడి తమకొడుకు తప్పును కాయమని వేడినారు ఆయన వెంకటయ్యను దగ్గరకు రమ్మని చేసైగ చేశాడు.

రక్తం కారుతున్న గాయాలతో ఆ మహానుభావుని దగ్గరకు వెళ్లి "దండాలు సామీ! దండాలు మేం మాదిగోల్లమంట. అంటరానోల్ల మంట మేం కొండ ఎక్కగూడదంట. మేం కొండెక్కితే కొండ మైలవుతందంట సామికూడ మైలపడిపోతాడంట. అందుకే నన్ను ఇట్లా సావబాదిండ్రు. నా యీపు నుంచి ఎట్లా రగతం కారుతుందో సూడండ్రి. అల్లందర్లోనూ ఈ నెత్తురేగందా వుండేది. వాళ్లకు మల్లే మేమంతా మదుసులమే గంద. వాళ్లకు మల్లే మమ్మల్ని దేముడు పుట్టించిండ్రు. మేం కొండెక్క గూడ్దని ఎక్కడ రాసిండ్రు. ఎవరు రాసిండ్రు? సామీ తెలిసిన పెద్దోల్లు మీరే జెప్పండి" అని కాళ్ల మీద పడ్డాడు వెంకటయ్య.

పరిస్థితి అంతా అర్ధమయింది ఆయనకు. కరుణాపూరిత హృదయంతో వెంకటయ్యను కుడిచేత్తో స్పృశించి లేవనెత్తాడు. ఆ మరుక్షణంలోనే వెంకటయ్య గాయాలూ, బాధా అదృశ్యమయ్యాయి. ఆ విచిత్ర సంఘటనకు అక్కడి వారంతా ఆశ్చర్యపడ్డారు. ఆయన మహిమను తెలుసుకొని యావన్మంది భక్తితో సాష్టాంగ పడ్డారు.

'వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి' శ్రీ వేంకటేశ్వరస్వామికి సమానమైన దేవుడు ఇటు భూతకాలంలో లేడు. అటు భవిష్యత్తులోను ఉండబోడు. ఆ తిరువెంకట విభుడు ఆపన్నుల పాలిదైవం. అనాథరక్షకుడు, ఆశ్రిత వత్సలుడు, భక్త కోటికి కొంగు బంగారం. అలాంటి మహిమగల స్వామిని దర్శించడానికి వచ్చిన మీరంతా ఎంతో ధన్యులు. మీరంతా సాక్షాత్తు



శ్రీవేంకటేశ్వర స్వరూపులే ఆ హరి మనందరిలోనూ అంతరాత్మయై వున్నాడు అంతయూ విష్ణుమయమే.

పరమ వైష్ణవ భక్తాగ్రేసరులలో ఒకరైన తిరుప్పణాళ్వార్ పంచముడు కాదా? శ్రీరామచంద్రునికి ప్రీతిగా ఎంగిలి పండ్లను అందించిన భక్త శబరి ఏ జాతికి చెందిన స్త్రీ? ఆ శ్రీరామునితో ఆలింగన భాగ్యము నందిన గుహునిది ఏ కులము?

**"జాతు లన్నియు వృథా వృథా**
**అజామిళాదుల కది ఏ జాతి**
**జాతి భేదములు శరీర గుణములు**
**జాతి శరీరము సరిఁదోడనె చెడు"**

అందరూ ఆ ఘనవేంకటేశుని అనుగ్రహానికి పాత్రులు కావలసినవారే, కనుక ఈ వృద్ధుడు గోవిందయ్య అతని కొడుకు వెంకటయ్యను కొండ ఎక్కకుండా అడ్డుకొనే హక్కు మనకెవరిచ్చారు? అందరం కలిసే కొండను ఎక్కుదాం పదండి" అని ఉద్బోధించాడు ఆ పుణ్య పురుషుడు.

'ఆత్మవత్ సర్వభూతాని' అన్నట్లుగా అందరికి శ్రీహరే అంతరాత్మ, అందరికీ శ్రీహరే అంతరాత్మ! రండి! నడవండి" అంటూ ఇలా పాడుకుంటూ ఎడమ చేత్తో దండెను మీటుతూ, కుడిచేత్తో తిరుమల కొండను చూపిస్తూ కొండ ఎక్కడం ప్రారంభించాడు.

**తందనాన ఆహి తందనాన పురె**
**తందనాన భళా తందనాన**

**బ్రహ్మమొకటె పర బ్రహ్మమొకటె పర**
**బ్రహ్మమొకటే పర బ్రహ్మమొకటె ॥తంద॥**

**కందువగు హీనాధికము లిందులేవు**
**అందరికీ శ్రీహరే అంతరాత్మ**

**ఇందులో జంతుకుల మంతా నొకటే**
**అందరికీ శ్రీహరే అంతరాత్మ ॥తంద॥**

అందరికీ శ్రీహరే అంతరాత్మ

ఆ మహాభక్తుని గొంతుతో పాటు అక్కడ చేరిన జనం "అందరికీ శ్రీహరే అంతరాత్మ" అంటూ తమ గొంతుల్ని కలిపి పాడుతూ కొండకు నడిచారు. అప్పటికి తెలిసింది. వారందరికీ ఆ మహానీయుడు మహాభక్తుడైన తాళ్లపాక అన్నమాచార్యులు అని.

"ఇన్నాళ్లకు అల్లందరితోపాటు తమనూ కొండకు నడిపిస్తున్న ఈ మారాజే మా పాలిటి దేముడు" అని చేతులు జోడించి ఆనందంతో ఉక్కిరి బిక్కిరయిపోతూ ఉన్న గోవిందయ్య చెవుల్లో.

"హరియవతారము అన్నమయ్యకు జయము" అని వినిపించింది.

ఆనంద బాష్పాలు నిండిన కళ్ళతో ఆ మహాభక్తుణ్ని చూస్తూ "గోయిందా! గోయిందా! అని నినదిస్తూ కుటుంబంతో పాటు కొండకు నడిచాడు మాదిగ గోవిందయ్య.



**"ఆంధ్రప్రభ" వారపత్రికలో ప్రచురితం**

# 5. స్వతంత్ర వీరలక్ష్మి - శ్రీఅలమేలుమంగ

**కటాక్ష ఇహ కామధుక్, తవ మనస్తు చింతామణిః**
**కరః సురతరుః, సదా నవనిధిస్త్వమేవేందిరే,**
**భవేత్తవ దయారసో, మమ రసాయనం చాన్వహం**
**ముఖం తవ కలానిధి, ర్వివిధవాంఛితార్థ ప్రదమ్.**

అలమేలుమంగమ్మ "కటాక్షం" భక్తుల పాలిటి కామ ధేనువు! ఆ తల్లి నిండు 'మనస్సు' చింతామణి! ఆ జగన్మాత "రెండు చేతులు" కల్పవృక్షాలు! ఆ అమ్మ "దివ్యమంగళస్వరూపం" నవనిధులరాశి! ఆమె కురిపించే "దయారసం" ఆస్వాదనీయమైన ఆనందామృతం! సౌందర్యలహరి అయిన అమ్మ "ముఖారవిందం" సమస్త కళలకు కాణాచి! ఇలాంటి అద్భుతమైన, అనంతమైన సుగుణాలఖని అయిన అలమేలుమంగమ్మ "దివ్య మంగళవిగ్రహ దర్శనం" అందరికి అఖిల వాంఛితార్థప్రదం!

అలమేలుమంగమ్మ ఆనందనిలయుని పట్టపు దేవేరి! ఆ సిరులతల్లి కొలువై ఉన్న పుణ్యస్థలం తిరుచానూరు. ఈ క్షేత్రాన్ని 'అలమేలుమంగపట్నం' అని కూడా అంటారు. పూర్వం ఈ ప్రాంతంలో శ్రీశుకమహర్షి ఆశ్రమం ఉండేదట! అందువల్ల 'శ్రీశుకుని ఊరు'గా పిలువబడిందట! అదే 'తిరుశుకనూరు' అనీ 'తిరుచ్చుకనూరు' అనీ పిలువబడుతూ చివరకు 'తిరుచానూరు'గా మారిందని పెద్దల కథనం! ఈ ఊరు నడిబొడ్డున పద్మసరోవరం అనే కోనేరు ఉంది. పూర్వం ఈ కోనేట్లో సాక్షాత్తు శ్రీమహాలక్ష్మి బంగారుపద్మంలో అవతరించినందువల్ల ఆమె పద్మావతి అని, అలమేలుమంగ అని పిలువబడింది. అలమేలుమంగ అనగా అలర్‌మేల్ మంగ. పద్మంపైన ప్రకాశించే దివ్య వనిత అని అర్థం.

తిరుమలక్షేత్రం ఎంత ప్రాచీనమో, తిరుచానూరు కూడా అంత ప్రాచీనమైంది. వేంకటాచలం ఎంత అద్భుతమైన క్షేత్రమో, అందున్న



ఆనందనిలయుడు ఎంత మహిమగలవాడో, అలమేలుమంగ పట్నమూ అంతటిదే, అందున్న అలమేలుమంగమ్మ కూడా అంతటివారే!!

శ్రీ వైకుంఠం నుంచి కేవలం కలియుగంలోని భక్తుల కోసమే భువికి దిగివచ్చిన స్వామి ఏడుకొండలవాడు. భృగుమహర్షి చేసిన నిర్వాకం వల్ల లక్ష్మీ విరహుడైన వేంకటేశ్వరుడు భక్తుల కోరికలను తీర్చలేక సతమత మయ్యాడు. తానూ అనేక బాధలకు లోనయ్యాడు. అందువల్లే వైకుంఠం నుంచి అలిగి వెళ్ళిన శ్రీమహాలక్ష్మి కోసం కొల్హాపుర క్షేత్రానికి వెళ్ళి ఆమె అనుగ్రహం కోసం పదేండ్లపాటు తపస్సు చేశాడు. ఇక్కడ నీకు దర్శనం ఇవ్వనుగాక ఇవ్వను అని ఖండితంగా ఆకాశవాణి ద్వారా చెప్పుతూ పద్మసరోవర తీరాన నీ కోరిక నెరవేరుతుందని ఆనతిచ్చింది. శుకమహర్షి ఆశ్రమ తీరంలో లక్ష్మీదేవి అనుగ్రహం కోసం పద్మసరోవరాన్ని ఏర్పరచి, పన్నెండేండ్లపాటు త్రీవంగా తపస్సు చేశాడు. ఒకానొక కార్తీకమాసం



శుద్ధపంచమీ శుక్రవారం అభిజిత్ లగ్నాన ఉత్తరషాఢానక్షత్రంలో, షోడశ కళలతో శ్రీమహాలక్ష్మి పద్మసరోవరంలో సహస్రదళపద్మంలో ఆవిర్భవించింది. ఇలా పద్మావతిగా, అలమేలుమంగగా అవతరించిన ఆ తల్లిని వక్షఃస్థలంలో వేంచేపు చేసుకొన్న ఏడుకొండలవాడు "శ్రీనివాసుడి"గా సంపూర్ణమైన లక్ష్మీ కళలతో ప్రకాశిస్తూ తిరుమల కొండకు పయనమయ్యాడు. ఈ తల్లి అవతరించిన ఇచ్చోట కూడ అర్చామూర్తిగా పూజలందు కొనవలసిందని అందరూ ప్రార్థించారు. 'సరే' నంటూ శ్రీమహాలక్ష్మి తాను ఇచ్చట స్వతంత్రంగా వీరలక్ష్మినై వెలసి ఉంటానని, తిరుమలకొండపై స్వామివారికి జరుగుతున్నట్లుగానే తనకు స్వతంత్రంగా అన్ని సేవలు, ఉత్సవాలు జరుపవలెనని ఆదేశించింది. శ్రీస్వామివారు తన ప్రక్కన లేనందువల్ల 'విరహలక్ష్మి'గా, 'వీరలక్ష్మి'గా ప్రసిద్ధిని పొందుతూ స్వతంత్రంగా భక్తులకు ఇక్కడ కోరికలను నెరవేరుస్తానని, ఇక్కడ భక్తులు ముందుగా తమ తమ కోరికలను విన్నవించుకొంటే తాను వింటానని, తదుపరి తిరుమల క్షేత్రంలో శ్రీవారి వక్షఃస్థలంలో "వ్యూహలక్ష్మి"గా ఉన్న తాను స్వామివారికి వినిపించి, వారి వారి కోరికలను నెరవేరుస్తానని వరమిచ్చింది.

ఆనాటి నుంచి తిరుచానూరులోని అర్చామూర్తి అయిన శ్రీమహాలక్ష్మి, పద్మావతి అనీ, అలమేలుమంగమ్మ అనే పేర్లతో స్వతంత్ర వీరలక్ష్మియై పాంచరాత్రాగమ శాస్త్రోక్తంగా పూజలందుకొంటున్నది. అందువల్ల యాత్రికులు భక్తులు ముందుగా సాక్షాత్తు శ్రీస్వామివారి చేతనే ప్రార్థింపబడి తిరుచానూరులో 'స్వతంత్ర వీరలక్ష్మి'గా పూజలందుకొంటున్న పద్మావతి అమ్మవారిని దర్శించి పూజించడం, ఆమెకు తమ కోరికలను విన్నవించు కోవడం ఎంతైనా శ్రేయోదాయకం. తమ యాత్ర కూడ పూర్తిగా ఫలవంతం అవుతుంది.

అలా కాకుండా ఎంతో వ్యయప్రయాసలతో ప్రయాణం చేసి, ఏడుకొండలను ఎక్కి నేరుగా తిరుమల చేరుకొన్న భక్తులకు కేవలం

క్షణమాత్రమే స్వామిదర్శనం వీలవుతున్న తరుణం ఇది! అందులోను ఎక్కడికో ఆగమేఘాల మీద పరిగెత్తుతున్నట్లుగా శంఖుచక్రాలతో గంభీరంగా నిలబడివున్న స్వామి. పైగా మనం ఒక్కరమేగాక, వేలాదిమంది భక్తులు. దీనికి తోడు ఎప్పుడూ ఉత్సవాలతో ఉరుకులు పరుగులతో ఉన్న స్వామి, అలాంటి తిరుమలస్వామి కనపడక కనపడక కేవలం క్షణం మాత్రమే దర్శనమిస్తే, ఆ స్వామివారి నిలువెతుగవిగ్రహ గాంభీర్యానికి, దర్పానికీ ఉబ్బితబ్బిబై తడబాటును పొందుతూ తమ తమ కోరికలను చెప్పుకోలేక, లేదా విన్నవించుకోవాలన్న కోరికలను ఆ క్షణంలో విచిత్రంగా మరచిపోవడమేగాక, తోటి భక్తజనసమ్మర్దం తోపులాట వల్ల కనీసం ఆ స్వామివారి దివ్యమంగళ విగ్రహాన్ని సరిగ్గా తేరిపార చూడనైనా చూడలేక, చూడడానికి వీలుపడక, అరకొర మనస్సులతో బయటికి వస్తారు. ఇంకేముంది! భక్తులందరికి ఏదో తెలియని వెలితి! ఏదో చెప్పలేని అసంతృప్తి! ఇది తీరేదెట్లా? దీనికి పరిష్కారం ఒక్కటే! తిరుమలేశుడికంటె ముందుగా పద్మావతి అమ్మవారిని దర్శించడం, ఆ అమ్మకు మన ప్రార్థనల్ని విన్నవించడం, మన కోరికలను మన సమస్యలను స్వామివారికి విన్నవించవలసిందని కోరడం. ఇది సత్యమైన మాట! ఎందుచేతంటే...

తిరుచానూరులో అలమేలుమంగమ్మ చతుర్భుజాలతో నెమ్మదిగా కూర్చుని పద్మాసనియై అభయవరదహస్తాలతో దర్శనమిస్తున్నది. స్వామివారివలె కాక నింపాదిగా కూర్చున్న ఈ తల్లి భక్తుల ప్రార్థనలను కోరికలను నిదానంగా, ఓపికగా వింటుంది. తదుపరి తాను విన్నవాటి నన్నింటిని, తిరుమలలో శ్రీవారి వక్షఃస్థలంలో 'వ్యూహలక్ష్మి'గా ఉన్న ఆ జగన్మాత మరింత ఓపికగా, ఓర్పుగా, ప్రేమగా తన స్వామికి భక్తుల ప్రార్థనల్ని వినిపిస్తుంది. అంతటితో సరిపెట్టుకోక ఆ భక్తుల కోరికలను తప్పక తీర్చేటట్లుగా స్వామివారిని ఒత్తిడి చేస్తుంది. ఒప్పిస్తుంది. పిల్లలకోసం అమ్మమాట వినని తండ్రి ఉంటాడా ఎక్కడైనా! అందువల్ల ఆమె సిఫారసునకు



తలవొగ్గుతూ శ్రీనివాసుడు, మళ్ళీ ప్రత్యేకంగా భక్తులు కోరకుండానే, కేవలం దర్శనమాత్రం చేతనే కోరికలను విధిగా, తప్పనిసరిగా నెరవేరుస్తూ "కలౌ వేంకటనాయకః" అన్నబిరుదును సార్థకం చేసికొంటున్నాడు.

ఇంకొక్కమాట! పూర్వం ఎప్పుడో ఏనాడో అటు ఆనందనిలయుడు, ఇటు పద్మావతిఅమ్మవారు ఒకే ఎత్తులో ఉండేవారట! కాని స్వామివారికంటె కొంచెం ఎక్కువగా అమ్మవారికి ఉన్న 'దయ' అనే బరువైన గుణం వల్ల భూమి కుంగిందట! అందువల్లే స్వామివారు ఎత్తులోను, అమ్మవారు తగ్గులోను ఉన్నారని పెద్దలమాట! నిజంగా ఎంతటి దయగల తల్లో గదా అలమేలుమంగమ్మ!

ఇంతటి కరుణామయి, ప్రేమమూర్తి అయిన శ్రీమహాలక్ష్మి, అలమేలుమంగ లేదా పద్మావతి పేర్లతో పూజలందుకొంటూ తిరుచానూరులో కొలువై ఉన్న నాటినుండి పాంచరాత్రాగమ శాస్త్ర ప్రకారంగ సుప్రభాతం, సహస్రనామార్చన పద్మావతి పరిణయం, సహస్రదీపాలంకరణ సేవ, ఏకాంతసేవ వంటి నిత్యోత్సవాలు, సోమవారం అష్టదళ పాదపద్మా రాధన, గురువారం తిరుప్పావడ సేవ, శుక్రవారాభిషేకం, శనివారం పుష్పాంజలి సేవ వంటి వారోత్సవాలు, వైశాఖమాసపున్నమికి వసంతోత్సవాలు, జ్యేష్ఠమాసంలో తెప్పోత్సవాలు, భాద్రపదమాసంలో పవిత్రోత్సవాలు, కార్తీకమాసంలో లక్షకుంకుమార్చన, బ్రహ్మోత్సవాలు, పుష్పయాగం వంటి వార్షికోత్సవాలు శ్రీ పద్మావతి అమ్మవారికి ఘనంగా అంగరంగవైభవంగా నిర్వహింపబడుతున్నాయి.

అయితే ప్రతి ఏడాది కార్తీకమాసంలో శుద్ధపంచమినాడు శ్రీ పద్మావతి అమ్మవారి అవతార దినోత్సవం సందర్భంగా, పదిరోజుల పాటు అమ్మవారి బ్రహ్మోత్సవాలు అంకురార్పణతో ప్రారంభమై 'పంచమితీర్థం' అనబడే చక్రస్నానంతో పరిసమాప్తమవుతాయి. ఈ ఉత్సవాలు ప్రారంభమైన

నాటినుండి ప్రతిరోజూ, రెండు పూటలా వివిధవాహనాల్లో అమ్మవారి ఊరేగింపులు జరుగుతాయి. నాగదోష నివారిణిగా, సంతానప్రదాత్రిగా పెదశేష, చినశేషవాహనాల్లోను, విద్యాలక్ష్మిరూపంలో హంసవాహనంపైన, సంపదలను కురిపించే సంపత్ లక్ష్మిగా కల్పవృక్షంలోను, త్రేతాయుగంనాటి వేదవతినే ఇప్పటి పద్మావతినని హనుమద్వాహనంలోను, ధనలక్ష్మిగా పల్లకిలోను, గజలక్ష్మిగా గజవాహనంపైనా, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకిగా సర్వభూపాల వాహనంపైన, విజయలక్ష్మిగా గరుడవాహనంపైన, 'ఆదిలక్ష్మి'గా సూర్యప్రభలో, సామ్రాజ్యలక్ష్మిగా చంద్రప్రభలోను, రథోత్సవాల్లో సర్వలోకాలకు మహారాజ్ఞిగా, అలమేలుమంగమ్మ భక్తులకు దర్శనమిస్తారు. చివరగా అశ్వవాహనంపై భవభయహరిణిగా దర్శనమిస్తుంది అలమేలుమంగ!

చివరిరోజు అయిన తిరుచానూరు పంచమిరోజు అమ్మవారు అవతరించిన రోజు. ఆ రోజు తిరుమల శ్రీవారి నుండి పద్మావతి అమ్మవారికి పసుపు, కుంకుమలు, చందనం, చీరసారె, ప్రసాదాలు, కాలినడకన ఏనుగులపై సంప్రదాయ బద్దంగా తిరుచానూరుకు మంగళవాయిద్యాలతో తీసుకొని వస్తారు. శ్రీవారు పంపిన పసుపు చందనం, తులసిలతో పద్మ సరోవరతీరాన, శ్రీ పద్మావతిఅమ్మవారికి, సుదర్శన భగవానునికి తిరుమంజనం వైభవంగా జరుపబడుతుంది. పిదప శుభముహూర్తంలో పద్మపుష్కరిణిలో సుదర్శన భగవానునికి చక్రస్నానం ఘనంగా నిర్వహింప బడుతుంది. అదే సమయానికి తిరుమలేశుడు అక్కడికి వేంచేస్తాడని కూడా ప్రతీతి! ఆ సమయంలో పద్మసరోవరంలో వేలాదిమంది భక్తజనం పవిత్రస్నానాలు చేస్తూ పునీతులవుతారు. అనంతదయాస్వరూపిణి పద్మావతి అమ్మవారి పంచమితీర్థ మహోత్సవం దృశ్యం వర్ణించడానికి మాటలు చాలవు. లేవు కూడా.

పూర్వం వేదాంతదేశికులవారు అనే మహనీయులు ఉండేవారు. ఆయన – ''సాక్షాత్తు శ్రీనివాస భగవానుని అనంతమైన దయాగుణమే



"అలమేలుమంగమ్మ"గా రూపుదిద్దుకుంది" అని వర్ణిస్తారు. అందువల్ల అటు తిరుమలేశుని, ఇటు తిరుచానూరు పద్మావతిని విడివిడిగా ఎంతగా పొగడినా వారిద్దరూ అభిన్నులే! ఒక్కరే అని మనం మరచిపోగూడదు. ఏ ఒక్కరిని పొగడినా, కీర్తించినా, ఇద్దరినీ కీర్తించినట్లే. వారిద్దరి అవినాభావ సంబంధం సూర్యునికీ – సూర్యకిరణాలకూ, అగ్నికీ – వేడికీ, సముద్రానికీ – అలలకూ ఉన్న సంబంధం లాంటిది. అందుకే అన్నమయ్య కూడా...

**అతడె నీవు, నీ వనగ నాతడె, నీ పలుకే తలంపగా,**
**నాతని పల్కు, నీ హృదయ మాతడెపో, యలమేలుమంగ! నీ**
**చేతిదె సర్వజంతువుల జీవనమంతయు నంచు సన్ముని**
**వ్రాతము సన్నుతించు ననివారణ నీ సతి వేంకటేశ్వరా!**

అంటూ ఇద్దరికీ అభిన్నత్వాన్ని వర్ణిస్తాడు.

అభిన్నులూ, ఒక్కరే అయిన అలమేలుమంగాసమేతంగా శ్రీ ఆనంద నిలయుణ్ణి మనం కూడా ఇలా ప్రార్థించుదాం...

**నారాయణస్య హృదయే భవతీ యథాస్తే**
**నారాయణోపి తవ హృత్కమలే యథాస్తే,**
**నారాయణస్త్వమపి నిత్యముభౌ తథైవ**
**తౌ తిష్ఠతాం హృది మమాపి దయావతీ శ్రీః.**

అమ్మా! అలమేలుమంగమ్మా! ఆనందనిలయుడైన నారాయణుని హృదయంలో నీవుంటావు! నీ హృదయంలో ఆ స్వామి ఉంటాడు! మీరు ఇద్దరూ కలిసి నా హృదయంలో నిండు దయతో కొలువై ఉందురుగాక!

**"సప్తగిరి" లో ప్రత్యేకవ్యాసం**

# 6. పరమ పదము నీ పాదము



**నీవదములు మది దలఁచిన**
**యాపద లటు దొలఁగద్రోచి యతులితమతియై**
**నీ పదమునందు నందురు**
**వేపక ననుఁ జూడు కరుణ వేంకటరమణా!**

**– వెచ్చాధర్మపురి**

మానవుడు తరించి, ముక్తి పొందుటకై తొమ్మిది విధాలైన భక్తి మార్గాలు పేర్కొనబడ్డాయి.

**శ్రవణం కీర్తనం విష్ణోః**
**స్మరణం పాద సేవనం!**
**అర్చనం వందనం దాస్యం**
**సఖ్య మాత్మనివేదనమ్**

అందులో నాలుగవది పాదసేవనం, శ్రీమహావిష్ణువు యొక్క పాదసేవనం ద్వారా ఎందరో భక్తులు తరించారు. మరెందరో మహా కవులు



ముక్తికి మార్గదర్శకులయ్యారు. పరమభాగవతుడు, సహజ పండితుడైన బమ్మెర పోతనామాత్యుడు.

**నీ పాదకమల సేవయు,**
**నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం**
**తాపార భూతదయయును**
**తాపస మందార! నాకు దయసేయగదే!**

అని కీర్తిస్తూ నీ పాదాలను సేవించే భాగ్యం కలిగించుస్వామీ! లేదంటావా కనీసం నీ పాదాలకు సేవచేసేవారి సాంగత్యాన్నైనా కలిగించు. దాంతోపాటు భూతదయకూడా. అని ఆర్తితో ప్రార్థించాడు. అంటే పాదసేవ, పాదార్చన ఎంతో సత్ఫలితాల నిస్తాయన్న మాటేగదా! కనుకనే ఒక మహాకవి జగన్నియామకుడైన తిరుమల వేంకటేశుని

**నీ పాదకమల సేవా**
**వ్యాపారతఁ జెలగుచున్నవాని కసాధ్యం**
**బేపట్లను గలుగదు, భువి**
**లోపల శ్రీ వేంకటేశ లోకాధీశా!!**

అని కీర్తించినాడు. కొందరు భక్తులైన మహాకవులు త్రివిక్రమావతారంలో తనపాదాలచే భువనాల నన్నింటిని ఆక్రమించిన వామనుని పాదాలను భజిస్తే, గుహునిలాంటి ఆంతరంగిక భక్తులు రాతిని నాతిగా చేసిన విశ్వమోహనమూర్తియైన శ్రీరామచంద్రుని పాదాలను సేవించి తరించారు.

అందులకే జగద్గురువు శ్రీశంకరులవారు శ్రీరామకర్ణామృతంలో ఇలా అంటారు.

**జానాతి తవ నామరుచిం మహేశః**
**జానాతి గౌతమసతీ చరణప్రభావం**

**జానాతి దోర్బల పరాక్రమ మీశచాపః**
**జానాతి పటుబాణ గతి ర్పయోధిః**

శ్రీరామా! నీ నామామృతం రుచి మహేశ్వరునికి దక్క అన్యులకు తెలియదు. అలాగే నీపాదాల ప్రభావాన్ని గౌతముని భార్య అహల్యాదేవీ, నీ బాహుబలాన్ని శివధనస్సూ! నిశితబాణ వేగం సముద్రుడు తెలిసినట్లు ఇంకొకళ్లకు తెలియదయ్యా అని శ్రీశంకభగవత్పాదుల వారంటారు.

నిజంగా ఆలోచిస్తే శ్రీమహావిష్ణువుయెక్క పాదసేవలో శ్రీమహాలక్ష్మిని మించిన వారుండరేమో! శ్రీ వైకుంఠంలో శ్రీమహావిష్ణువు శేషతల్పంపై పవ్వళించి వుండగా, తన కరపల్లవాలతో ఆయన పాదాలను ఒత్తుతూ సేవిస్తుంటుంది శ్రీమహాలక్ష్మీదేవి. అలాంటి శ్రీవారి పాదాలను కవిసార్వభౌముడైన శ్రీనాథమహాకవి.

**"కలశాబ్ధి కన్యకా కరపల్లవద్వయీ**
**సంవాహనక్రియా సముచితంబు**
**నిఖిల వేదాంత వాణీ వధూధమ్మిల్ల**
**బహుళ పుష్పామోద భావితంబు**
**ప్రణుత నానాసుపర్వ కిరీట సంఘాత**
**రత్నాంశు రాజి నీరాజితంబు**
**సనకాది సన్మునీశ్వర మనోమంట**
**పాభ్యంతర రత్న దీపాంకురంబు**

.... .... .... .... .... .... .... .... ....

అని కీర్తిస్తాడు.

అలాగే ప్రఖ్యాత రచయిత, కవీ పండితుడూ అయిన చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులు తన "గయోపాఖ్యానం"లో శ్రీకృష్ణుని పాదాన్ని ఇలా వర్ణిస్తాడు.



గజ్జె లందియులు ఘల్లుఘల్లని మ్రోయ
నహిమౌళి దాండవ మాడె నెద్ది?
భువన పావనమైన దివిజస్రవంతికి
ప్రభవ కారణ మౌచు వరగె నెద్ది?
స్వారాజ్యమును గొన్న వైరోచునుని ద్రొక్కి
పాతాళభూమికి బంచె నెద్ది?
పతిశాపవశమున గతిలేక పడియున్న
చట్రాతి నాతిగా సలిపె నెద్ది?
ఆదిలక్ష్మి నిచ్చెడు వేళ నబ్ధిరాజు
కనకపుం బళ్ళెరంబున గడగె నెద్ది?
అట్టి నీపాద పంకజం బమలచరిత
నా కఠిన మౌ దేహమును దాకి నవసియుండు

యుద్ధంలో శ్రీకృష్ణుడు అర్జునుని కాలితో తంతాడు. అర్జునుడు ఏమాత్రం కోపగించుకొనక శ్రీకృష్ణుని పాదమహత్వాన్ని కీర్తించి తన కఠినదేహాన్ని తాకిన ఆయన మృదువైన కమలచరణాలను సేవింతునని అంటాడు.

నిరంతర భక్తపరిరక్షణా శీలుడైన శ్రీవేంకటాచలపతి పాదపద్మాలను సేవించవలసిన తీరును రీతిని ఒక అజ్ఞాతమహాకవి మనోజ్ఞంగా, మనోహరంగా వర్ణించాడు చూడండి.

నీ పదాంభోజముల్ నిశ్చల హృదయుడై
యతిభ క్తిబూజ సేయంగవలయు
పావనంబైన మీ పాదపద్మములకు
ముదమొప్ప నిలcజాగి మ్రొక్కవలయు
పాపహరంబు మీ పాదాబ్జ తీర్థంబు
లేపార జిహ్వాయం దిడగవలయు

నీ పాదబ్జార్చిత నిర్మలతర తుల
సీ దళం బెలమి భక్షింపవలయు

వినతుఁడై మిమ్ము శరణంబు వేఁడవలయు
కలుషములఁబాసి మిముఁజేరి వెలయవలయు
శేషశై లాగ్రవాస! లక్ష్మీనివాస!
పంకజాత భవాండేశ! వేంకటేశ!

ఇలాగ పరిపరివిధాల ఫణిశయనుని దివ్యచరణకమలాలను ఎందరో మరెందరో.... ఇంకెదరో.... తనివిదీర స్తుతించి కీర్తించారు.

కలియుగ వైకుంఠమైన తిరుమల యాత్రలో కూడా తొలిగా యాత్రికులకు పరమపురుషోత్తముడైన తిరుమల శ్రీవారి పాదపద్మాలు దర్శన మిస్తాయి.

ప్రాచీన కాలంనుంచీ భక్తులు అలిపిరిలోనున్న గోవిందుని చరణాలను సేవించి, తిరుమల కొండను ఎక్కుతున్నారు. అందులకే ఈ పాదాలు ఉన్నస్థలాన్ని "శ్రీ పాద మండవ" మంటారు. తిరుమలగిరి దేవ దేవుని పాదాలు ఈ శేషాచల పర్వతమూలంలో వెలయడానికి ఒక కథ చెప్తారు.

సుమారు వెయేండ్లక్రిందటి మాట. ప్రతిరోజు ఉదయాన్నే ప్రముఖవైష్ణవుడు తిరుమలనంబి తిరుమలకొండ దిగిఇక్కడికి వచ్చే వాడట. అలాగే తిరుపతి శ్రీ గోవిందరాజుస్వామి ఆలయం నుండి శ్రీ రామాను జాచార్యులు అలిపిరి చేరుకొని గురువైన తిరుమలనంబి దగ్గర రామాయణ రహస్యాలను తెలుసుకొనేవారట! సుమారు 11 గంట లప్పుడు పాఠం ముగిసిన తరువాత రామానుజులు గోవిందరాజు గుడికి వెళ్లగా తిరుమల నంబి కొండకేగి శ్రీవారి పాదాలమ అర్చించేవాడట! ఇదీ వీది నిత్యకృత్యం. "కాని ఒకమారు గురుశిష్యులిరువురూ! రామాయణ చర్చలో నిమగ్నులై మైమరచిపోయారు. కాలయాపన జరిగింది. అంతలో తిరుపతి గోవిందరాజస్వామి నిలయంలోని నై వేద్యఘంటానాదం వినవచ్చింది. అప్పుడు తేరుకొన్న తిరుమలనంబి "అయ్యో ఈరోజు శ్రీవారి పాదాలను సేవించలేక పోయానే. ఎప్పుడు కొండ ఎక్కేది, ఎప్పుడు సేవించేది" అని భక్తసులభుడైన ఘనవేంకటగిరి నాథుని ప్రార్థించగా స్వామివారు తన పాదాలను ఆ గురుశిష్యులున్న చోటనే సాక్షాత్కరింప జేశాడట! అవే నేడు అలిపిరిలో మనం దర్శిస్తున్న శ్రీవారిపాదాలు. ఆ తరువాత ఆ పాదాలకు మట్ల ఆనంతభూపాలుడు మండప గోపురాదులు నిర్మించాడు. దారి వెంబడి మెట్లు కూడ కట్టించాడు.



ఇటీవల అలిపిరిలోని ఈ పాదాలమండపాన్ని తి.తి.దేవస్థానంవారు జీర్ణోద్ధరణ చేయడమేగాక, అక్కడవున్న పాదాలను ఆనుకొని 36డుగుల శ్రీవేంకటేశ్వరస్వామివారి శిలామూర్తి ప్రతిష్ఠించి, ప్రతిరోజు అర్చన నివేదనాదులు ఘనంగా నిర్వహిస్తున్నారు.

తిరుమల యాత్రికులకు తొలిగా తన పాదదర్శనం ద్వారా "పాద సేవనం" యొక్కప్రాముఖ్యతను తెలియజేస్తున్నాడు తిరుమలశ్రీనివాసుడు. ఒక్క అలిపిరిలోనే కాదు. దారివెంటా, కాలినడకలో శ్రీవారి పాదపద్మాలు అక్కడక్కడా మనకు దర్శినమిస్తూ ఈ పాదాలాశ్రయించి, తరించండి! అని యాత్రికుల్ని పదే పదే ప్రబోధిస్తుంటాయి.

ఒక్క కాలిదారిలోనేకాదు, తిరుమల అనంద నిలయంలో కూడ కలుషభంజనుడగు శ్రీవేంకటపతి "తన పాదాలాశ్రయించండి! సేవించండి అని తన దక్షిణ (కుడి) హస్తంతో పాదాలను చూపుతూ, అలా ఎవరైతే "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అని నా పాదాలాశ్రయించి శరణు వేడుతారో వారిని, "నా అక్కున చేర్చి సంకటాలను పోగొట్టి రక్షించే బాధ్యత నాదే" అని తన కటిహస్తం (ఎడమ చేయి) తోచూపుతున్నాడు.

కనుకనే ఆ కొండల కోనేటిరాయని పాదాల్ని "పరమ పదము నీ పాదము" అని కీర్తిస్తూ అడ్డాలనాడే ఆశ్రయించి తరించిన వారిలో తాళ్ళపాక అన్నమాచార్యులు అగ్రగణ్యుడు.

"ఎన్నికఁ బాదాలవద్ద ఇహముఁ బరముఁ జూపీ
మన్ననల అలమేలుమంగ విభుఁడు"

అని చెప్తూతూ, అన్నమయ్య

"సేవించి చేకొన్నవారి చేతి భాగ్యము
వేవేగ రారో! రక్షించి విష్ణుఁడీఁడను"

అని మనల నందరినీ, ఇహపర సౌఖ్యాలందుటకు ఆహ్వానిస్తున్నాడు.

ఈ సంకీర్తనాచార్యుడు తనకు ఇహపరా లిచ్చిన కోనేటితిమ్మనాయని బంగారు పాదాలను సేవించి మంజులమైన మనోహరమైన మధురమైన తేటతెలుగు పదాలతో ఇలా కీర్తించినాడు.

అవి చతుర్ముఖుడైన బ్రహ్మస్వయంగా కడిగిన పాదాలు, అంతేకాదు. సాక్షాత్తు తానే పరబ్రహ్మగా వెలుగొందుతున్న పాదాలు. ఇవి

**ముఖారి**

**బ్రహ్మ గడిగిన పాదము**
**బ్రహ్మము దానే నీపాదము**

**చెలఁగి వసుధ గొలిచిన నీ పాదము**
**బలితల మోపిన పాదము**
**తలఁకక గగనము దన్నిన పాదము**
**బలరిపుఁ గాచిన పాదము॥**

**కామిని పాపము కడిగిన పాదము**
**పాముతల నిడిన పాదము**



**ప్రేమపు శ్రీసతి పిసికెడి పాదము**
**పామిడి తురగపుఁ బాదము॥**

**పరమ యోగులకు బరిపరి విధముల**
**పరమొసఁగెడి పాదము**
**తిరువేంకటగిరి తిరమని చూపిన**
**పరమ పదము నీ పాదము॥**

దానవీర చక్రవర్తి, బలి, యజ్ఞశాల, ఋత్విక్కులు... మాయ బ్రహ్మచారి వామనుడు, మూడడుగుల యాచన. బలిదానధార..... వటుడు "ఇంతింతై, వటుడింతై తానింతై" విశ్వాంతరాళం వ్యాపిస్తున్న వామనుని త్రివిక్రమ స్వరూపం అదిగో! వసుధ గొలిచిన పాదము! రెండవపాదం అదిగో! గగనాన్ని అన్ని దేవేంద్రునికి స్వర్గం నిచ్చిన పాదం! అదిగో మూడవ సారి బలితల మోపిన పాదం! మున్నగు దృశ్యాలు శ్రీవేంకటపతి పాదాలను దర్శించిన అన్నమయ్యకు చలన చిత్రదృశ్యాముల వలె గోచరించాయి,

అదిగో! గౌతమ మహర్షి ఆశ్రమం....ముందు జడధారి దండకమం డలాలతో అపరశివునివలె విశ్వామిత్రుడు. ఆయన ననుసరిస్తూ కోమలనీల మేఘసుందర శరీరధారి అయిన కోందండపాణి రాముడు. ఆ వెనుక పచ్చని బంగారు ఛాయ మేనితో లక్ష్మణుడు. కౌశికుడు చూపుతున్న రాతిగా పడివున్న నాతి అహల్య. వెంటనే రాముని పాదధూళిస్పర్శ, అహల్య శాపవిముక్తి.

ఇలాగ రమావతారం. అహల్యాశాపవిమోచన దృశ్యాలు అన్నమయ్య లీలగా దర్శించాడు. అందుకే అది 'కామిని పాపము కడిగిన పాదము' అంతేకాదు.

అది ద్వాపరయుగం... శ్రీకృష్ణావతారం. ఆదిగో! ఆలమంద... బృందావనం అల్లదిగో! యమునానది పరవళ్ళు ద్రొక్కుచు పారుచున్నది! ఆ యమునమధ్య ఐదుపడగల సర్పరాజు కాళీయుడు... భళిరా. ఆ కాళింగుని పడగలపై త్రిజగన్మోహన మూర్తి. శిఖిపించమౌళి.

బాలకృష్ణుడు. కాళీయ గర్వ భంజనం. ఆందుకే అది "పాముతల నిడిన పాదము". తిలకించండి.

అదిగో వైకుంఠం! క్షీర సముద్రం! ఆదిశేషుడు.... ఆ శేషతల్పం పై శ్రీ వేంకటేశుడు పవళించినాడు. అదిగో! తిరుమలలో నిలబడి నిలబడి భక్తులకు దర్శనమిస్తూ, అలసిన శ్రీ వారి పాదాలను లక్ష్మీదేవి పిసుకుతున్నది. అదిగో! లక్ష్మీనారాయణుల సందర్శనం చేయండి! కనుకనే అది "ప్రేమపు శ్రీపతి పిసికెడి పాదము".

అల్లదిగో! కశ్యప ప్రజాపతి భార్యలు కద్రూ వినతులు. కద్రువ వినతల సంవాదం – వినతదాస్యం – గరుడని జననం – మాతృభక్తి గరుత్మంతుడు అమృతం తెచ్చుట. వినత దాస్య విముక్తి పాములను ఆహారంగా తింటున్న గరుడునిమీద విహరిస్తున్న విష్ణుమూర్తి. అదే 'పామిడి తురుగపు బాదము'.

సనక సనంద సనత్కుమార సనత్సు జాతాది పరమయోగులు శ్రీవారి పాదాలను సేవించి పరమ పదాన్ని పొందుతున్నారు. తిరు వేంకటగిరియే స్థిరమైనది. ఇదియే వైకుంఠం. మిగిలినదంతా అశాశ్వతం అని చూపుతున్న 'పరమ పావనమైన నీ పాదము' అదే పునరావృతి రహిత కైవల్యమునిచ్చు నీ పాదము.... అని అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వరుని బంగారు పాదాలను దర్శించినప్పుడు పై దృశ్యాలన్నీ ప్రత్యక్షంగా తిలకించిన మహామనిషి అన్నమయ్య.

నాటికి, నేటికీ, ఎన్న టికీ దివ్య సందర్శనమిస్తూ భక్త కోటిని తరింవ జేస్తున్నవి! అందులకే ఆ పాదాలు.

"తిరువేంకటగిరి తిరమని చూపిన పరమ పదములు!"

–"సప్తగిరి"లో ప్రచురితం

# 7. 'బంగారు మేడ' లో బ్రహ్మోతిరునాళ్లు

**స్మరణాత్సర్వపాపఘ్నం స్తవనాదిష్టవర్షిణమ్**
**దర్శనాన్ముక్తిదం చేశం శ్రీనివాసం భజేఽ నిశమ్**

స్మరణంతో సర్వపాపాలు పోగొడతాడు. స్తుతితో ఇష్టార్థాలను తీరుస్తాడు. ప్రత్యక్ష దర్శనంతో పరోక్షమైన ముక్తిని ప్రసాదిస్తాడు. అలాంటి దేవదేవుడైన శ్రీనివాస ప్రభువును సదా భజిస్తాను.

సుసంపన్నమైన ఆధ్యాత్మిక క్షేత్రాలలో కెల్ల సుందరాంధ్ర భూమిలో వెలసిన వేంకటాద్రి పుణ్యక్షేత్రానికి విశిష్టస్థాన ముంది. బహుశా ఆ దివ్య క్షేత్రంలో నెలకొన్న బంగారుమేడ (ఆనందనిలయం). ఆ మేడలో హారకేయూర కిరీటాది ఆభరణాలతో శంఖచక్ర నందకాది ఆయుధాలతో కోటి సూర్యప్రకాశంతో వేంచేసి దర్శనమిస్తున్న దివ్యమంగళమూర్తి అందుకు ప్రధాన కారణం కావచ్చు.

మరి ఆ బంగారుమేడలోని రూపం ఎలాంటిది? అంటే వేదాంతవేత్తలు వెదకేటి రూపం. ఆదీ అంత్యం లేనిది ఆ రూపం. అరుదయిన సృష్టికి ఆదిమూలం. పాదుగ పరమయోగులు భావించే రూపం. మేలిమి వైకుంఠాన వెలసిన రూపం. ముంచిన బ్రహ్మాదులకు మూలమైన రూపం. అణురేణు పరిపూర్ణమైన రూపం... కొలిచిన వారల కొంగుపైడి...అదే...అదే...ఈ దెస వేంకటాద్రి కోనేటి దరిన నెలకొని అందరిని ఏలుతున్న దైవం ఆ దివ్యరూపం.

**శ్రీవేంకటేశుడు శ్రీపతియు నితడే**
**పావనపు వైకుంఠపతియును నితడే ॥**

**ఎక్కువై బ్రహ్మాదులు నెప్పుదు నింద్రాదులు**
**తక్కక కొలిచియున్న తత్త్వమితఁడు**

చక్క నారదాదుల సంకీర్తనకు ఁజిక్కి
నిక్కిన శ్రీ వేంకటాద్రి నిలయుఁడు నీతఁడే ॥

"శ్రీ వేంకటేశుడు" అనే పేరుతో వేంకటాద్రిపై కొలువైవున్న స్వామికి నిత్యోత్సవాలు, వారోత్సవాలు, మాసోత్సవాలు, సంవత్సరోత్సవాలు అనేకం జరుగుతున్నాయి.

అయితే సంవత్సరాది నుంచి సంవత్సరాంతం వరకూ కొనసాగుతున్న అనేక ఉత్సవాల్లో, ఏడాదికి ఒకసారి జరిగే పదినాళ్ల "బ్రహ్మతిరునాళ్లు" నిచ్చట కల్యాణం వచ్చులతోరణంగా భాసిల్లే బ్రహ్మాండనాయకుడైన తిరువేంకటగిరి దేవుని వైభవంలో ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకున్నాయి.

ఈ ఉత్సవాలు ప్రతి సంవత్సరం ఆశ్వయుజ శుద్ధపాడ్యమి నుంచి ఆశ్వయుజ శుద్ధదశమి వరకు పదిరోజుల పాటు జరుపబడుతున్నాయి. ఒకవేళ అధికమాసం వచ్చిన సంవత్సరంలో అయితే, భాద్రపదమాసంలో ఒక బ్రహ్మోత్సవం, ఆశ్వయుజమాసంలో మరొక బ్రహ్మోత్సవం నిర్వహిస్తారు. సాధారణంగా ప్రతి మూడవయేటా రెండు బ్రహ్మోత్సవాలు జరుగుతున్నాయి. ఇలాగ ఒకేమారు రెండు బ్రహ్మోత్సవాలు జరిగినపుడు, భాద్రపదమాసంలో జరిగే మొదటి ఉత్సవాన్ని వార్షిక బ్రహ్మోత్సవమనీ, ఆశ్వయుజమాసంలో జరిగే రెండవ బ్రహ్మోత్సవాన్ని నవరాత్రి బ్రహ్మోత్సవమనీ అంటారు. మొదటి బ్రహ్మోత్సవానికీ, రెండవ ఉత్సవానికీ ఊరేగింపులు, వాహనసేవలు సమంగానే జరుగుతాయి. కాని రథోత్సవానికి మాత్రం మొదటి ఉత్సవంలో చెక్కతేరును, రెండ ఉత్సవంలో బంగారు రథాన్ని ఉపయోగిస్తారు.

బ్రహ్మాండనాయకుడైన తిరుమల కోనేటిరాయనికి తొట్ట తొలీత సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు ఈ ఉత్సవాలను నిర్వహించినట్లూ, అందువల్లనే వీటికి బ్రహ్మోత్సవాలు అని ప్రసిద్ధి కలిగినట్లు భవిష్యోత్తర పురాణాంతర్గత



శ్రీ వేంకటాచలమాహాత్మ్యాది గ్రంథాలు స్పష్టం చేస్తున్నాయి. వీనినే "బ్రహ్మతిరునాళ్లు"గా తెలుగుకవులు వర్ణించారు.

పురాణాల్లోనేగాక చారిత్రకంగా, శాసనపరంగా కూడా క్రీస్తుశకం 7వ శతాబ్దం నుంచి శ్రీ వేంకటేశ్వరస్వామివారికి బ్రహ్మోత్సవాలు జరుగుతున్నట్లు సాక్ష్యాధారాలున్నాయి.

పల్లవరాణియైన సమవాయి క్రీస్తుశకం 7వ శతాబ్దంలో "మనవాళ ప్పెరుమాళ్" అని పిలువబడే రజత భోగ శ్రీనివాసుని విగ్రహాన్ని తిరుమల ఆలయానికి బహూకరించింది. పురటాసి నెలలో అంటే కన్యా (భాద్రపద-ఆశ్వీజ) మాసంలో జరుపబడే బ్రహ్మోత్సవాల్లో ఈ మనవాళస్వామివారి వెండి విగ్రహాన్ని ఊరేగించేటట్లు కట్టడి చేసిందట! ఈ విగ్రహమే ప్రతినిత్యం ఏకాంతసేవల్లో పవ్వళింపు సేవనందుతూ భోగ శ్రీనివాసునిగా నేడు ప్రసిద్ధి కెక్కాడు.

అప్పటినుంచి ఆ యా రాజుల కాలాల్లో వేర్వేరు బ్రహ్మోత్సవాలు ఏర్పాటు అయిఉండటం గమనార్హం.

తెలుగు పల్లవరాజు విజయగండ గోపాలదేవుడు క్రీస్తుశకం 1254 చైత్రమాసంలోను, మూడవ రామరాజు సామంతుడు వీరనరసింగదేవుడు "పంగుణి ఉత్సవం" పేర ఫాల్గుణమాసంలోను, త్రిభువనచక్రవర్తి తిరువేంకటానాథ యాదవ రాయలు క్రీస్తుశకం 1328లో "ఆడి తిరునాళ్" పేర ఆషాఢమాసంలోను, వీరప్రతాపరాయలు క్రీస్తుశకం 1429 సంవత్సరంలో ఆశ్వయుజమాసంలోను హరిహరరాయలు క్రీస్తుశకం 1446లో "మాసి తిరునాళ్" పేర మాఘమాసంలోను, 1530లో "అచ్యుతరాయ బ్రహ్మోత్సవ"మనీ... ఇలాగ క్రీస్తుశకం 1583 సంవత్సరం నాటికి సంవత్సరంలో పదకొండు బ్రహ్మోత్సవాలుగా అంటే ఇంచుమించు ప్రతినెలా ఒక బ్రహ్మోత్సవం జరిగేదన్నమాట!

రాజ్యాలూ, రాచరికాలు కాలగర్భంలో అంతరించినందువల్ల వారు ఏర్పాటు చేసిన ఉత్సవాలు క్రమేణ నిలిచిపోయాయి. అయితే సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు ఆదిలో నిర్వహించిన "బ్రహ్మతిరునాళ్ళు" మాత్రం అఖండ వైభవంతో నేటికీ సాగుతూ కొండలరాయని కొండంత వైభవాన్ని దశదిశలా చాటుతున్నాయి.

ఈ బ్రహ్మోత్సవాలు ధ్వజఆరోహణంతో మొదలై ధ్వజ అవరోహణంతో ముగిసే పదినాళ్ల వేడుకలు. ధ్వజారోహణకు ముందురోజు తిరుమల ఆలయంలో "కోయిల్ ఆళ్వారు తిరుమంజనం" చేస్తారు. అంటే శ్రీవారి గర్భాలయాన్ని సుగంధ ద్రవ్యాలతో శుద్ధి చేసే కార్యక్రమాన్ని తిరుమంజనం అంటారు. అయితే ఈ తిరుమంజనకార్యక్రమాన్ని ఇటీవల బ్రహ్మోత్సవాలు ప్రారంభం కావడానికి ముందువచ్చే మంగళవారం (మిగత రోజులకన్న ఈ రోజు జనసమ్మర్దం తక్కువకాబట్టి) నాడు చేస్తున్నారు.

ధ్వజారోహణం రోజున అర్చక స్వాములు వైఖానసాగమ శాస్త్రోక్తరీతిలో కంకణధారణ, అంకురార్పణ కావించి, అనంతరం బలి ఆవరణలోని అష్టదిక్కులను, అష్టదిక్పాలులను, శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుమతితో ఆహ్వానిస్తారు. ఆ యా దేవతలను ఆహ్వానించిన పిమ్మట గరుత్మంతుని ఆకృతి చిత్రించిన నూతనకేతనాన్ని మంగళవాయిద్యాలు మోగుతుండగా శ్రోత్రియుల వేదమంత్రోచ్చారణల మధ్య శ్రీ స్వామివారిఆలయధ్వజస్తంభంపై ఎగురువేస్తారు "గరుడ ధ్వజారోహణ"మనే ఈ తొలివేడుక కన్నుల పండువుగా మహావైభవంగా జరుగుతుంది. ఆ సమయంలో నివేదించబడే పెసరపులగ ప్రసాదం స్వీకరిస్తే సంతానం కలుగని స్త్రీలు సంతానవతులవుతారని భక్తుల విశ్వాసం. తరవాత బంగారు ధ్వజస్తంభానికి పక్కగానున్న తిరుమల రాయమండపంలో శ్రీదేవి భూదేవి ఉభయదేవేరులతో పాటు సర్వాభరణాలతో పుష్పాలంకృతులైన శ్రీస్వామివారిని 'వేంచేపు' చేయించి ఆస్థానం నిర్వహిస్తారు.



ఈ ఉత్సవాల్లో ప్రతిరోజు సాయంత్రం ఊరేగింపు మొదలుకావడానికి పూర్వం శ్రీస్వామివారికి ఆలయం వెలుపలవున్న కొలువు మండపంలో "ఉయ్యాలసేవ" కన్నుల పండువుగా జరుగుతుంది.

పదినాళ్ల బ్రహ్మోత్సవ సంరంభంలో అంగరంగవైభోగంగా తిరుమల పురవీధుల్లో ఆ యా వాహనాలమీద ఊరేగింపబడే శ్రీవారి వైభవాలను శ్రీవేంకటేశ్వరుని ఆంతరంగిక భక్తుడు, పదకవితాపితామహుడు అయిన తాళ్లపాక అన్నమాచార్యులు ఒక పాటలో ఇలా కీర్తించాడు.

**తిరువీధుల మెరసీ దేవదేవుడు**
**గరిమల మించిన సింగారములతోడను ॥**

**తిరుదండెలపై నేగీ దేవుడిదె తొలునాడు**
**సిరుల రెండవనాడు శేషునిమీద**
**మురిసీ మూడోనాడు ముత్యాల పందిరిక్రింద**
**పొరి నాలుగోనాడు పువ్వులగోవిలలోను ॥**

**గ్రక్కున నైదవనాడు గరుడునిమీద**
**యెక్కును ఆరవనాడు ఏనుగుమీద**
**చొక్కమై ఏడవనాడు సూర్యప్రభలోనను**
**యిక్కువ దేరును, గుఱ్ఱ మెనిమిదోనాడు ॥**

**కనకపు టందలము కదిసి తొమ్మిదోనాడు**
**పెనచి పదోనాడు పెండ్లిపీట**
**యెనసి శ్రీవేంకటేశుడింతి యలమేల్మంగతో**
**వనితల నడుమను వాహనాల మీదను ॥**

ఇంచుమించు నేడు తిరుమల శ్రీవారికి జరిగే బ్రహ్మోత్సవాల మాదిరిగానే అన్నమయ్యనాటికి (1408-1503) కూడ జరుగుతున్నట్లు ఈ పాటవల్ల స్పష్టమవుతుంది. కాని ఉదయం, సాయంత్రం రోజుకు రెండు

పూటలా ఉత్సవాలు జరుగుతున్న ఈ నాటివలె గాక అన్నమయ్యనాటికి రోజుకొక్క ఉత్సవం మాత్రమే జరిగేదని తెలుస్తున్నది.

ఈ పదినాళ్ల పండుగదినాల్లో ఐదవ నాటిరాత్రి జరిగే బంగారు గరుడోత్సవం, తొమ్మిదవనాటి ఉదయం జరిగే రథోత్సవం అత్యంత దర్శనీయమై, దివ్యసుందరమై, సాక్షాత్తు వైకుంఠాన్ని దర్శింపజేసే విశేషోత్సవాలుగా ప్రసిద్ధి నందివున్నాయి.

ఈ పది రోజుల్లో ఐదవనాటి రాత్రి జరిగే బంగారు గరుడోత్సవ ప్రాధాన్యం ఇంతింతని వర్ణింపలేనిది. ఆ రోజు ఆనందనిలయం లోని మూలవిరాట్టునకు అలంకరించే మకరకంఠి, లక్ష్మీహారాది విశిష్ట ఆభరణాలు శ్రీవారిఉత్సవమూర్తికి అలంకరిస్తారు. అంతేకాదు తమిళనాడులోని శ్రీ విల్లిపుత్తూరు నుంచి అక్కడి శ్రీగోదాదేవి (ఆండాళ్)కి అలంకరింపజేసిన పూలమాలను నియమం ప్రకారం గరుడోత్సవం నాటికి తిరుమలకు తెచ్చి, దానిని కూడా శ్రీస్వామివారికి అలంకరిస్తారు. మద్రాసు నుంచి మిరాశిదారులు కాలినడకన పది రోజులు ముందుగా బయలుదేరి కొత్త గొడుగులను దారిలో ఊరూరా ఊరేగించుకుంటూ, పూజలందుకుంటూ సరిగ్గా గరుడోత్సవం సమయానికి తిరుమలకు తెస్తారు. ఆ కొత్త గొడుగులను ధరించి, బంగారు గరుడనిపై వేంచేసి తిరుమల పురవీధుల్లో అశేషభక్తజన ప్రవాహంమధ్య శ్రీవారు చిరునవ్వులు చిందిస్తూ, వరదహస్తుడై అనుగ్రహిస్తూ ఊరేగుతారు. అదే రోజు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరుపున ముఖ్యమంత్రి శ్రీ స్వామివారికి ఆనవాయితీగా పట్టువస్త్రాలను సమర్పిస్తారు. ఆ వస్త్రాలను కూడా స్వామివారికి ధరింపజేస్తారు. ప్రస్తుతం బ్రహ్మోత్సవంలో, తొలినాడే. ఈ వస్త్రసమర్పణ ఉత్సవం నిర్వహింపబడుతున్నది.

ఇక తొమ్మిదవనాటి ఉదయం జరిగే ఉత్సవమే రథోత్సవం. ఇది తిరుమలకొండల కోనేటిరాయనికి జరిగే ఉత్సవాల్లో అన్నింటికంటె విశిష్టంగా వైభవంగా ఆనందదాయకంగా ఉంటుంది.



**"రథస్థం కేశవం దృష్ట్వా**
**పునర్జన్మ న విద్యతే"**

–అన్నట్టుగా తిరుమల శ్రీనివాసుని దర్శనంతో తమ జన్మపరంపర నశించిందన్న భక్తి విశ్వాసాలతో, శ్రీవారి రథం యొక్క పగ్గాలను లాగుతూ, "గోవిందనామ స్మరణచేస్తూ, రథోత్సవంలో స్వయంగా పాలుపంచుకునే భక్తజనుల ఆనందం వర్ణనాతీతం!

ఆ మరురోజు అంటే పదవనాడు శ్రీవరాహస్వామి ఆలయప్రాంగణంలో శ్రీదేవీ భూదేవీ సహిత శ్రీ మలయప్ప స్వామిని శ్రీ సుదర్శన చక్రత్తాళ్వారుతో కూడ వేంచేవు చేయించి పంచామృత స్నపన తిరుమంజనం జరుపబడుతుంది. తర్వాత శ్రీ సుదర్శన చక్రత్తాళ్వారును శ్రీవారి పుష్కరిణిలో మూడుసార్లు ముంచి పవిత్ర స్నానం చేయిస్తారు. అదే సమయంలో వేలాది మంది యాత్రికజనం పవిత్ర కోనేట్లో మునకలిడి పునీతులవుతారు. ఇక ఆ రాత్రి ధ్వజావరోహణంతో "పదినాళ్ల బ్రహ్మ తిరునాళ్లు" వైభవోపేతంగా ఘనంగా పరిసమాప్తమవుతాయి.

ఈ తిరునాళ్లలో ఏడుకొండలవానిని దర్శించడానికి యాత్రికులు తండోపతండాలుగా నేల నాలుగు చెరగుల నుండి తిరుమలను చేరుకుంటారు. బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, యతీశ్వరులు, బాలబాలికలు, కన్యలు, పుణ్యాంగనలు, వితంతువులు, విధురులు, కుంటి, గుడ్డి, వికలాంగులు, అధికారులు, అనధికారులు, పండితులు, పామరులు, ధనికులు, పేదవారు, ఉద్యోగార్థులు, ఉద్యోగులు... ఇలా కార్యార్థులు, శరణార్థులు, అర్థార్థులూ...వారూ, వీరూ అనకుండా ఎందరో మరెందరో దేవతా సార్వభౌముడైన కలియుగ వైకుంఠుని దర్శించడానికి వస్తారు. భక్తి ప్రపత్తులతో మొక్కులు చెల్లించుకుంటారు. నిలువుదోపిళ్లిస్తారు. ముడుపులు సమర్పిస్తారు. పొర్లుదండాలు పెడ్తారు. తలనీలాలిస్తారు. మూడు

కత్తెరలిస్తారు. ఆలయ ప్రదక్షిణలు చేస్తారు. అఖండ దీపాలను వెలిగిస్తారు. కొబ్బరి కాయలను కొడ్తారు. చలిపిండ్ల నైవేద్య మిస్తారు. అర్చనలు చేస్తారు. కల్యాణం చేయిస్తారు. ఉత్సవాలు, ఊరేగింపులూ చేస్తారు. వాహనాలు మోస్తారు...ఇలా కొండల రాయణ్ని తమకు నచ్చినరీతిలో కోటి విధాలుగా కొలిచి, కొలిచి తృప్తిదీర స్వామిని సేవిస్తారు. తరిస్తారు.

ఈ బ్రహ్మోత్సవ సందర్భంలో ఏడు కొండల్లో ఒకవైపు గోవిందలు పెడ్తూ కొండలెక్కుతున్న భక్తజనం... మరోవైపు భక్తితో చిందులేస్తూ భజనచేస్తున్న భజన బృందాలు... ఇంకోవైపు... కోలాటనృత్యాలు... చెక్కభజనలు హరికథలు... బుర్రకథలు... పగటివేషాలు. పవిత్ర పుష్కరిణిలో స్నానాలు. దర్శనాలూ నున్నటి గుండ్లతో ముఖం నిండా పట్టెనామాలతో సాక్షాత్తూ నామాలవాని నడుస్తున్న ప్రతి రూపాలుగా కన్పట్టే భక్తాగ్రేసరులు... సాక్షాత్తు లక్ష్మీ రూపాలుగా కన్పడుతూ, స్వామికి నీరాజనాలిస్తున్న పుణ్యస్త్రీలు– నిత్యాన్నదానాలు... ప్రసాదవితరణలు.. యాత్రికుల సేవలో అహరహం కృషి చేస్తున్న దేవస్థాన ఉద్యోగబృందాలు.. “శ్రీవారి సేవకులు” రక్షకభటులు... స్కౌట్లు, గైడ్లు... ఆరోగ్యాధికారులూ..అర్చకస్వాములూ, ధార్మిక ప్రసంగాలు, ఇలా ఎందరో... మరెందరో... ఎన్నోవిధాలుగా, మరెన్ని విధాలుగా విధి నిర్వహణ చేస్తున్నా... వీరందరి దృష్టి ధ్యేయం ఒక్కటే.. గమ్యం ఒక్కటే అని కొట్టవచ్చినట్లు తెలియజేస్తు ఆనందనిలయం నుంచి శ్రుతికింపుగా వినవచ్చే వేదాలనాదాలు... ఇలా తిరుమల అంతటా ఒక ఆధ్యామిక తేజస్సు నిండి ఉంటుంది.

ఈ బ్రహోత్సవ సమయంలో తిరుమల అంతటా స్వాగతతోరణాలతో... ఆలయప్రాకారాలు మండపాలు.. పుష్కరిణి.. సత్రాలు... ఇలా సర్వే సర్వత్రా విద్యుద్దీపాలతో శోభాయమానంగా అలంకరింపబడుతుంది. కన్నులకు మిరుమిట్లు గొలిపే విద్యుత్‌కాంతుల్లో తిరుమలకొండలు, ఆనంద నిలయదృశ్యం చూచి తీరవలసిందేకాని, వర్ణింప సాధ్యం కానిది.



తిరుమల బ్రహ్మోత్సవంలో మరో ప్రత్యేకత పుష్పాలంకరణ. దేవస్థానంవారి పుష్పవనాలశాఖ తిరుమల శ్రీవారి కైంకర్యానికవసరమయ్యే పూలను పూయించి సరఫరా చెయ్యడమేగాక, తిరుమల అంతటా గీతోపదేశం, గజేంద్రమోక్షం, అన్నమయ్య, త్యాగయ్య, శ్రీవేంకటేశ్వరస్వామి, మున్నగు చిత్రాలు రంగురంగుల పుష్పాలతో తీర్చిదిద్దినతీరు... డోలోత్సవ మండపం... శ్రీవారిఆలయం లోపలా, బయటా సుగుంధపరిమళాలు వెదజల్లుతున్న పుష్పజాతులతో చేసిన అలంకారాలు, కళా నైపుణ్యాలూ... చూపరుల నిట్లే ఆకర్షించి నిలిపి యాత్రికులను మైమరిపిస్తుంటాయి.

ఇలా తిరుమలప్పని తిరునాళ్లలో మనసారా, తృప్తిదీరా పాల్గొన్న భక్తజనం, వింతవింతలుగా కోటికాంతులీనుతున్న తిరుమల బంగారుమేడ వైభవాన్ని మళ్లీ దర్శించే భాగ్యం ఎప్పుడా అని ఆర్తితో, ఆనందంతో ఆర్ద్రనయనాలతో యాత్రికజనం స్వగృహాలు చేరుకుంటారు. తమ జీవితంలో ఒక కొత్త అనుభూతిని ఆనందాన్ని పొందుతూ తిరుమలలో గడపిన క్షణాలను మధురస్మృతులుగా పదిలపరచుకుంటారు.

**(“ఆంధ్రప్రభ” దినపత్రికలో ప్రచురితం)**

# 8. వేంకటాద్రి కృష్ణుడు

**"పరమాత్ముడు పరమపురుషుడు పరికింపగ కృపాలుడు**
**తిరువేంకటవిభుడే కాక దేవుడు మరి కలడా"**

అని శ్రీవేంకటేశ్వరుని సాన్నిధ్యాన్నీ దాతృత్వాన్నీ సంపూర్తిగ పొంది సుఖించిన మహాభక్తుడు తాళ్లపాక అన్నమాచార్యులు.

**భావములోనా బాహ్యము నందును**
**గోవింద! గోవింద! అని కొలువవో మనసా!**

అని అన్నమయ్య అడుగడునా ప్రబోధించినాడు. తిరువేంకటనాథుని నామము 'వెల సులభము ఫల మధికము' అని కొనియాడుతూ ప్రచారం చేశాడు. ఈ హరిని కొలువని కొలువులు ఏవైతే ఉన్నాయో అవన్నీ అడవి గాచిన వెన్నెలలనీ, ఈ అచ్యుతుని గూర్చి వినని కథలు భువిలో గజస్నానాలనీ, వైకుంఠుని పొగడని ప్రార్థనలు బూడిదలో పోసిన పన్నీరులనీ, సర్వదాత అయిన కమలోదరుని కోరని కోరికలు అందని మానిపండ్లనీ తిరుమలేశుని గూర్చి తెలియని 'తెలివి' ఏదైతే వుందో అది నట్టనడియేటి పైరులనీ చెప్తూ అన్నమాచార్యులు కోనేటిరాయని పరమభక్తుడై "వేంకటపతి మీద వింత వింతలుగ" ముప్పదిరెండువేల కీర్తనలను పాడినాడు ప్రచారం చేసినాడు. పదకవితాపితామహుడై వరలినాడు.

ఆకటి వేళల్లో, అలసినవేళల్లో హరినామమే తేకువ మందు, అని కీర్తించినాడు. కొరమాలివున్న వేళ, కులము చెడినవేళ, పరులచే చిక్కి చెరసాలలోవున్నవేళ వేంకటేశునామమొక్కటే గతియని చాటినాడు. ఆపద వచ్చిన వేళ, ఆరడిబడినవేళ, పాపపువేళ, భయపడినవేళ తిరుమలప్పని నామసంకీర్తన వీడక చేసినాడు. సంకెళ్లబెట్టినవేళ చంపబిలిచినవేళ, అప్పుల వారారడి బెట్టిన వేళల్లో కోనేటిరాయని పేరును కొసరి కొసరి తలచి రక్షింపబడ్డాడు అన్నమయ్య.



అయితే అన్నమయ్య ఏ పదం పాడినా ఏ మాట మాట్లాడినా, శ్రీవేంకటపతి తానే వచ్చి ఆ మాటల్లో, ఆ పాటల్లో నర్తనమాడినాడు. అందువల్లనే ఆయన ఆడిన మాటెల్ల అమృతకావ్యమై, పాడిన పాటెల్ల పరమగానమై పరిఢవిల్లింది. అన్నమయ్య ఏ పుణ్యతీర్థాన్ని సేవించినా, ఏ దేవుణ్ణి దర్శించినా అక్కడ అందులో ఆయనకు తిరుమలేశుని రూపే గోచరమయ్యేది. అందుకే అన్నమయ్య తాను కీర్తించిన ఓ కృష్ణుడు – ఓ రాముడు – ఓ నృసింహుడు. ఇత్యాది అవతారాలన్నీ శ్రీవేంకటేశ్వరునితో అభేదం వర్ణించి చెప్పాడు.

అసలు అన్నమయ్యకు ఘనవేంకటేశుణ్ణి కృష్ణుని పేరుతో పిలవడం అంటే మహాఇష్టం. శేషాద్రిపై వెలసివున్న వరదహస్తుడైన తిరుమలేశుడు ధర్మసంస్థాపన కొరకు అనేక యుగాల్లో అవతరించాడని అన్నమయ్య విశ్వాసం. అలాగే ద్వాపరయుగంలో పురిటిలోనే ఎన్నో అద్భుతలీలల్ని చూపి, చివరకు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో అర్జునునకు గీతోపదేశం చేసి, విశ్వరూప ప్రదర్శనద్వారా పరంజ్యోతియై ప్రకాశించిన శ్రీకృష్ణ భగవానుడూ, కలియుగంలో భక్తులపాలిటి కొంగుబంగారమై దర్శనమిస్తున్న తిరువేంకటవిభుడు ఒక్కరే అని అన్నమయ్య అచంచల విశ్వాసం. అన్నమాచార్యుల దృష్టిలో ఆ తిరుమలప్ప సాక్షాత్తు శ్రీకృష్ణుడే. ఆ వేంకటాద్రి గోవిందుడు ఆదిమునుల సిద్ధాంజనం. యశోదపాలిటి భాగ్యం! దేవకి గన్న ఇంద్రనీల మాణిక్యం! తలచిన కరికి తగు దిక్కు! అల ద్రౌపదికి ఆపద్బంధువు! పరమయోగులకు భావనిధానం! గొల్లెతల కౌగిటి సౌఖ్యం! ముగురు వేల్పుల మూలభూతం! ఒక్కొక్కప్పుడు అన్నమయ్య యశోదగా మారి ఆ వేంకటాద్రి కిసునరాయనికి ఉగ్గు పెట్టాడు.

**"ఉగ్గు పెట్టరే ఓ యమ్మా చె-**
**య్యొగ్గీ నిదె శిశు వోయమ్మా**

కడుపులోని లోకమ్ములు గదలీ
నొడ లూచకురే వోయమ్మా
తొడికెడి సరుగన దొలగ దీయరే
వుడికెడి పాలివి వోయమ్మా!



చప్పలు వట్టుక సన్నపుబాలుని
నుప్పర మొత్తకు రోయమ్మా
అప్పుడె సకలము నదిమీ నోరనే
వొప్పదు తియ్యరే వోయమ్మా

తొయ్యలు లిటు చేతుల నలగించక
వుయ్యల నిడరే ఓయమ్మా
కొయ్యమాటలను కొండలతిమ్మని
నొయ్యని తిట్టకు రోరమ్మా

యశోద నిజంగా బాధపడిందో లేదోగాని, అన్నమయ్య ఆపసోపాలు పోతూ తెగ బాధపడ్డాడు. అలాగే వేంకటాద్రి సిసువును మద్రాకు తొట్టెలో లాలిపాడినాడు. చందమామ పాటపాడుతూ వెన్నముద్దలు, గోటిముద్దలు తినిపించాడు అన్నమయ్య.

చందమామ రావో జాబిల్లి రావో
కుందనంపు పైడి కోర వెన్నపాలు దేవో

నగుమోము చక్కని యయ్యకు – నలువ బుట్టించిన తండ్రికి
నిగమములందుండే యప్పకు మా నీలవర్ణునికి
జగమెల్ల నేలిన స్వామికి – చక్కని యిందిరమగనికి
ముగురికి మొదలైన ఘనునికి మా ముద్దులమురారిబాలునికి ॥చందమా॥

సురలగాచిన దేవరకు – చుంచుగరుడని నెక్కిన గబ్బికి
నెరవాది బుద్దులపెద్దకు – మా నీటుచేతలపట్టికి



విరుల కింటివాని యయ్యకు – వేవేలు రూపులస్వామికి
సిరిమించు నెరవాది జాణకు – మా వేంకటనాథునికి ॥చందమా॥

ఈ అన్నమయ్య చందమామ పాట కాలాంతరంలో ఎన్నో మార్పులు చేర్పులకులోనై ప్రచారంలోవున్న విషయం అందరికీ తెలిసిందే. మళ్లీ అంతలోనే తిరుమల చిన్నశిశువును చూచి ఇలా ఆశ్చర్యపోతాడు.

చిన్ని శిశువు చిన్ని శిశువూ
ఎన్నడుఁ జూడమమ్మ యిటువంటి శిశువూ
– – – – – – – – – – –

మ్రోయుచున్న కనకంపు మువ్వల పాదాలతోడ
పాయక యశోదవెంట పారాడు శిశువూ ॥చిన్ని॥

ముద్దుల వేళ్లతోడ – మొరవంక యుంగరాల
నిద్దపుం జేతుల పైడి బొద్దులతోడ
అద్దపుం జెక్కులతోడ "అప్పలప్పల"నినంత
గద్దించి యశోద మేను కౌగిలించు శిశువు ॥చిన్ని॥

బలువైన పొట్టమీద – పాలచారలతోడ
నులివేడి వెన్న దిన్న నోరి తోడ
చెలగి నేడిదె వచ్చి వేంకటాద్రిపై
నిలిచి లోకములెల్ల నిలిపిన శిశువు. ॥చిన్ని॥

ఇలాంటి వేంకటాద్రివింతసిసువుకు అన్నమయ్య ఇలా జోల పాడి నిద్రబుచ్చాడు.

జో అచ్యుతానంద జోజో ముకుంద
రావె పరమానంద రామ గోవింద జో జో ॥

అంగజునిగన్న మా యన్న యిటు రారా
బంగారుగిన్నెలో – పాలు పోసేరా

**దొంగ నీవని సతులు - పొంగుచున్నారా**
**ముంగిట నాడరా - మోహనాకారా ॥జో అచ్యుతా॥**

**గోవర్ధనం బెల్ల - గొడుగుగా బట్టి**
**కావరమ్మున నున్న - కంసు బడగొట్టి**
**నీవు మధురాపురము - నేల జేపట్టి**
**ఠీవితో నేలిన - దేవకీ పట్టి ॥జో అచ్యుతా॥**

నేటికీ ఈ జోలపాట తిరుమల ఆనందనిలయంలో అన్నమయ్య వంశీయులు ప్రతిరాత్రి ఏకాంతసేవలో పాడటం జరుగుతున్నది. ఈ పాట విన్న తర్వాతే స్వామివారికి నిద్ర. అందుకే "తాళ్లపాకవారి లాలి తరిగొండవారి హారతి" అన్న ప్రసిద్ధి ఏర్పడింది.

ప్రతిరాత్రి ఏకాంతసేవా సమయంలో బంగారు పట్టెమంచంపై భోగ శ్రీనివాసమూర్తిని వేంచేపు చేస్తారు. ఆ సమయంలో రాములవారి మేడలో కూర్చున్న అన్నమయ్య వంశీయులు తంబురమీటుతూ, లాలిపాడతాడు. అది వింటూ మాతృశ్రీ తరిగొండ వెంగమాంబగారి ముత్యాలహారతి స్వీకరిస్తాడు స్వామి. ఆ తర్వాత ఎలాంటి పూజలు - అర్చనలు వుండవు- ఆనందనిలయం మూసివేస్తారు. ఇది నాటి నుండి నేటికీ జరుగుతున్న సంప్రదాయం. ఒక్క ఏకాంతసేవలోనే కాదు. సుప్రభాత సమయంలో కూడ తాళ్లపాక వంశీకులు అన్నమయ్య పాటతోనే తిరుమలప్పను మేల్కొల్పుతున్నారు. బ్రాహ్మీ ముహూర్తంలో 3గం॥లప్పుడు. బంగారు వాకిలి ముందుగల తిరుమహామణి మంటపంలో, ఆచార్యులు "కౌసల్యాసుప్రజా రామ" అని సుప్రభాతం పాడతారు. అదే సమయంలో బంగారు వాకిలిని ఆనుకొని అన్నమయ్య వంశీకులు తంబురమీటుతూ ఇలా స్వామిని మేల్కొల్పడం నేటికీ చూడవచ్చు.

**మిన్నక వేసాలు మాని మేలుకోవయ్యా**
**సన్నల నీ యోగ నిద్రచాలు మేలుకోవయ్యా**



**ఆవులు పేయలకుగా అరచీ పిదుకవలె**
**గోవిందుడ యింక మేలుకొనవయ్యా!**
**ఆవలీవలి పడుచులు ఆటలు మరిగి వచ్చి**
**తోవ గాచుకున్నారు పొద్దున మేలుకోవయ్యా**

**పిలిచీ నందగోపుడు పేరుకొని యదె కన్ను**
**కొలుకులు విచ్చి మేలుకొనవయ్యా**
**అలరిన శ్రీవేంకటాద్రి మీది బాలకృష్ణ!**
**ఇల మా మాటలు వింటి విఁక మేలుకొనవయ్యా!**

మరి మనం ఈ అన్నమయ్య జయంతి, వర్ధంతి ఉత్సవాల్లో తాళ్లపాకవారిని సంవత్సరాని కొకసారి సత్కరించడం చూస్తూవున్నాం కదా. కాని ఆ తిరుమల వేంకటేశ్వరుడు ఆనాటి నుండి ఈనాటి వరకు తాళ్లపాక వారి పాటలను వింటూ ఎంతగా సంభావిస్తున్నాడో చూస్తే అన్నమయ్య గొప్పదనం మనకు ప్రస్ఫుటమవుతుంది. ఎందుకంటే తిరుమల ఆనందనిలయంలో వైఖానస ఆగమం ప్రకారం పూజలు జరుగుతున్నై. ఆ పూజల నిర్వహణ సహాయ సహకారాలందిస్తున్నవారు పాంచరాత్రాగమ సార్వభౌములైన భగవద్రామానుజుల వారి శిష్యులైన శ్రీజియ్యంగారులు. అటు వైఖానసం - ఇటు వైష్ణవాల మధ్య శాశ్వతంగా అన్నమయ్య చోటు చేసుకోవడం ఆశ్చర్యం కలుగుతుంది.

అంతేగాదు. సాక్షాత్తు తిరుమల వేంకటేశుడు. "అమ్మహాదేవుండు మదీయ మాతామహవంశ శిఖారత్నంబగు నన్నమాచార్యునకు జామాతురుండనిపించుకొని, భవదీయ సంకీర్తనంబు లాలించిన కర్ణంబుల నితర సంకీర్తనంబు లాలించనని ప్రతిజ్ఞ గావించె" - నని శకుంతలా పరిణయంలో రేవణూరి వేంకటార్యుడు-అన్నమయ్య దౌహిత్రుడు తెలిపాడు. నిజంగా కూడ - అన్నమయ్యకు అల్లుడే మన వేంకటేశుడు. 'నిచ్చల

కల్యాణం పచ్చులతోరణం' ప్రసిద్ధి చెందిన తిరుమల క్షేత్రంలో శ్రీదేవిభూదేవి సహిత శ్రీవేంకటేశునకు నిత్యకల్యాణం ఏర్పాటు చేసింది అన్నమయ్య. అన్నమయ్యది భరద్వాజగ్రోతమే మరి వేంకటేశునిదీ భరద్వాజగోత్రమే అయినా కన్యాదానం చేసి – పెళ్లి చేసిన మామ అన్యమయ్య. వేంకటేశ్వరుడు – నిత్య పెళ్లికొడుకైతే – అన్నమయ్య నిత్య కన్యాదాత. నేటికీ కల్యాణోత్సవంలో అన్నమయ్య వంశీయులుగా కన్యాదాతలుగా వుంటూ సముచిత సత్కారం పొందుతూనే వున్నారు. ఒక్క కల్యాణోత్సవంలోనే కాదు. వసంతోత్సవం – బ్రహ్మోత్సవం – పుష్పయాగం – ఇత్యాది సేవల్లో ఉగాది, శ్రీరామనవమి – ఆణివార ఆస్థానం వంటి కొలువుల్లో తాళ్లపాకవారు నేటికీ తిరుమలఆలయ సేవల్లో – పూజల్లో – పాలుపంచుకొని ఘనంగా సత్కరింపబడుతున్నారు – సంభావింపబడుతున్నారు.

ఒక్కొక్కప్పుడు అన్నమయ్య నాయికగా మారతాడు. గోపికగా, గొల్లెతగా వేషం మార్చుకుంటాడు. శ్రీవేంకటేశుడనే శృంగారకృష్ణుని కౌగిటిలో నలిగిపోతాడు. ఆనాటి రుక్మిణీ సత్యభామల మాదిరిగా, తిరుమలలో ఈనాటి శ్రీదేవీభూదేవుల మాదిరిగా ఆ నందనందనుని ఆనందనిలయుని కౌగిటి సుఖాల్ని రెండు చేతులా జవురుకున్నాడు – జుర్రుకున్నాడు. జగన్నాయకుడైన ఆ సింగారరాయని వలచి వలపించుకొని నిండుగా మెండుగా అనుభవించిన ఆ వలపుపంటల్ని శృంగార సంకీర్తనలుగా దండిగా పండించినాడు అన్నమయ్య.

అట్లే కొన్ని సమయాల్లో ఆ వేంకటగిరిదేవుడు ద్వంద్వాతీత శ్రీకృష్ణ పరబ్రహ్మగా గోచరించినప్పుడు శ్రీకృష్ణలీలల్ని – శ్రీకృష్ణావతారతత్త్వాన్ని వర్ణిస్తూ అధ్యాత్మ కీర్తనల్ని కోకొల్లలుగా కొలిచిపోశాడు.

అయితే అన్నమయ్య ఎన్ని కీర్తనలు రాసినా, ఆ అన్ని కీర్తనల్లో ఆ కృష్ణునికీ – ఈ వేంకటేశునికీ అభేదం కల్పించి చెప్పాడు. కేవలం అభేదం మాత్రమే కాదు. ఆ నల్లనికన్నయ్యే – ఈ వేనామాల వెన్నుడు – ఒక్కటే



అనీ – ఆ రేపల్లె గోపాలుడు – ఈ తిరుమలగోవిందుడు, ఒక్కడే పొమ్మన్నాడు. అంత నిక్కచ్చిగా చెప్పాడు. మరి ఈ అభిప్రాయం ఎవరైనా చెప్పారా! ఆ కృష్ణుడే – ఈ వెంకన్నని!

ఎవరో ఎందుకు – తనకు తానుగా ఆ తిరుమల గోవిందుడే స్వయంగా చెప్పుకొన్నాడు. ఏ సందర్భంలో – అంటే వేంకటాచల మాహాత్మ్యంలో పరిశీలిస్తే తెలుస్తుంది.

వైకుంఠం నుండి అలిగి భూలోకానికి వచ్చిన లక్ష్మీదేవిని వెదక్కుంటా శ్రీనివాసుకూడ భూలోకానికి వస్తాడు. ఆకాశరాజు పుత్రిక పద్మావతిని చూస్తాడు. అంతే అటు అమ్మవారు – ఇటు అయ్యవారు నిశ్చేష్టులై ఒకరికొకరు గాఢంగా చూసుకుంటారు. ఆ సమయంలో అమ్మవారు చెలికత్తెలతో అడిగిస్తుంది. ఎవరయ్యా నీవు ఎక్కణ్ణించి వచ్చావు! నీ ఊరేమిటి?... నీ పేరేమిటి... అని. అప్పుడుంటాడు గదా మన వేంకటేశుడు. తన పేరు శ్రీకృష్ణుడనీ, తన అన్న బలరాముడనీ, తల్లిదండ్రులు దేవకీ వసుదేవులనీ, తన నివాసం వరాహక్షేత్రమనీ చెప్తాడు. అమ్మవారిని తినేశేట్టు చూస్తున్న స్వామివారిని అరుస్తూ, అయ్యవారివైపు గాఢంగా చూస్తున్న అమ్మవారిని బలవంతంగా ఈడ్చుకొనిపోతూ ఇలా అనుకొంటున్నారట.

**"కలికి చకోరాక్షికి గడకన్నులు గెంపై తోచిన**
**చెలువంబిప్పు డిదేమో చింతింపరె చెలులు**
**నలువున ప్రాణేశ్వరుపై నాటిన యా కొనచూపులు**
**నిలువున బెరుకగ నంటిన నెత్తురు కాదుగదా"**

అన్నమయ్య వేంకటాచలమాహాత్మ్యం రాశాడట! అది మన దౌర్భాగ్యం కొద్ది దొరకలేదు. ఇలా అన్నమాచార్యులు భక్తితో స్వామివారిని స్మరిస్తూ, సర్వజనామోదంగా సర్వజనాహ్లాదంగా శ్రీవేంకటేశ్వర పదకవితా యజ్ఞాన్ని సాగించి 32 వేలపదకవితలను వ్రాశాడు. ఆ సంకీర్తన పుష్పాలను.

**"దాచుకో నీ పాదాలకు తగ**
**నే చేసిన పూజలివి"**

అంటూ తిరుమల వేంకటేశునికే అంకితం చేసినాడు. ఆ ఘనవేంకటేశునిచేత మూడుతరాలు ప్రత్యక్ష దర్శనాన్ని, ఏడుతరాలు మోక్షాన్ని - శాశ్వతంగా వంశీకులకు సేవాభాగ్యాన్ని పొందిన పరమభక్తాగ్రేసరుడు తాళ్లపాక అన్నమాచార్యులు.

**"ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షించగ**
**తక్కినవి భండారాన దాచివుండనీ"**

అని అంటూ తిరుమల ఆలయ ఆవరణలో భండారాన్ని ఏర్పరచి సంకీర్తన రేకులను "దేవుడు మెచ్చునట్లు లోకము మెచ్చునట్లు" త్రికరణ శుద్ధిగ సమర్పణ చేసిన ఘనత తాళ్లపాక అన్నమయ్యకు దక్కింది.

ఒకే వంశంలో - తరతరాలుగా - కవులు వుండవచ్చునేమో!

ఒకే వంశంలో - తరతరాలుగా - భక్తులు వుండవచ్చునేమో!

కాని ఒకే వంశంలో - తరతరాలుగా - భక్తులై - కవులై వుండడం

ఒక ప్రసిద్ధ పుణ్యక్షేత్రంలో ఆలయ అర్చనా సంప్రదాయం విశేషాల్లో శాశ్వతంగా చోటు చేసుకొనే భాగ్యం తాళ్లపాక కవులకే దక్కింది! ఇది ఎంతైనా విశేషమైన విషయం.

ఇది సాక్షాత్తు హరియవతారమైన అన్నమయ్యకే చెల్లింది!

**"ఈ మాటా గర్వము గాదు - మీ మహిమే కొనియాడితిగాని."**

# 9. అన్నమయ్య దర్శించిన వజ్ర కిరీటధారి



**స్ఫురదరవింద సులోచన**
**మరకత మాణిక్యహార మణిమయ మకుటా!**
**వరలక్ష్మీ కుచ కుంకుమ**
**విరచిత వక్షోంక భరణ! వేంకటరమణా!!**

ప్రపంచంలో ఒక వస్తువు యొక్క విశిష్టతను లేదా ప్రత్యేకతను చెప్పేటప్పుడు దానిని 'మకుటాయమానమని' కిరీటంతో పోల్చి వర్ణిస్తారు. బహుశా అన్ని ఆభరణములకన్న కిరీటము ఉన్నతస్థానమైన శిరస్సు నలంకరించుటయే ఈ ఉపమానమునకు ప్రధాన కారణం కావచ్చు. సరే బాగుంది. మరి సాక్షాత్తు కిరీటాన్ని గూర్చి చెప్పేటప్పుడు. దేనితో పోల్చవలె? అందులో అది సామాన్య కిరీటమా? మరకత మాణిక్య వజ్ర వైడూర్యాలు పొదిగిన తిరుమల శ్రీవారి వజ్రకిరీటం. దానిని దేనితో పోల్చవలె?

శ్రీ స్వామివారు ధరించిన ఆయుధాలు ఆభరణాలు స్వామివారి వలెనే ప్రతిలేని మహిమలు కలిగినట్టివి. అందుచేత సాక్షాత్తు స్వామి ధరించిన ఆభరణాలు, ఆయుధాలు స్వామివారితో మాత్రమే పోల్చవలెను. అంటే

స్వామి వారితో కూడుకున్న కిరీటాది ఆభరణాయుధాలను వర్ణించవలెను. లేదా కిరీటధారియైన శ్రీ వేంకటేశ్వరుణ్ని కీర్తించవలెను. మరి వజ్ర కిరీటధారియైన వేంకటేశ్వరుడు ఎలాంటివాడు? అంటే

కోరినవారి కల్పతరువు. పట్టిన వారి చేతి బంగారం. ముట్టి కొలిచినవారి ముందుజీతం. సేవ చేసినవారి చేతిలో మాణిక్యం భావించువారి పరబ్రహ్మ కావలెనన్న వారికి ఘనమనోరథసిద్ధినిచ్చే గురుతైనదైవం! పూజించే వారిని రక్షించే వజ్రపంజరం! బత్తి చేసిన వారి భవరోగవైద్యుడు. తన్మయించి నుతించిన వారి ఆనందరూపుడు. కనుకనే ఒక ప్రాచీన మహాకవి వజ్రకిరీటధారియైన వేంకటరమణుని ఇలా మనసారా కీర్తించినాడు.

**మకుటతట ఖచితపటుమణి**
**నికరోదీర్ణాచ్ఛకాంతి నిండుగ నిగుడన్**
**నొకసారైనను నెదుటను**
**వికసింపుము కమలచరణ వేంకటరమణా!**

అలాగే తాళ్లపాక అన్నమాచార్యులు స్వప్నంలో ఒకసారీ, ప్రత్యక్షంగా బంగారువాకిలి దగ్గరినుండి ఒకసారి వజ్రకిరీటధారి వేంకటేశ్వరుణ్ని దర్శించి వర్ణించాడు.

మొట్టమొదట పూర్వజన్మ సుకృతఫలంగ చిరుత ప్రాయంలోనే అన్నమయ్య ఒక చక్కని కలను కన్నాడు. ఆ స్వప్నంలో హారకేయూరాది భూషణాలతో కోటి సూర్యతేజంతో ప్రకాశిస్తున్న వజ్ర కిరీటధారియైన వేంకటేశ్వరుణ్ని అన్నమయ్య దర్శించినాడు. వెంటనే మేలుకొన్నాడు. తాను కలలో దర్శించిన దివ్యమంగళ మూర్తియైన వజ్రకిరీటధారిని ఆనందాతిశయంతో ఇలా కీర్తించాడు.

**భూపాళం**

**ఇప్పుడిటు కలగంటి నెల్ల లోకములకు**
**నప్పడగు తిరువేంకటాద్రీశుఁగంటి**



**అతిశయంబైన శేషాద్రిశిఖరము గంటి**
**ప్రతిలేని గోపురప్రభలు గంటి**
**శతకోటి సూర్యతేములు వెలుఁగఁగ కంటి**
**చతురాస్యు బొడగంటి చయ్యన మేలుగంటి**

**కనకరత్న కవాటకాంతు లిరుగడ గంటి**
**ఘనమైన దీపసంఘములు గంటి**
**అనుపమ మణిమయమగు కిరీటము గంటి**
**కనకాంబరము గంటి గక్కన మేలుకంటి॥**

**అరుదైన శంఖచక్రాదు లిరుగడఁగంటి**
**సరిలేని అభయ హస్తము గంటిని**
**తిరువేంకటాచలాధిపునిఁ జూడఁగ గంటి**
**హరిగంటి గురుఁగంటి నంతట మేలుకంటి॥**

సర్వలోకాలకు తండ్రియైన శేషాద్రీశునికలలో ఈ విధంగా చూశాను. మహోన్నతమూ, మహాప్రభావ సంపన్నమూ అయిన శేషాద్రి శిఖరాన్ని చూశాను.

దీటులేని ఆనందనిలయ గోపురకాంతులను చూశాను. ఆ కాంతులు నూరుకోట్ల సూర్యతేజంతో ప్రకాశిస్తున్నాయి. బ్రహ్మను కూడా చూశాను.

ఇరువైపుల రత్నములు పొదిగిన బంగారువాకిళ్లు, వాని కాంతులను దర్శించాను. దేదీప్యమానంగా వెలుగుతున్న దీప సమూహాన్ని, సాటిలేని మణులు తాపిన వజ్రకిరీటాన్ని, కనకాంబరాలను ధరించిన శ్రీస్వామివారిని కన్నులారా దర్శించి మేలుకొన్నాను. శ్రీ వేంకటేశ్వరుడు ధరించిన అరుదైన శంఖ చక్రాలను కనుగొన్నాను. ఆశ్రితులకు అభయమిస్తున్న వరద హస్తమును కంటిని. శ్రీ వేంకటాచలాధీశుని దివ్యమంగళ స్వరూపాన్ని దర్శించాను.

పై సంకీర్తనలో అన్నమయ్య, మనలకు, మొదట శేషాద్రిశిఖరాన్ని తదుపరి అక్కడి ఆనందనిలయాన్ని, ఆనందనిలయంలో వేంచేసివున్న వజ్రకిరీటధారి వేంకటేశ్వరుణ్ని చలన చిత్రంలోని దృశ్యాలవలె వరుసగా చూపించినాడు.

వెంటనే మేలుకొన్నాడు అన్నమాచార్యులు. స్వప్నంలో గోచరించిన స్వామి తనను రమ్మని పిలిచి నట్లయింది. వెంటనే పయనమై తాళ్లపాకను వీడి తిరుమల క్షేత్రం చేరుకున్నాడు. ఆలయం ప్రవేశించాడు. శ్రీ స్వామివారికి ఎదురుగా నున్న గరుడుని వద్ద నిలిచి స్వామివారిని ప్రత్యక్షంగా దర్శించినాడు. అన్నమయ్య బంగారువాకిలి ఇవతల నుండి లోపల నున్న సర్వాలంకారభూషితుడైన వజ్రకిరీటధారి వేంకటేశ్వరుని దర్శించిన రూపమీది.

**"బంగారు గాదెల పజ్జసాష్టాంగ**
**మంగవింపుచుఁబులకాంకితుఁడగుచు**
**గ్రక్కున దగ్గరఁగనుపట్టు పసిఁడి**
**టక్కులతల వాకిటను గానవచ్చు**
**ధళ ధళల్ తులకించు దరచక్రహస్త**
**ములు బొడ్డు మానికమును గతారమును**
**మంజీర కింకిణీ మంజులపాద**
**కంజద్వయంబును గాంచనాంబరము**
**కటిమీదఁ జేర్చిన కరపంకజంబు**
**తటుకన వరమిచ్చు తమ్మికెంగేలు**
**కులికెడు మణిమయ కుండలద్యుతులు**
**కలకల నగు ముద్దుగారు నెమ్మొగము**
**మంచి ముత్యాలనామంబుపైఁ గాను**



**పించు రత్నాంశు దీపిత కిరీటంబు**
**తట్టు పునుంగు పూతయుఁ గిరీటాది**
**చుట్టిన చెంగల్వ చొల్లెంపు దండ**
**వనమాలికయును శ్రీకౌస్తుభము**
**అనుపమ దివ్య భూషాది వైఖరులు ॥**

గలిగిన శ్రీ వేంకటరమణుని దివ్యమంగళ విగ్రహమును నిలువెల్ల గన్నులు చేసికొని ఆ కన్నుల కరవెల్ల దీరునట్లు దర్శించినాడు అన్నమయ్య. మనలతో కూడ ఆ స్వామిని దర్శింపజేశాడు.

అంతటితో ఆగలేదు. అన్నమాచార్యులు బంగారు వాకిలిలో అడుగు పెట్టాడు. ఆనంద నిలయంలో ప్రవేశించాడు. స్వామికి ప్రక్కనే నిలిచినాడు. మణిమయమకుటం ధరించిన శ్రీ స్వామివారి విశ్వమోహన స్వరూపాన్ని పాదాది కిరీటం వరకు మహదానంద పారవశ్యంతో ఇట్ల వర్ణించాడు.

**రామక్రియ**

**కంటిఁగంటి నిలువు చక్కని మేను దండలును**
**నంటుఁ జూపులను జూచే నవ్వుమోము దేవుని ॥**

**కనకపు బాదములు గజ్జెలు నందెలును**
**ఘన పీతాంబరము పై కట్టు కటారి**
**మొనసి యొడ్డాణపు మొగపుల మొలనూలు**
**ఒనర నాభీకమల ముదర బంధములు**

**గరిమ వరదహస్త కటి హస్తములును**
**సరస నెత్తిన శంఖ చక్ర హస్తములు**
**ఉరముపై కౌస్తుభ మొప్పగు హారములు**
**– – – –**

**కట్టిన కంట సరులు ఘన భుజకీర్తులు**
**కట్టాని ముత్యాల సింగార నామము**
**నెట్టన శ్రీవేంకటేశ నీకు గర్ణ పత్రములు**
**నట్టె శిరసుమీఁద నమరే కిరీటము ॥**

ఎంత చక్కని సొగసైన నిలువు దివ్యదేహం తెల్లదామరల వంటి కన్నులతో చిరునగవు తొలకించు మోముతో గల స్వామిని కంటిని"

గజ్జెలు అందియలుగల బంగారుపాదాలను కంటిని. నిగ నిగ కాంతులతో మెరయు బంగారు దోవతి దానిపై గల కటారిని. యొడ్డాణమును, మొలనూలును, నాభియందున్న కమలమును వరద హస్తమును, కటి హస్తమును, శంఖ చక్రములు ధరించిన హస్తములను వక్షఃస్థలముపై ధరించిన కౌస్తుభమును ప్రకాశించు హారాలను ధరించిన స్వామిని కంటిని...

మెడలో కంటె, హారములను మేలయిన భుజకీర్తులను సింగారముగా నున్న ముత్యాల నామము, మకర కుండలములను శిరసుపై ప్రకాశించు కిరీటమును ధరించిన శ్రీ వేంకటేశ్వరుని దివ్యస్వరూపమును దర్శించితిని. అని ఇలాగ అన్నమాచార్యులు కిరీటధారియైన తిరుమలలేశుని దివ్యమూర్తిని ఆపాదమస్తకం కీర్తించాడు.

అయినా ఆ పరమభక్తునకు తృప్తిదీరలేదు. మళ్లీ స్వామివారి దివ్యరూపాన్ని ఇలా తనివిదీరా వర్ణించి, మన కన్నులకు ఆ కిరీటధారిని సాక్షాత్కరింపజేయుచున్నాడు.

**నాట**

**వాఁడివో కంటిరటరే వన్నెలవాఁడు**
**పైఁడిమోలము కటారు పరజులవాఁడు**

**పెద్ద కిరిటమువాఁడు పీతాంబరమువాఁడు**
**నొద్దికఁ గౌస్తుభమణివురమువాఁడు**



**ముద్దుల మొగమువాఁడు ముత్తేలనామమువాఁడు**
**అద్దిగో శంఖచక్రాల హస్తాలవాఁడు ॥**

**అందిన కటిహస్తము నభయ హస్తమువాఁడు**
**అందెల గజ్జెలఁబాదాలవాఁడు**
**కుందణంపు యీమకర కుండలంబువాఁడు**
**కందువ బాహుపురుల కడియాలవాఁడు ॥**

**నగవుఁజూపులవాఁడు నాభికమలమువాఁడు**
**మొగపుల మొలనూళ్ల మొలవాఁడు**
**చిగురు మోము(వి)వాఁడు శ్రీవేంకటేశుఁడు**
**తగు నలమేలుమంగ తాళిమెడవాఁడు ॥**

పై పాటలో అన్నమాచార్యులు స్వామిని శిరసాది పాదాంతం వరకు వర్ణించాడు. కాని దేవతలను ఆపాదమస్తకం వర్ణించాలని, మానవులను శిరసాది పాదాంతం వర్ణించాలని పెద్దలమాట. హరియవతారమయిన తాళ్లపాక అన్నమాచార్యులు శ్రీవేంకటేశ్వరునితో గల గొప్ప అనుబంధం, చనువుతో, ఆయన స్వామిని ఏలాగయినా స్వేచ్ఛగా వర్ణింప అర్హత సంపాదించినట్లు స్పష్టం.

ఈ పాటలో అన్నమయ్య మరొక విశేషం చెప్పాడు. శ్రీవేంకటేశుని ఉరముపై నున్నది అలమేలుమంగయే అని స్పష్టంగా చెప్పాడు.

ఐదువందల ఏండ్లనాడు పరమభక్తుడైన అన్నమయ్య సందర్శించి వర్ణించిన వజ్రకిరీటధారి వేంకటేశ్వరుని దివ్యమూర్తి, ఆ విధంగానే ఇప్పటికీ భక్తులకు దివ్యసందర్శనం మిస్తున్నది. శ్రీస్వామివారి దివ్యమంగళ విగ్రహం నిత్యనూతనమై ఎప్పటికప్పుడు కొత్తకొత్తగా గోచరించుచున్నది. అట్టివజ్ర కిరీటధారియైన వెంకటేశ్వరుడు వర్ణింపబడ్డ ఈ అన్నమయ్య సంకీర్తనలు నిత్యనూతనమై పఠితలకు భక్తి సంధాయకములై ఆనందంకలిగిస్తూ వెలుగొందుతున్నాయి.

శ్రీవేంకటేశ్వరుణ్ణి ఇంత వైభవంగ వర్ణించిన పరమ భక్తాగ్రేసరుడైన అన్నమయ్య సాక్షాత్తు ఆ హరియవతారమే!

**మహిత జాంబూనద మణి కిరీటద్యుతుల్**
**రవి కిరణంబుల ఁగమ్మరింప**
**నవరత్న మయ దివ్య నక్రకుండల కాంతి**
**గండభాగంబుల మెండుకొనఁగ**
**కంఠ భాగ విలగ్న కౌస్తుభ మాణిక్య**
**దీధితుల్ దిక్కులఁదేజరిల్ల**
**రమణీయ మౌక్తిక రత్నహార వినూత్న**
**తరకద్యుతు ల్నభస్థలము నిండ**

**యురమునం దలమేల్మంగ మురుపు సూప**
**నిలిచియున్నట్టి నీమూర్తిఁ గొలుతునెపుడు**
**శేషశైలాగ్రవాస! లక్ష్మీనివాస!**
**పంకజాత భవాండేశ! వేంకటేశ!!**

తిరుమల శ్రీవారికి వజ్రకిరీటంలో 28,369 వజ్రాలు పొదగబడ్డాయి. 25 కిలోల బంగారంతో చేయబడిన ఈ అపురూప కిరీటం వెల ఆరుకోట్లరూపాయలు.

**(1985 డిశంబరు 20న తిరుమల శ్రీవారికి నూతన వ్రజకిరీటం సమర్పించిన సందర్భంగా "సప్తగిరి" ప్రత్యేక వ్యాసం.)**

## 10. అహోబలేశుడు - అన్నమయ్య

**పరిత్రాణాయ సాధూనాం**
**వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మ సంస్థాపనార్థాయ**
**సంభవామి యుగే యుగే**

అని శ్రీకృష్ణుని వచనము. సజ్జనులను రక్షిస్తూ దుర్జనులను శిక్షిస్తూ ధర్మాన్ని నిలుపుటకై భగవంతుడు యుగయుగాల్లోను అవతరిస్తాడని భావం.

గడచిన అనంతకాలంలో పుట్టిన లోక కంటకులనేకులను పరిమార్చి లోకంలో ప్రశాంతతను కలిగించుటకై పరమాత్ముడు పలుమార్లు అవతరించాడు. వానిలో ముఖ్యంగా చెప్పుకొని స్మరింపదగింది శ్రీనృసింహావతారం.

**మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహ శ్చ వామనః**
**రామో రామ శ్చ రామ శ్చ బుద్ధః కల్కిరేవ చ**

అను దశావతారంలో వరుస క్రమంలో శ్రీనృసింహావతారం నాలుగవదిగా పేర్కొనబడింది.

ప్రాచీన భారతీయ వాఙ్మయంలో నరసింహావతార వృత్తాంతాన్ని గూర్చి పరిశీలిస్తే పలుతావుల ఎన్నో ఘట్టాలు మనకు గోచరిస్తాయి. తెలుగు సాహిత్యంలో చూచినట్లయితే అద్వితీయ ప్రబంధమైన నృసింహపురాణం లక్ష్మీ నృసింహావతారావిర్భవాన్ని గూర్చి విపులంగా వివరిస్తుంది. ఈ కమనీయకావ్యం కవిత్రయంలో ఒకరైన ఎఱ్ఱాప్రెగ్గడచే రచింపబడింది. భారత భాగవత మహాకావ్యాల్లో దశావతార వర్ణనసమయంలో ఈ నృసింహావతారమూర్తి చక్కగా చిక్కగా వర్ణింపబడి వుండడం విజ్ఞులెరిగినదే.

ఇక శతకవాఙ్మయంలో సరేసరి, ధర్మపురి నరసింహశతకం, సింహాద్రి నారసింహశతకం, తరిగొండ నృసింహశతకం మున్న గునవెన్నో వెలిశాయి.



జానపదవాఙ్మయంలోని పెక్కుగేయాల్లో, యక్షగానాల్లో నృసింహుడు 'నరహరి'గా, ఆయన దేవేరి 'చెంచు లక్ష్మి'గా తెలుగునాట తెలుగునోట తేనెలూర వేనోళ్ళ కీర్తింపబడ్డారు.

శ్రీవేంకటేశ్వరుని అంతరంగిక భక్తుడూ పదకవితా పితామహుడూ అయిన తాళ్ళపాక అన్నమాచార్యులు తన సంకీర్తనల్లో శ్రీఅహోబలేశుని దివ్యస్వరూపాన్ని. అవతార కథాంశాలను నిండుగా మెండుగా వర్ణించాడు.

**"అనిశము దలఁచరో అహోబలం**
**అనంత ఫలదం బహోబలం"**

అని శ్రీఅహోబలక్షేత్ర ప్రశస్తిని, మహిమనూ కమ్మని తేటతెనుగు పాటల్లో వర్ణించాడు. అంతేకాదు "అదివో చూడరో ఆదిమ పురుషుని" అంటూ "పెదయౌభళము మీది పెనుసింహము"ను కొనియాడుతూ, బ్రహ్మాదులు, వేదాంతతతులు వెదకి కానగలేని ఆ ఘనసింహమును ప్రత్యక్షంగా దర్శించి



కీర్తించాడు అన్నమయ్య. అందువల్ల అన్నమాచార్యులకు శ్రీఅహోబలేశునిపై గల భక్తి ప్రపత్తులు లోకానికి ప్రస్ఫుట మవుతున్నాయి.

ఇదేగాక అన్నమయ్య అహోబిలంలో కూడ కొంతకాలంపాటు నివసించాడు. సకలవేదాంతశాస్త్రాలను అక్కడనే అధ్యయనం చేశాడు. ఆ కాలంలో తాళ్లపాకకవుల విష్ణుభక్తి తత్పరతకూ వైష్ణవమత ప్రచారానికి తిరుపతి వలనే అహోబల క్షేత్రం కూడా ప్రధాన కేంద్రంగా భాసిల్లింది. కనుకనే అహోబిలంలో కూడ వారి రచనలు చెక్కిన రాగి రేకులు లభ్యమయ్యాయి.

"వరకవితా గుణ చతురుడైన" అన్నమాచార్యులు శ్రీనృసింహావతార కథా ఘట్టాలను "నరసింహవిజయము"గా పదకొండు చరణముల పెద్దపాటలో వీనులవిందుగా గానం చేశాడు.

**"వినరయ్య నరసింహవిజయము జనులాల**
**అనిశము సంపదలు నాయువు నొసఁగును ॥**

అని ప్రారంభించి, శ్రీనృసింహుని ఆవిర్భవాన్ని హిరణ్యకశిపుని సంహారాన్ని వర్ణిస్తూ చివరి చరణంలో

**"అప్పు డిందిరాదేవి యంకమునఁ గూచుండె**
**వొప్పుగ శాంతమందె నహోబలేశుఁడు**
**తప్పక కోనేటిదండ దానై యిందును నందు**
**చిప్పిల వరము లిచ్చీ శ్రీవేంకటేశుఁడు॥**

అహోబిలంలో వున్న నరసింహుడే, తిరుమల కోనేటిదండనున్న వేంకటేశుడుగా మారి వరాలిస్తున్నాడనడంలో అన్నమాచార్యుల యొక్క అభేద దృక్పథం ఆవిష్కరింపబడింది.

ఇలాగ తిరుమల శ్రీవేంకటేశ్వరునికి శ్రీఅహోబల నృసింహునికీ అభేదాన్ని కల్పించి రసానుగుణంగా రచించిన కీర్తనలు కొల్లలుగాన్నాయి.

తిరుపతి క్షేత్రం వలెనే అహోబిలక్షేత్రం కూడ కొండ పైభాగం ఎగువ అహోబిలమనీ, కొండ క్రింది ప్రదేశం దిగువ అహోబిలమని ప్రాచీనకాలం నుండీ ప్రసిద్ధంగా వ్యవహరింపబడుతున్నది. పై రెండు దివ్యస్థలాల్లో శ్రీనరసింహస్వామి తొమ్మిది రూపాల్లో భక్తులకు దివ్యదర్శనమిస్తూ గ్రహిస్తున్నాడు.

**"జ్వాలాహోబిల మాలోల**
**క్రోడ కారంజ భార్గవాః**
**యోగానంద ఛత్రవట**
**పావనా నవ మూర్తయే"**

అని శ్లోకరూపంలో పేర్కొనబడ్డ నవనారసింహులు వెలసినందువల్ల అహోబిలక్షేత్రం నవనారసింహ క్షేత్రమని ప్రసిద్ధి ఏర్పడింది. ఈ నవనారసింహులను అన్నమాచార్యులు ఒక్క పాటలో ఇలా కీర్తించాడు.

**నాట**

**నవనారసింహా నమోనమో**
**భవనాశితీర యహోబిలనారసింహా**

**సతత ప్రతాప రౌద్రజ్వాలా నారసింహా**
**వితత విదారణా వీరనరసింహా**
**అతిశయ కరుణ యోగానంద నారసింహా**
**మతి శాంతపు కానుగుమాను నరసింహా॥**

**మరలి బీభత్సపు మట్టెమళ్ళ నరసింహా**
**నరహరి భార్గోటి నారసింహా**
**పరిపూర్ణ శృంగార ప్రహ్లాద నరసింహా**
**సిరుల నద్భుతపు లక్ష్మీనరసింహా॥**



**వదన భయానకపు వరాహ నరసింహా**
**చెదరని వైభవాల శ్రీనరసింహా**
**అదన శ్రీవేంకటేశ అందు నిందు నిరవైతి**
**పదివేల రూపముల బహునారసింహా ॥**

ఈ నవనారసింహులను కూడ శ్రీవేంకటేశ్వరునితో అభేదంగా చెప్పబడింది.

**ఎంచి చూచితే నితని కెవ్వ రెదురు**
**కొంచఁ దేమిటికి వీఁడిగో నారసింహుడు**

అని అహోబలేశ్వరుణ్ణి గూర్చి చెప్తూతూ

**కదిసి శ్రీసతిఁ గూడి గద్దెమీఁద గూచుండి**
**యెదుఁట బ్రహ్లాదుఁడు చేయెత్తి మొక్కగా**
**అదన శ్రీవేంటాద్రి నందరికి వరాలిచ్చి**
**సదరమైనాడు వీఁడె శాంత నరసింహుడు**

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామిని "శాంత నరసింహస్వామి"గా వర్ణించాడు. అంటే శ్రీవేంకటేశ్వరస్వామిని పదవ నరసింహస్వామిగా భావించినాడు, అన్నమయ్య. అంటే అన్నమాచార్యులు అహోబలేశునిలో తిరుమలేశుని, తిరుమలేశునిలో అహోబలేశుని దర్శించి ఉపాసించినాడని స్పష్టమవుతున్నది.

**"అగరాజం బీ యౌభళము**
**అగణిత తీర్థం బౌభళము**
**తగు శ్రీవేంకట ధామ విహారం**
**బగు శుభాంచితం బౌభళము"**

**("శ్రీనృసింహప్రియ" (అహోబిలం) పత్రికలో ప్రచురితం)**

# 11. శ్రీరంగనాథుడు – తాళ్లపాక కవులు

**"కలఁడా ఇంతటి దాత కమల నాథుఁడె కాక**
**కలఁడన్న వారి పాల కలిగిన దైవము"**

అని ప్రతి నిత్యం ఎలుగెత్తి చాటుతూ కోనేటిరాయని అంతరంగ భక్తుడై ఆనందనిలయుని అనుగ్రహాన్ని సంపూర్తిగా, సకుటుంబంగ పొందినవాడు తాళ్లపాక అన్నమాచార్యులు. ఆ కొండల కోనేటిరాయని కొండంత దయను తామే కాక సర్వ ప్రజలు పొందాలి అదే అన్నమయ్య ఉద్దేశం.

అందుకే ప్రజల్లో తిరు వేంకటానాథుని భక్తిని గూర్చి ప్రచారం చెయ్యాలని ఇంటిల్లి పాదితో దీక్ష వహించి, ఏడుకొండలను దిగినాడు అన్నమయ్య. కనపడ్డ ఊరూ, వాడా, పేటా, కోటా గుడీ గోపురమూ తిరిగాడు. ఎన్నో క్షేత్రాలు చూచాడు. ఆ యా స్థలాల్లో కొలువై వున్న ఓ కృష్ణుడు... ఓ రాముడు... ఓ చెన్నుడు... ఓ నరహరి ఇలా ఎవరైనా కావచ్చు. ఆ దేవుళ్లందరినీ "తిరుమల పెరుమాళ్లు"తో అభిన్నంగా వర్ణించాడు. ఇలాగ తాళ్లపాక కవులు తిరువేంకటగిరి దేవునితో అభేదాన్ని ఆవిష్కరించిన వేల్పులలో 'శ్రీరంగనాథ పెరుమాళ్లు' కూడ వున్నాడు.

ఆ కాలంలో తాళ్లపాకకవుల విష్ణుభక్తి తత్పరతకూ వైష్ణవమత ప్రచారానికి, తిరుమల తరువాత అహోబిలం, శ్రీరంగక్షేత్రాలను ప్రధాన కేంద్రాలుగా చేసుకున్నారు. కనుకనే అహోబిలంలోనూ, శ్రీరంగంలో నూ తాళ్లపాకవారి కీర్తనలు చెక్కిన రాగి రేకులు దొరికాయి. వీటిలో కొన్నింటిని తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రచురించారుకూడ. దీనిని బట్టి తాళ్ళపాకవారు కావేటి రంగణ్ని పలుమార్లు దర్శించినారని, శ్రీరంగంలో కొంతకాలం ఉన్నారని చెప్పవచ్చు.

ఒకమారు శ్రీరంగనాయకులను దర్శిస్తున్న అన్నమయ్యకు తిరుమలలోని శ్రీవేంకటేశ్వరుడే అక్కడ శేషశాయిగా దర్శనమిస్తున్నట్లు





గోచరించింది. మళ్లీ అంతలోనే ఆ ఫణిశయనుడు "చిన్న శిశువు"గా మారి "మఱ్ఱాకు తొట్టి"లో ఊగుతున్నట్లుగా పొడ సూపి, అన్నమయ్యతో ఇలా "లాలి" పాట పాడించుకున్నాడు.

**ఆహిరి**

**తొల్లియును మఱ్ఱాకు తొట్టెలనె వూఁగెఁగన**
**చెల్లుబడి నూఁగీని శ్రీరంగ శిశువు ॥**

**కలికి కావేరి తరఁగల బాహులతలనే**
**తలఁగ కిటు రంగ మధ్యపు తొట్టెలను**
**పలుమారుఁ దను నూఁచి పాడఁగా నూఁగీని**
**చిలుపాల సెలవితో శ్రీరంగ శిశువు ॥**

**అదివొ కమలజుని తిరువారాధ నంబనఁగ**
**అదన గమలభవాండ మను తొట్టెలను**
**ఉదధులు తరంగముల నూఁచఁగా నూఁగీని**
**చెదరని సిరుల తోడ శ్రీరంగ శిశువు ॥**

**వేదములే చేరులై వెలయంగ శేషుఁడే**
**పాదుకొను తొట్టెలై పరగఁగాను**

**శ్రీదేవితోఁ గూడి శ్రీవేంకటేశుఁడై**
**సేదదేరెడివాఁడె శ్రీరంగ శిశువు ॥**

కావేరీ నదీమతల్లి తన అలలచే పాడుతూ పాయలచే ఊపుతుండగా శ్రీరంగశిశువు ఊగేని. కమల భవాండమను తొట్టిని సముద్రతరంగా లూచగా చెదరని సిరులతో ఊగుతున్న శ్రీరంగ శిశువును దర్శించండి! నాలుగు వేదాలు గొలుసులుగా, శేషుడే తొట్టిగా, వెల్గొందగా శ్రీదేవితో గూడిన వేంకటేశుడే శ్రీరంగ శిశువుగా సేదదేరుతున్నాడని - అన్నమయ్య లాలిపాడుతూ శ్రీరంగ శిశువును ఊపినాడు.

అన్నమయ్య పుత్రుడు పెదతిరుమలాచార్యులు కూడ శ్రీరంగేశుడు శ్రీ వేంకటేశుడు ఒక్కరే అని అంటూ ఇరువురికీ అభేదం చెప్పాడు చూడండి.

**బ్రహ్మ పూజించే రఘుపతి విభీషణు కిచ్చె.**
**బ్రహ్మణ్యుఁడీ రంగపతిఁ గొలువరో.**

**కావేరి మధ్య రంగ క్షేత్రమల్లదిగో**
**శ్రీవిమాన మదిగో శేషపర్యంక మిదె**
**దేవుఁడల్లదె వాఁడే దేవి శ్రీలక్ష్మి యదె**
**సేవించరో నాభిఁ జిగురించే నతఁడూ ॥**

**యేడు గోడలు నవిగో యెసంగు పూఁదోఁపులవె**
**కూడి దామోదరపుర గోపురమదె**
**తోడ వేయిగంబాల దొడ్డ మంటప మదిగో**
**చూడరో పసిఁడి మించుల కంబమదిగో ॥**

**ఆళువారలు వారే యంగరంగ విభవమదే**
**వాలు శ్రీవైష్ణవపువాడ లవిగో**
**ఆలీల శ్రీవేంకటేశుఁడై వరమిచ్చీని**
**తాలిముల శ్రీరంగదైవముఁ గొలువరో ॥**



అదిగో; దర్శించండి! కావేరీనది మధ్యరంగక్షేత్రం... ఆ క్షేత్రంలోని శ్రీవిమానం ఆ విమానంలోని శేషపాన్పు... ఆ శేషపర్యంకంలో శ్రీదేవితో నున్న దేవుడు... అదిగో... ఆ దేవుని నాభిలో చిగురించిన పద్మం... కన్నులారా తిలకించండి.

అదిగో! ఆలయం సప్తప్రాకారాలు... పూదోటలు... అదే! తూర్పుద్వారం... దామోదరగోపురం... వేయిస్తంభాల మండపం... అదిగో! బంగారు కాంతులతో మిరుమిట్లు గొలుపుతున్న స్తంభం.

వారే! శ్రీరంగణ్ని అంగరంగ వైభవంగా కీర్తించిన పన్నిద్దరాళ్వారులు! దర్శించండి! అదిగో! అటువైపు శ్రీవారి అర్చకాదిస్వాములు నివసించే వైష్ణవ వాడలు! శ్రీవేంకటేశుడే ఆ రీతిగా దర్శన మిచ్చి వరాలిస్తున్న శ్రీరంగ దైవాన్ని కొలవండి!

అని పెద తిరుమలయ్య పై కీర్తనలో మొదట శ్రీరంగక్షేత్రాన్ని తదుపరి ఆ క్షేత్రంలోని శ్రీరంగ విమానాన్ని, ఆ విమానంలో వేంచేసి వున్న శ్రీరంగ నాథుణ్ని. శ్రీరంగనాయకుని సప్తప్రాకారాలలో వున్న వైష్ణవ వాడలను ఆళువారలను... ఇలాగ వరుసగా చలన చిత్రంలోని దృశ్యాలవలె మన కన్నులకు కట్టినట్లు వర్ణించాడు.

ఇక అన్నమయ్య మనుమడూ, పెద తిరుమలయ్య పుత్రుడూ అయిన తిరువేంగళనాథుడు (చిన్నన్న) కూడ **"పరమయోగి విలాసం"** అను ద్విపద కావ్యంలో విష్ణుచిత్తుడు తన కూతురు గోదాదేవికి శ్రీరంగనాథుణ్ని గూర్చి చెపుతున్న సందర్భంలో

**"మానుగా నలమేలుమంగా విభుండు**
**తానయై శ్రీరంగధామంబు నందు**
**నజునకుఁ బ్రత్యక్షమైనట్టివాఁడు**
**భుజగ పుంగవ తల్పమునఁబవ్వళించి**

**వెలుగొందు చుండుఁ గావేరి నెన్నడుమ**
**సలలిత చంద్రపుష్కరిణి చెంగటను॥**

అని కోనేటి శ్రీవేంకటవిభుఁడే చంద్రపుష్కరిణీ తటాన శ్రీరంగేశునిగా వెలసినాడని వర్ణించాడు.

అదే కావ్యంలో, మరోచోట భగవద్రామానుజులు వేంకటాచలపతిని సందర్శించిన సందర్భంలో

**చల్లని చూపును జారువాసికయు**
**దెల్లని మెరుగు ముత్తియపు నామమును**
**గలిగి యెంతయును శృంగార భావంబు**
**మలయు నియ్యలమేలుమంగామనోజ్ఞు**
**సేవించి ప్రణమిల్లి చేరి సన్నుతులు**
**గావించి పులకిత గాత్రుఁడై చెలఁగి**
**శ్రీరంగమున నున్న శేష పర్యంకు**
**డీ రూపమున వచ్చి యిట బొడసూపె**
**బరతత్త్వ మీతండె పరయోగిహృదయ**
**పరిపూర్ణుఁడితఁడె శ్రీపతియును నితఁడె ॥**

శ్రీరంగనాయకులే, తిరుమలలో అలమేలుమంగా విభునిగా దర్శనమిస్తున్నాడని ఇరువురినీ అభిన్నులుగా వర్ణించాడు చిన్నన్న.

ఇలాగ శ్రీవేంకటేశునిలో శ్రీరంగేశుని, శ్రీరంగేశునిలో తిరువేంకట విభుని దర్శించిన పుణ్యపురుషులు తాళ్ళపాకవారు. కనుకనే ఒకచోట తాళ్ళపాక అన్నమాచార్యులు.

**"ఎవ్వరి గొలిచిన, నేమిగొరత, మరి**
**ఎవ్వరి దలచిన నేమి**



**అవ్వలివ్వల శ్రీహరి రూపుగాని వా-**
**రెవ్వరు లేరని యెరుక దోచిన జాలు ॥**

అని అంటాడు.

కుటుంబ సమేతంగా సారస్వతయజ్ఞాన్ని నిర్విఘ్నంగా కొనసాగిస్తూ, మహోన్నత క్షేత్రాల నుండి మారుమూల పల్లెలదాకా ఆ బాల గోపాలంలో వైష్ణవ భక్తి సాహిత్యాన్ని, ముఖ్యంగా శ్రీవేంకటేశ్వర భక్తిని ప్రచారం చేసిన భక్తి చైతన్య మూర్తులు తాళ్ళపాకవారు.

**గరుడ తురంగా కారోత్తుంగా**
**శరధి భంగ ఫణిశయనాంగా**
**కరుణాపాంగా కమలాసంగా**
**వర శ్రీవేంకటగిరి పతిరంగా ॥**

**("శ్రీనృసింహప్రియ" (అహోబిలం) పత్రికలో ప్రచురితం)**

# 12. మొక్కుబళ్ల దేవుడు తిరుమల వెంకన్న

**'శేషాచలే యన్మాహాత్మ్య మన్యక్షేత్రే న తత్ క్వచిత్,**
**తద్గత శ్రీనివాసస్య మహిమా నాన్యగః శుభః'**

కలియుగంలో భూలోకవైకుంఠమని ప్రసిద్ధనామంతో పిలువబడుతున్న వేంకటాచల క్షేత్రంపైన కొలువున్న శ్రీనివాస ప్రభువు సాటిలేని దేవుడు, మేటి అయిన దేవుడు.

'పుర్రెకో బుద్ధి, జిహ్వాకోరుచి'-అన్నట్లు ఎన్నెన్ని పుర్రెలున్నా వాటి ఆలోచనలు మరెన్ని వున్నా, ఆ ఆలోచనలకు తగ్గట్లు ఎన్నెన్నో అభిరుచులున్నా ఆ అన్నింటి ఆలోచనలకూ అభిరుచులకు అనువైన దేవుడు తిరుమల వెంకన్న. కనుకనే తాళ్ళపాక అన్నమాచార్యులు స్వామిని గూర్చి

'ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచి చూడ బిండంతె నిప్పటి యన్నట్లు'

అని కీర్తించాడు. శ్రీవేంకటేశ్వరుని అసలు తత్త్వం ఏమిటో, ఆయన అసలు పేరు ఏమిటో తెలియకపోయినా భక్తకోటి, ఆ దేవుడు నిలిచిన దివ్యస్థలాన్ని బట్టి 'ఏడుకొండలవాడ'నీ పాపాల్ని పోగొట్టే కార్యాన్నిబట్టి 'వేంకటపతి' అనీ, తన వక్షఃస్థలంమీద కొలువై ఉన్న శ్రీమహాలక్ష్మి పేరును బట్టి 'శ్రీనివాసు'డనీ... ఇలా తనకు నచ్చిన పేర్లతో పిలుస్తున్నారు. అంతేగాదు స్వామివారి అనుగ్రహం చేత తమకు కలిగిన సంతానానికి కూడా ఆ పేర్లను పెట్టుకొని భక్తిగా మొక్కులు చెల్లించుకుంటున్నారు. తిరుమలస్వామివారు కూడ తన భక్తులు ఆచార వ్యవహారాలు వేర్వేరు అయినా, వారి భాష ఒక్కటి కాకపోయినా, వారు మొక్కులను వింత వింతలుగా చెల్లించినా, వాటి నన్నింటిని స్వీకరించి వారు కోరిన కోరికలను తీరుస్తున్నాడు. అసలు మొక్కుబళ్ల మిషతోనే భక్తులను తన దగ్గరకు రప్పించుకుంటాడట స్వామి. అందువల్లే తిరుమలేశుడు 'మొక్కుబళ్ల దేవుడి'గా 'ఆపదమొక్కులవాడి'గా ప్రసిద్ధికెక్కినాడు.



### తలనీలాల మొక్కు

తిరుమల క్షేత్రానికి చేరుకున్న భక్తులు, యాత్రికులు శ్రీవేంకటేశ్వరస్వామివారిని దర్శించటానికి ముందుగా, తొలిగా సమర్పించే అత్యంత ప్రధానమైన మొక్కు "తలనీలాలు" సమర్పణ.

ఈ పుణ్యక్షేత్రంలో తలవెంట్రుకలను స్త్రీ పురుషులు తేడా లేకుండా మొక్కులుగా సమర్పించట మనే సంప్రదాయం ఎప్పటినుంచి వస్తున్నదో, ఏనాటి నుంచి కొనసాగుతున్నదో ఇదమిత్థంగా తెలియకపోయినా, 19వ శతాబ్దం నాటికే ఈ మొక్కు విస్తృతప్రచారంలో వుందని స్పష్టమవుతున్నది.

అహరహం ఆర్తిగా ఆర్ద్రంగా ఆనందంగా తనను చేరుతున్న భక్తుల తల చిక్కులను (తల నీలాలను) స్వీకరిస్తూ ఆ భక్తుల యొక్క చిక్కులన్నింటిని తీరుస్తూవున్న శ్రీనివాసుడు నిజంగా భక్తులపాలిటి ఆపద్బాంధవుడేకదా!

**సేవలు-ఉత్సవాలు**

తిరుమల క్షేత్రంలో ప్రతిరోజూ పండుగే. ప్రతిపూటా పరమాన్నాలే. పాయసాలే. ఉత్సవప్రియుడైన స్వామివారు తనకు ఉత్సవాలు-సేవలు చేయించినా, లేదా వాటిలో పాల్గొని దర్శించినా వారికి కల్యాణ పరంపరలు గుప్పించడమే ఆ స్వామివారి లక్ష్యం. తమ ఇంట్లో శుభకార్యం జరిగితేనో, ఇల్లు కట్టుకుంటేనో, సంతానం కలిగితేనో స్వామివారికి కల్యాణోత్సవం చేయిస్తామని మొక్కుకోవడం భక్తులకు సర్వసాధారణం.

వేంకటాచలక్షేత్రంలో శ్రీనివాసుడు వెలసిన తొలినాళ్లలోనే బ్రహ్మదేవుడు, లోకకల్యాణకారకంగా తన సృష్టికార్యం సక్రమంగా కొనసాగేటట్లు అనుగ్రహించినందువల్ల తిరుమలప్పకు తిరునాళ్లు జరుపుతానని మొక్కుకొని ఉత్సవాలు చేయించాడట. బ్రహ్మదేవుడు చేసిన ఉత్సవాలు కాబట్టి బ్రహ్మోత్సవాలుగా ప్రసిద్ధి కెక్కి, అవి నేటికీ నిర్విఘ్నంగా జరుగుతున్నాయి.

ఆ తర్వాత కాలాంతరంలో ఎందరో చక్రవర్తులు, రాజులు శ్రీనివాసుడనుగ్రహించిన తమ విజయ పరంపరలకు కృతజ్ఞతా పూర్వకమైన భక్తితో తిరుమల వెంకన్నకు బ్రహ్మోత్సవాలు చేశారు.

పల్లవరాణి సామవై 'మనవాళ పెరుమాళ్' అనే వెండి శ్రీనివాసుని విగ్రహాన్ని తిరుమల ఆలయానికి మొక్కుగా సమర్పించింది. ఈ విగ్రహమే ప్రతిరోజు రాత్రి, ఏకాంతసేవలో పవ్వళింపు సేవను పొందుతూ 'భోగశ్రీనివాసమూర్తి'గా ప్రసిద్ధికెక్కింది.

క్రీ.శ. 1254లో తెలుగు పల్లవరాజు విజయగండగోపాలదేవుడు, 1328లో త్రిభువనచక్రవర్తి తిరువేంకట నాథయాదవరాయలు, 1446 హరిహరరాయలు, 1530లో అచ్యుతరాయలు... ఇలా ఎందరో రాజులు ఆ యా కాలల్లో బ్రహ్మోత్సవాలను చేయించారు. పిదప పుష్పయాగోత్సవం, పవిత్రోత్సవాలు... వంటి అనేక ఉత్సవాలు కూడ తిరుమలలో నిర్వహింపబడినాయి.



**పువ్వుల సమర్పణ**

శ్రీ వేంకటేశ్వరస్వామి పుష్పాలంకార ప్రియుడు. శ్రీనివాసుని పుష్పప్రియత్వాన్ని దృష్టిలో ఉంచుకొని ఇటీవలి కాలంలో బ్రహ్మోత్సవాలు, వైకుంఠ ఏకాదశి, ఉగాది వంటి విశేషపర్వదినాల్లో భక్తులు మొక్కుకొని భక్తిగా పుష్పసమర్పణ చేసుకొంటున్నారు. చాల పూర్వం నుంచీ కూడ తిరుమలలో ఆ యా భక్తులచేత వెలసిన అనగా, ఆనందాళ్వారుతోట, తాళ్లపాకం, తరిగొండవారి తోటలు, పెరుందేవి తోట... ఇలా తిరుమలేశుని పుష్పకైంకర్యసేవకుగాను సమర్పింపబడి పాలుపంచుకొంటున్నాయి.

తొండమాను చక్రవర్తి బంగారు పువ్వులతో మాత్రమే ప్రతిరోజు శ్రీనివాసుని అర్చించేవాడట. ఈ బంగారు పూలను కాదని, సామాన్యపామర భక్తుడైన కుమ్మరనంబి సమర్పించిన కేవలం మట్టిపూలకోసం అర్రులు చాచేవాడట ఆనందనిలయుడు. ఇదెంత విచిత్రం!

1984లో హైదరాబాద్ నివాసి అయిన ఒక మహమ్మదీయ భక్తుడు మొక్కుగా సమర్పించిన 108 బంగారు కమలాలతో శ్రీస్వామివారు ప్రతిమంగళవారం 'అష్టదళపాద పద్మారాధన' సేవను ఘనంగా నిర్వహింపజేసుకుంటున్నాడు. ఇక ప్రతి గురువారం రాత్రి పూలంగి సేవలో దర్శనమిస్తూ, తన పుష్పప్రియత్వాన్ని చాటుకొంటూ భక్తులను పులకింపజేయడం అనిర్వచనీయం!

**ఆభరణాల సమర్పణ**

ఆనంద నిలయునకు వున్న ఆభరణాలు, అలంకారాలు ఒక ప్రత్యేక ఆకర్షణతో ఆనందాన్ని కలిగిస్తాయి. ఆ స్వామివారికి పాదాదిగా శిరసాంతం వరకు గల దివ్యాభరణాలు, మణిహారాలు చూపరులకు ఆశ్చర్యపరవశులను

గావిస్తూ అద్భుత లోకంలో విహరింపజేస్తాయి. ఆ స్వామి ధరించిన వజ్రాలు వైడూర్యాలు జిగేలుమంటూ మిరుమిట్లు గొలుపుతాయి.

**చూడ జూడ మాణిక్యాలు చుక్కలవలె నున్నవి.**
**యీడులేని కన్నులవె యిన చంద్రులు**
**కంటి గంటి వాడె వాడె ఘన ముత్యాల**
**కంటమాల లవె పదకములు నవె**
**మింటి పొడవైనట్టి మించు కిరీటం బదె**
**జంటల వెలుగు శంఖ చక్రాలవె...**

ఇలా నిలువెత్తుగా స్వామి అలంకరించుకొన్న ఆభరణాలను నగలను వర్ణిస్తాడు అన్నమాచార్యులు.

ఎందరో రాజ్యాధినేతలు, రాజులు, రాణులు, సామంతులు, సామాన్యభక్తులు, తమ స్థాయిలకు తగినట్లుగా శ్రీస్వామివారికి నగలూ, ఆభరణాలను మొక్కులుగా సమర్పించుకున్నారు.

శ్రీకృష్ణదేవరాయలు 1513 నుంచి 1521 వరకు ఏడుమార్లు తిరుమలయాత్ర చెయ్యడమేగాక, స్వామి అనుగ్రహించిన విజయపరంపరలకు గుర్తుగా ఒక నవరత్నఖచిత కిరీటాన్ని, 25 వెండి పళ్లాలను, అమూల్యమైన వజ్రాభరణాలను, ఉత్సవమూర్తులకు మణిమయ కిరీటాలను రత్నాలు పొదిగిన బంగారు మకరతోరణాన్ని కానుకలుగా సమర్పించాడు. అంతమాత్రమేగాక 1518 సెప్టెంబరు 9వ తేదీన 30 వేల వరహాలతో ఆనందనిలయ విమానానికి బంగారు మలాము చేయించాడు. ఆ తర్వాత అచ్యుతరాయలు, వెంకటపతిరాయలు.. తిరుమలేశునికి ఎన్నో నగలను కానుకలను సమర్పించాడు. నేటికీ, ఇప్పటికీ ఎందరో భక్తవరేణ్యులు ప్రతినిత్యం కిరీటాలను మణిమయహారాలను శ్రీవారికి మొక్కులుగా సమర్పించుకుంటూనే వున్నారు.



**నివేదనలు**

శ్రీనివాసుడు ఎంతటి అలంకార ప్రియుడో అంతటి నైవేద్యప్రియుడు. ఎంతటి నైవేద్యప్రియుడో అంతటి భక్తప్రియుడు. అందుకే తాను ఏరి కోరి ఆరగించే రుచికరములైన వంటకాలన్నింటిని భక్తులు తింటేనే ఆయనకు ఆనందం! తాను తిన్నవన్నీ భక్తులు రుచి చూస్తేనే ఆ స్వామికి ఒక తృప్తి! అసలు భక్తులకు తినిపించడానికి శ్రీవేంకటేశ్వరుడు మంచి మంచి కమ్మనైన ప్రసాదాలను ఆరగిస్తాడట! ప్రపంచంలో ఈ స్వామిని మించిన నైవేద్య ప్రియుడు, భోజనప్రియుడు మరొకడు కన్పించడు.

**"పాలు వెన్న బకాలబాతు దధ్యోదనం**
**బువుళి యోరెము వెన్నబూరియలును**
**సరడాలపాశముల్ చక్కెరపులగముల్**
**నువ్వుమండిగలు, మనోహరములు**
**అప్పము లిడ్డెన లతిరసముల్ హోళిగల్**
**వడలు, దోసెలు గల వంటకములు**
**శాకముల్ సూపముల్ చారు లంబళ్లు**
**శుద్ధోదనములును సద్యోఘృతమ్ము**
**పండ్లు తేనెలు హొబ్బట్లు పచ్చడులును"**

అని ఇలాగ ఆనందనిలయుడు ఆరగించే వంటకాలను ఒక అజ్ఞాతకవి ఏకరువు పెట్టారు. కాని ఇవి కొన్ని మాత్రమే. తెనాలిరామకృష్ణకవి తిరుమలేశుడు ఆరగించేవాటిని ఏకరువుపెట్టలేక ఆ స్వామికి 'తిండిమెండయ్య గారు' అని ఒక పెద్ద బిరుదునే తగిలించాడు. చాల పూర్వం నుంచీ శ్రీనివాసుని నైవేద్యప్రియత్వాన్ని దృష్టిలో పెట్టుకొని ఎందరో రాజులు మొదలుకొని సామాన్యులవరకు దానాలు, భూరివిరాళాలను మొక్కులుగా సమర్పించారు. 1515లో శ్రీకృష్ణదేవరాయలు, 1545లో

పెదతిరుమలాచార్యులు... బ్రిటీషుపాలనలో సర్‌థామస్‌మన్రో కూడా శ్రీస్వామివారికి నివేదనలు సమర్పించినారు. ఈ నాటికీ ఎందరోభక్తులు తిరుమలేశునికి నైవేద్యాలుగా లడ్డు, వడలు, చక్కెర పొంగలి, సీరా, పులిహోరా, పొంగలి మున్నగు ప్రసాదాలను సమర్పించడం అందరికీ తెలిసిన విషయం.

**వాహనాల సమర్పణ**

తిరుమలేశునికి ఏడాది పొడవునా ప్రతిరోజూ జరుపబడే ఉత్సవాల్లో ఊరేగింపుల్లో ముందుభాగాన బారులుగా నడిచే గజ, తురగ, వృషభాలను కూడా కానుకలుగా సమర్పించడం కూడా కద్దు. నాడు మైసూరు మహారాజులు, నేడు కర్నాటక ప్రభుత్వం ఏనుగులను శ్రీవారికి కానుకలుగా సమర్పిస్తున్నది. ఇవేగాక ఆ యా కంపెనీలు తమ మొదటి ఉత్పత్తులైన లారీలు, కార్లు, స్కూటర్లు మున్నగు ఆధునిక వాహనాలను ఏడుకొండలవాడికి మొక్కులుగా సమర్పిస్తున్నాయి.

ఇలాగ తిరుమలేశునికి ఏ కానుక పెట్టినా, ఏ సేవచేసినా, ఏ విరాళమిచ్చినా దాని వెనుక ప్రధానధ్యేయం “మొక్కు” చెల్లించడమే. అందులకే ప్రతినిత్యం భక్తులు నేలనాలుగు చెరగులనుండి తిరుమల యాత్రను చేసి తమ తమ మొక్కులు చెల్లిస్తారు. పిల్లలు, పెద్దలు, స్త్రీలు పురుషులు, కుంటి, గుడ్డి... ఇలా వారు వీరు అనకుండా కుల, మత, భాష వర్గ వర్ణ భేదరహితంగా దేవతా సార్వభౌముడైన వేంకటేశ్వరస్వామివారిని దర్శించడానికి తిరుమలకు పరుగులు పెడ్తారు. మొక్కుబళ్లలో భాగంగా పాదయాత్రల్ని చేస్తారు. జోగి ఎత్తుకొంటూ వస్తారు. నిలువుదోపిళ్లిస్తారు. ముడుపులు సమర్పిస్తారు. తులాభారాలిస్తారు. తలనీలాలిస్తారు. మూడు కత్తెర లిస్తారు. ఆలయ ప్రదక్షిణల్ని, అంగప్రదక్షిణల్ని చేస్తారు. అఖండ దీపారాధనలను వెలిగిస్తారు. కొబ్బరికాయలను కొడ్తారు. చలిపిండ్ల నైవేద్యమిస్తారు. ఉత్సవాలు ఊరేగింపులు చేయిస్తారు. పులిహోరలు, పొంగళ్లు నివేదిస్తారు. సంతానం కలిగినవారు వెండి ఊయళ్లను సమర్పించుకొంటారు. ఇంకా ఉంగరాలు, గాజులు, కడియాలు, హారాలు... ఇలా ఎన్నో ఎన్నెన్నో వస్తువులను అత్యంత భక్తిప్రపత్తులతో భక్తులు మొక్కులుగా సమర్పించు కొంటారు.



**‘వైకుంఠం వా పరిత్యక్ష్యే న భక్తాంస్త్యక్తు ముత్సహే**
**మేతి ప్రియా హి మద్భక్తా ఇతి సంకల్పవానసి”**

“నేను వైకుంఠాన్నయినా విడిచి వుంటానుగాని నా భక్తులను ఒక క్షణమయినా విడిచి వుండలే” నన్న దృఢదీక్షతో భూలోకానికి దిగివచ్చిన ఈ మొక్కుబళ్లదేవుడు తిరుమలక్షేత్రంలో వేంచేసి భక్తులకోసం ఎదురు చూస్తున్నంతవరకూ

**“వేడుకొందామా వేంకటగిరి వేంకటేశ్వరుని**
**ఆమటి మొక్కులవాడే ఆది దేవుడే వాడు”**

అని వేడుకొంటూ, నిరంతరం నిరంతరాయంగా భక్తులు తిరుమలకు వస్తూనే వుంటారు. ఆ మొక్కుబళ్ళ దేవుడికి తమ మొక్కుబళ్లను చెల్లిస్తూనే వుంటారు.

**(“శ్రీ వేంకటేశ్వర వైభవం” తి.తి.దేవస్థానం ప్రత్యేకసంచికలో ప్రచురితం)**

# 13. శ్రీకృష్ణ జయంతి - అన్నమాచార్యులు

మత్స్యః కూర్మో వరాహశ్చ
నారసింహోऽథ వామనః
రామో రామశ్చ కృష్ణశ్చ
బుద్ధః కల్కిరేవ చ

అని వరుసగా శ్లోకరూపంలో చెప్పబడ్డ దశావతారాల్లో కొందరు కృష్ణావతారానికి బదులుగా బలరామావతారాన్ని చెప్పారు. అసలు 'శ్రీకృష్ణుడు' అవతారం కాదు. సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమే, సాక్షాతు భగవంతుడే ఆయన అని మరి కొందరి పెద్దలమాట. బలరామ కృష్ణుల్లో ఏ ఒక్కరిని స్వీకరించినా ఇరువురను స్వీకరించినట్లే అని కూడ చెప్పడం కద్దు.

ముఖ్యంగా శ్రీ కృష్ణావతారం, శ్రీ కృష్ణలీలలు, శ్రీ కృష్ణపాత్ర... ఇత్యాదిగా మన భారతీయ వాఙ్మయంలో అనేకచోట్ల అనేక గ్రంథాల్లో వర్ణింపబడినాయి. గీతగోవిందంలో జయదేవుడు, శ్రీకృష్ణలీలాతరంగిణిలో నారాయణ తీర్థులూ, శ్రీకృష్ణ కర్ణామృతంలో లీలాశకుడూ... ఇలాగ ఎందరో మహాకవులు శ్రీకృష్ణుని సుసంపన్నంగా తనివిదీర వర్ణించి మహాభక్తులుగా కూడ ప్రసిద్ధి పొందారు.

ప్రధానంగా ఆంధ్రసాహిత్యంలో, జానపదవాఙ్మయంలో, శతక వాఙ్మయంలో, హరివంశ భాగవతాదిమహాకావ్యాల్లోను, అనేక యక్షగానాల్లోను ఈ శ్రీకృష్ణపాత్ర కడు మనోజ్ఞంగా వర్ణింపబడింది.

పదకవితాపితామహుడు, హరియవతారం అయిన తాళ్ళపాక అన్నమాచార్యులు తన పదసాహిత్యంలో శ్రీకృష్ణుని యవతారాన్ని, శ్రీకృష్ణ లీలలను శ్రీకృష్ణావతార తత్త్వాన్ని ఎలా వివరించాడో ఇంచుక పరిశీలించుటే ఈ వ్యాసోద్దేశం.





**రామక్రియ**

ఎక్కడి కంసుఁడు యిఁక నెక్కడి భూభారము
చిక్కువాప జనియించె శ్రీకృష్ణుఁడు

అదివో చంద్రోదయ మదివో రోహిణి పొద్దు
అదన శ్రీకృష్ణుఁ డందె నవతారము
గదయు శంఖచక్రాలు గల నాలుగుచేతుల
నెదిరించి యున్నాఁడు ఇదివో బాలుఁడు

వసుదేవుఁ డల్లవాఁడే వరుస దేవకి యదె
కొసరే బ్రహాదులు కొండాట మదె
పొసఁగ బొత్తుల మీఁదఁ బురుటింటి లోపల
సిసువై మహిమ చూపె శ్రీకృష్ణుడు

పరంజ్యోతి రూపమిదె పాండవుల బ్రదికించె
అది కౌరవుల సంహారమూ నిదె

**హరి కర్యము లీరో జయంతి పండుగ సేయరో**
**కెరలి శ్రీవేంకటాద్రి కృష్ణుఁడితఁడు**

అది ద్వాపరయుగం వేలకొలది రాక్షసులు రాజవంశంలో జన్మించి లోకకంటకులై మిగుల భూభారం కల్గించినందువల్ల భూదేవి బ్రహ్మాది దేవతలతో కూడి తన భారం తగ్గింప వలసిందని శేషశాయి అయిన మహావిష్ణువును ప్రార్థించింది. అందుకుగా శ్రీకృష్ణుడవతరించెను. శ్రీ కృష్ణావతారం వలన ఇక కంసుడెక్కడ నుండ గలడు? కంసుడంతరించినట్లే. భూభారం తొలిగినటులే అని భావం.

భగవాను డవతరించు సమయ మదిగో! చంద్రుడూ ఉదయించు చున్నాడు! కారు చీకట్లు నిండిన రాత్రిసమయంలో ఆ చీకట్లను తొలగించుచు చంద్రుడుదయించుచున్నాడు. అది రోహిణీ నక్షత్రపుపొద్దు. అప్పుడు శంఖం, చక్రం గద ధరించి ఒకచేత అభయ మిచ్చుచూ ఇదిగో బాలకృష్ణుడు అవతరించినాడు. చంద్రుడు ఉదయంచుటవల్ల చీకట్లు తొలగినట్లుగానే శ్రీకృష్ణుని ఉదయం వల్ల భూభారం తొలగునని అన్నమయ్య భావం.

ఆ బాలుని సమీపంలో అదివో వసుదేవుడు నమ్రతతో నిలిచియున్నాడు. ప్రక్కన వసుదేవుని వరుసనే దేవకీదేవి. అదిగో ఆ వైపునబ్రహ్మాది దేవతలు ఆనందంతో ఆటపాటల శ్రీకృష్ణుని కొండాడుతూ వినోదించుచున్నారు. మరల అంతటిలోనే ఆ శంఖచక్ర గదాధారియైన కృష్ణుడు చిన్న శిశువుగామారి తన మహిమను చూపెను గదా!

చరాచరాల్లో అంతటికిని ఆధారమైన పరంజ్యోతి స్వరూపమిదియే. ఈ బాలకృష్ణుడే పాండునందనులను బ్రదికించినాడు. అదిగో ఆశ్చర్యం కౌరవ సంహారం కూడ చూడుడు. అట్టి శ్రీవారికి అర్ఘ్యం లియ్యరో! నేడే శ్రీకృష్ణజయంతి ఆ జయంతిని ఎంతో భక్తిగా ఆనందంగా చేయవలసినది. అదిగో ఆద్వాపరయుగం నాటి శ్రీకృష్ణుడే వేంకటాద్రి (తిరుమల)లో నిలిచి యున్నాడు.



అని అన్నమాచార్యులు శ్రీకృష్ణజయంతిని గూర్చి భక్తి పూర్వకంగా కీర్తించినాడు. ద్వాపరయుగంలో శ్రావణమాసం, బహుళ అష్టమినాడు రాత్రి రోహిణి ప్రొద్దున శ్రీకృష్ణజననం జరిగింది. మరి ఈ కలియుగంలో కూడ తాళ్ళపాక అన్నమయ్య కృష్ణావతారాన్ని ప్రత్యక్షంగా దర్శించినట్లు "అదిగో" చంద్రోదయం, రోహిణీ నక్షత్రం, చతుర్భుజుడు, శంఖచక్రగదాదుల ధరించినమూర్తి 'అదివో', వానిని చూచి ఆనందించిన దేవకీవసుదేవులు వారే! బ్రహ్మాదుల కొండాట 'మదె' పాండవులను బ్రదికించి అర్జునునకు చూపించన విశ్వరూపం 'అదె'. మహాభారత కురుక్షేత్ర సంగ్రామంలో కౌరవ సంహారం 'నిదె'. అని "అదిగో, అదె, నిదిగో, నిదె" అని చిన్న పదాలతో అలనాటి శ్రీకృష్ణ జననాన్ని శ్రీకృష్ణలీలలను, శ్రీకృష్ణవతారతత్త్వాన్ని తాను స్వయంగా దర్శించి, మీరు దర్శించండి అని అన్నమయ్య మనలను ప్రబోధిస్తున్నాడు.

ఎప్పటి ద్వాపరయుగం! ఎప్పటి శ్రీకృష్ణుడు!! మనకు గోచర మగునా? అని సందేహించ నవసరంలేదు. ఆ ద్వాపరయుగంలోని కృష్ణుడే, కంసుణ్ణి వధించిన కృష్ణుడే, పూతనా తృణావర్త శకటాసుర సంహారం, కాళీయ గర్వభంజనం, నరకాసురవధ, శిశుపాలవధ కావించి భూభారాన్ని తొలగించిననాటి శ్రీకృష్ణుడే కౌరవనాశనం చేసి పాండవుల బ్రదికించి పరంజ్యోతియైన శ్రీకృష్ణుడే నేడు వేంకటాద్రిపై శ్రీవేంకటేశ్వరునిగా నిలిచినాడు అని తాళ్లపాక అన్నమాచార్యులు ఉపదేశించినాడు. అనగా అన్నమయ్య తిరుమల శ్రీవేంకటేశ్వరునిలో సాక్షాత్తుగా అలనాటి ద్వాపరయుగంనాటి శ్రీకృష్ణావతార విశేషాలను దర్శించినాడు. అంతేకాదు ఈ ఒక సంకీర్తనతో భాగవత భారత విష్ణుపురాణాదులలో వర్ణింపబడిన శ్రీకృష్ణావతార తత్త్వాన్ని అంతయు మనకు దర్శింపజేసినాడు. ఇలాంటి శ్రీకృష్ణ జయంతిని, శ్రీకృష్ణ లీలలను, శ్రీకృష్ణుని చిలిపిపనులను వర్ణించే పాటలను అన్నమయ్య కోకొల్లలుగా భక్తితో పాడి పరమ గానాలుగా అందించినాడు.

## తిరుమల శ్రీవారి ఉట్ల ఉత్సవం

తిరుమలలో శ్రీవారికి శ్రీకృష్ణజయంతినాడు జరిగే ఉట్ల ఉత్సవాన్ని దర్శించి అన్నమయ్య అనేక కీర్తనల్లో కీర్తించినాడు. వానిలో మచ్చున కొకటి

ఉట్లు అనగానే ఉట్లమీది పాలు, వెన్నా, మీగడా వెను వెంటనే ఆ పాలను, వెన్నను దొంగిలించే వెన్నదొంగ చిన్నికృష్ణుడు జ్ఞాపకం వస్తాడు. అంటే అలనాటి ద్వాపర యుగంలో బాలకృష్ణుని చిలిపి పనులనూ ఉట్లుగొట్టి వెన్నలు దొంగలించడం వంటి లీలలను స్మరించుకుంటూ మళ్ళీ ఆనందంతో ఉట్లతో ఉత్సవం జరుపుకోవడమే ఉట్ల ఉత్సవమంటారు. పైగా ఎప్పుడంటే అప్పుడు ఈ ఉత్సవాన్ని చేయరు. శ్రీకృష్ణునికి సంబంధించిన ఉత్సవ కాబట్టి శ్రావణ మాసంలో శ్రీకృష్ణజయంతినాడే నిర్వహింపబడుతుంది. ఈ ఉట్ల పండుగ చాల పూర్వం నుంచీ తిరుమల శ్రీవేంకట ప్రభువునకు జరుపబడుతున్నట్లు మనకు ఎన్నో శాసనాధారాలున్నాయి. అలాగే వైభవోపేతంగా బరుగుచున్న శ్రీనివాసుడి ఉట్ల పండగ వేడుకలను తాళ్ళపాక అన్నమాచార్యులు అనేక కీర్తనలలో వర్ణించి, కీర్తించియున్నాడు.

**బౌళి**

**ఎటువంటి యాగడీఁడే యీ కృష్ణుఁడు**
**జోట జోటఁగారఁగానే జుట్టె మీఁగడలు॥**

**కొట్టెఁ గృష్ణుఁడు వాఁడె కోలలెత్తి వుట్లపై**
**దట్టముగ గొల్లెతలు దాఁచిన పాలు**
**చుట్టిన చక్కిలములు చొక్కపు నురుగులును**
**బెట్టిన కాఁగులతోనే పెంచులుగఁ జేసీనే॥**



**దొంతులు దించి దించి దొరకని కృష్ణుఁడు**
**బంతిఁ జక్కెర వెట్టి గోపాలుల కెల్ల**
**మంతనాన వద్దని మానుపఁ బోతేఁదాను**
**కొంత వారినోరఁ బెరుగులు చమరీనే॥**



**వీదులెల్ల దానె శ్రీవేంకటాద్రి కృష్ణుఁడు**
**ఆదిగొని మెసగీని యదుకులెల్ల**
**కాదని పెనఁగితేను కాఁగలించీ గొల్లెతల**
**సోదించి కుచము లంటి సొంపుగా గూడీనే॥**

పై పాటలో కృష్ణుని ఆగడపు పనులు వర్ణింపబడ్డాయి. ఉట్లను కోలలతో కొట్టి గొల్లెతలు దాచిన పాలు చక్కిలాలు నురుగులు కాగులతో కూడ పెంచులు పెంచులుగా పగుల కొట్టినాడట!

ఉట్లపై దొంతరలుగానున్న కుండలను దించి అందులోని చక్కెరలను గోపాలులకు పంచుతుండగా వద్దని వారించబోవువారి నోళ్ళల్లో కూడ పెరుగులు చమురుతాడట. వెన్న దొంగ కృష్ణుడు. అన్ని వీధులూ తనవే అన్నట్లుగా తిరుగుతున్న శ్రీవేంకటాద్రి కృష్ణుడు యటుకులను మెక్కుతున్నాడు. వద్దని వారించే గొల్లెతలను కౌగిలించుకొనేవాడు కొంటెకృష్ణుడు అని అన్నమయ్య శ్రీకృష్ణుని ఉట్ల పండుగను వర్ణిస్తూ ఆనాడు ఎన్నో రకాలయిన ఉట్లు కట్టబడినట్లు మరొక కీర్తనలో ఇలా వర్ణించినాడు.

**శంకరాభరణం**

**అక్కలాల చూడుఁ దందరును**
**నిక్కి వారివట్టీ నేఁడు గృష్ణుఁడు॥**

**ఆనవాలవుట్టి అడుకులవుట్టి**
**పానకపుటుట్టి బలిమినే**
**ఆనుక కోలల నంది యంది కొట్టి**
**తేనెవుట్టి గొట్టి దేవకీ సుతుడు॥**

**పెరుగువుట్టి మంచిపేరిన నేతివుట్టి**
**సరి వెన్నవుట్టి చక్కెరవుట్టి**

**వెరవు తాఁగొట్టి వెస బాలులతో**
**బొరుగువుట్టి గొట్టీ పొంచీరాముఁడు॥**

**మక్కువ నలమేలుమంగఁగూడి నేఁడు**
**చొక్కి శ్రీవేంకటేశుఁడు వీథుల**
**నిక్కి వుట్లెల్లా నిండాఁగొట్టె వుట్టి**
**చక్కిలాలు గొట్టి జగతీశుఁడు॥**

బాగా ఇగురకాచిన పాల (ఆనవాల) వుట్టి, అటుకులవుట్టి, పానకపుటుట్టి, తేనెవుట్టి ఇన్ని ఉట్లను దేవకీసుతుడు కోలలతో ఎగిరి ఎగిరి కొట్టినాడట.

అట్లే పెరుగువుట్టి, గట్టిగ పేరిన నేతివుట్టి, వెన్నవుట్టి, చక్కెరవుట్టి, బొరుగు వుట్లను పొంచి పొంచి బలరాముడు కొట్టేవాడట!

మక్కువతో శ్రీవేంకటేశుడు అలమేలుమంగతో కూడి వీథులలో కట్టబడిన ఉట్లనెల్లా నిక్కి నిక్కి కొట్టినాడట! అని అన్నమాచార్యులు అనేక రకాలయిన ఉట్లను, ఉట్ల పండుగ వేడుకలను వర్ణించినాడు. ఈ వినోదాలెల్ల ద్వాపరయుగం నాటి చిన్ని కృష్ణుని చిలిపిచేష్టలకు నిదర్శనాలు! ఈ వేడుకల్లో పాల్గొనువారు కృష్ణుని వేషం ధరించి ఉట్లను గొట్టుదురు. అంటే ఈ ఉట్లను కొట్టువారే గోపాలకృష్ణుడన్న మాట. ఈ ఉట్ల పండగ వేడుకలు శ్రీవారి ఉత్సవమూర్తి ఎదుట వీదులలో నిర్వహిస్తారు.

నేడుకూడ తిరుమల శ్రీవారికి ఈ ఉట్ల పండుగ ఉత్సవాలు రోహిణీ నక్షత్రం ప్రధానంగా గల రోజున నిర్వహింపబడుతున్నాయి.

**("సప్తగిరి" పత్రికలో ప్రచురితం)**

# 14. శ్రీవారి పుష్పయాగం - అన్నమయ్య

**పరమాత్ముఁడు పరమపురుషుఁడు**
**పరికింపఁగఁ గృపాలుఁడు**
**తిరువేంకట విభుఁడేకాక**
**దేవుఁడు మరి కలఁడా"**

అని తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామిని గూర్చి ఆయన దాతృత్వాన్ని గురించి అనుభవపూర్వకంగా చాటి ప్రచారంచేశాడు తాళ్ళపాక అన్నమాచార్యులు. అందుకే వరప్రదాత అయిన శ్రీనివాసుని

**భావములోనా బాహ్యము నందును**
**గోవింద! గోవింద! అని కొలువవో మనసా!!**

అని అడుగడుగునా లోకులను ప్రబోధించాడు. తిరువేంకటనాథుని నామము 'వెల సులభము ఫల మధికము' అని కొనియాడి ప్రచారం చేశాడు.

ఆకటివేళ్ళల్లో హరినామమే తేకువ మందు అని కీర్తించాడు. కొఱమాలి వున్నవేళ, కులము చెడినవేళ, పరులచే చిక్కి చెరసాలలో వున్న వేళ, వేంకటేశు నామ మొకటే గతియని చాటాడు. ఆపద వచ్చిన వేళ, ఆరడి బడిన వేళ, పాపపు వేళ, భయపడిన వేళ, శ్రీ తిరుమలప్పని నామ సంకీర్తన వీడక చేశాడు. సంకెళ్ళ బెట్టిన వేళ, చంపబిలిచినవేళ, అప్పులవారారడి బెట్టినవేళల్లో కోనేటిరాయని పేరును కొసరి కొసరి తలంచి రక్షింపబడ్డాడు అన్నమయ్య.

ఇంతటి పరమ భక్తాగ్రేసరుడైన అన్నమయ్య శ్రీవేంకటపతి లీలలను, మహిమలను తన పదకవితల్లో వింత వింతలుగా వర్ణించాడు. వర్ణించడమే కాదు, తిరువేంకటగిరి దేవునికి నిత్యమూ కర్పూరహారతి మొదలు కల్యాణోత్సవం వరకు జరుగు ఉత్సవాల్లో పాల్గొన్నాడు. పవ్వళింపుసేవ మొదలు బ్రహ్మోత్సవం దాకా అనేక సేవలూ, ఉత్సవాలు చేశాడు.



చేయించాడు. వాటిని తేటతెనుగు పదాల్లో సుసంపన్నంగా వచించాడు. అవే లోకంలో పరమగానాలుగా పరిఢవిల్లిన్నాయి.

తాళ్ళపాక అన్నమాచార్యులు తిరుమల శ్రీవారికి చేయించి, కీర్తించిన అనేక ఉత్సవాల్లో 'పుష్పయాగం' అన్ని సేవల్లో చాలా పవిత్రమైంది. స్వరఫలసిద్ధి ప్రదమైంది కూడా.

సుగంధ పరిమళాలను వెదజల్లుతున్న వివిధ రకాలైన రంగు రంగుల పుష్పాలతో అనంత కళ్యాణ గుణాభిరాముడైన తిరుమల శ్రీనివాసునకు జరుగు పుష్పాభిషేకమే పుష్పయాగం.

ప్రతిష్ఠాంతంలోను, ఉత్సవాంతంలోను-మేషతులా సంక్రమణాల యందును, దక్షిణాయన ఉత్తరాయణ పుణ్యకాలాల్లోను, శ్రీవారి జనన నక్షత్రమైన శ్రవణంలోను పుష్పయాగం చేయబడుతుంది. లేదా భక్తాదులు



తమ తమ జన్మ నక్షత్రాదులందు కూడ స్వామివారికి ఈ పుష్పయాగం చేస్తారు.

దేశాధిపతులు, ప్రభుత్వాధినేతలు తమ తమ రాజ్యాలు సుభిక్షంగా ఉండగలందులకై కూడ పుష్పయాగం చేయడం కద్దు. అంతేకాక.

సర్వజన బాధాకరములైన అతివృష్టి, అనావృష్టి, దుర్భిక్షం మున్నగు సర్వోపద్రవ సమయాలలో ఈ పుష్పయాగం ఘనవేంకటరాయనికి నిర్వహించడం కలదని భవిష్యోత్తరపురాణంలోను ఆగమాలలోను పేర్కొనబడినట్లుగా తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన విద్వాంసులు పండిత శ్రీ వేదాంతం జగన్నాధాచార్యులవారు తెలియజేశారు.

పుష్పయాగం జరుపబడేరోజు ఉదయం తిరుమల శ్రీమలయప్ప స్వామివారిని (ఉత్సవమూర్తులు) ఉభయ దేవేరులతోకూడ శ్రీవారి ఆలయంలోని సంపంగి ప్రదక్షిణంలోగల మండపంలో వేంచేపు చేస్తారు. అనంతరం వేదమంత్రోచ్చారణల మధ్య ఉభయ దేవేరులతోకూడిన శ్రీస్వామివారికి స్నపనతిరుమంజనం, సహస్రధారాభిషేకాలు జరుపబడుతుంది. పిదప ఋత్విక్కులు విష్ణు గాయత్రీ మహామంత్రంతో బిల్వదళాలతో 108 పర్యాయాలు హోమం చేస్తారు. ఆ హోమం ముగిసిన తరువాత పుష్పాధిపతిని గూర్చి కూడ పంద్రెండు పర్యాయాలు వైష్ణవాంతంగా హోమం ప్రారంభించి పూర్తి చేస్తారు.

ఒక వైపు వేదాంత వేద్యులు, ఋగ్యజుస్సామాధరణ వేదాలను నాలిగింటిని శ్రుతి మధురంగా వల్లిస్తుండగా, ఆ వేదఘోషల మధ్య, మరొక వైపు భక్తకవి పండిత వాగ్గేయకార వందిమాగధులు శ్రీవారిని తమ తమ సాహితీ ప్రక్రియా విశేషాలతో అత్యంత భక్తిప్రపత్తులతో కీర్తిస్తుండగా, శ్రీవారికి పుష్పార్చాధన విశిష్ట రీతిలో ప్రారంభమవుతుంది. ఋత్విక్కుల మహామంత్రోచ్చారణల మధ్య శ్రీవారికి పుష్పాంజలి జరుగుతుంది. ఆ పుష్పారాధన, శ్రీవారి విగ్రహాల పాదాల నుండి. హృదయం వరకు పువ్వులలో

మునిగే వరకు జరగుతుంది. తరువాత ఆ పుష్పాలను తొలగిస్తారు. మళ్ళీ పైవిధంగానే పుష్పారాధన జరగుతుంది. విగ్రహాలు హృదయం వరకు మునుగగానే ఆ పూలను తొలగిస్తారు. ఇలాగ ఇరువది మార్లు పుష్పనీరాజనం చేయబడుతుంది. తరువాత శ్రీమలయప్పస్వామి శ్రీదేవి భూదేవులతో సహా బంగారు తిరుచ్చిలో ప్రదక్షిణంగా వెళ్ళి ఆనందనిలయంలో ప్రవేశిస్తాడు. దీనితో పుష్పయాగం పరిసమాప్త మవుతుంది.

సర్వక్రామప్రదమూ, సర్వఫల సిద్ధిప్రదమూ అయిన పుష్పయాగం తిరుమలలో శ్రీవారికి చాలాపూర్వం నుంచీ అత్యంత వైభవోపేతంగా నిర్వహింపబడేదని అనేక శాసనాధారాలు స్పష్టం చేస్తున్నాయి. అది తాళ్ళపాక కవులనాటి వరకు కూడ అంటే 15-16 శతాబ్దాల నాటి వరకు కూడ ఈ పుష్పయాగోత్సవం జరుగుతుండేదని తెలియవస్తున్నది. కాని ఏకారణం చేతనో, మధ్యకాలంలో ఆ పుష్పయాగం శ్రీస్వామివారికి జరగడం నిలిచిపోయింది.

వందల సంవత్సరాల తర్వాత మళ్లీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు 14-11-80 నాటి నుండి ఈ పుష్పయాగాన్ని పునరుద్ధరించి శ్రీస్వామివారికి ఘనంగా నిర్వహిస్తున్నారు. ఈ పుష్పయాగానికి అవసరమగు పరిమళభరిత మయిన వింత వింత రకాలపుష్పాలు అనేకం తిరుమల శ్రీవారి పుష్పవనం నుండే సమకూర్చబడుతున్నాయి. పుష్పయాగం జరిగిన సాయంత్రం శ్రీవారికి సహస్ర దీపాలంకరణ సేవ నిర్వహించడం మరోవిశేషం. నేడు తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్జితసేవగా కూడ నిర్వహిస్తున్న శ్రీవారి ఈపుష్పయాగంలో తగిన రుసుము చెల్లించి భక్తాదులు, గృహస్థులు కూడ పాల్గొనవచ్చు.

కలియుగ కల్పతరవు శ్రీవేంకటేశునికి పుష్పయాగం ఎలా జరిగేదో ఇలా వర్ణించినాడు, అన్నమాచార్యులు



**సామంతం**

**సకలలోకేశ్వరులు సరసఁ జేకొనువాఁడు**
**అకలంకముఁగ బుష్పయాగంబు**

**వివిధ పుష్పములతో వేదఘోషములతో**
**అవల దిరువాముడియు నంగనల యాటతో**
**కవి వంది నుతులతో కమ్మఁబూజలతోడ**
**నవధరించీఁ బుష్పయాగంబు**

**కప్పురపు టారతుల ఘనచందనముతోడ**
**తెప్పల ధూపముల తిరువందికాపుతో**
**నొప్పుగఁ బణ్యారములు వొగిఁ బెక్కు వగలతో**
**అప్పడందీఁ బుష్పయాగంబు**

**తగు ఛత్రచామరాలు తాంబూలముతోడ**
**పగటుతో నీరీతి పదిపూజలందుకొని**
**జిగి మీరెఁ జూడరే శ్రీవేంకటేశ్వరుని**
**అగణితంబగు పుష్పయాగంబు**

సకల లోకేశ్వరులు వేంచేసి వుండగా తిరుమల శ్రీనివాసునకు పుష్పయాగం జరుగుతున్నదట.

ఒక వైపు వివిధరకాలైన రంగు రంగుల పుష్పాలు, వేదపండితులు పఠించే శ్రుతిపేయమైన వేదఘోషలు, ఇంకొక వైపు దేవదాసీల నృత్యాలు! కవి వంది మాగధుల పొగడ్తలు వేరొకవైపు! కమ్మనైన పూజలందు కొంటున్న శ్రీవేంకటనాథుడు.

కప్పురపు టారతులు! చందనపుమైపూతలు! తెప్పలు తెప్పలుగా సుగంధ ధూపాలు! పలురకాలైన పణ్యారముల నైవేద్యం. ఛత్రములు! చామరములు! తాంబూల సేవనము! ఇలాగా ఈ పుష్పయాగంలో శ్రీవేంకటేశ్వరస్వామి

పదిరకాలైన పూజలందుకొన్నట్లు తాళ్ళపాక అన్నమాచార్యులు వర్ణించాడు. ఇలాగ అధ్యాత్మ కీర్తనల్లోనే గాక శృంగార కీర్తనల్లో కూడ పుష్పయాగాన్ని తనివితీర వర్ణించి స్మరించాడు అన్నమయ్య.

**గౌళ**

**పూవుఁ బోణుల కొలువే పుష్పయాగము**
**పూవక పూచే నీ కిట్టె పుష్పయాగము**

**కలువరేకుల వంటి ఘనమైన కన్నుల**
**పొలఁతుల చూపులె నీ పుష్పయాగము**
**తలఁచి తలఁచి నిన్నుఁ దమ మేనులఁ బొడమే**
**పులక జొంపములె నీ పుష్పయాగము**

**కర కమలములను కందువ గోపికలెల్లా**
**పొరసి నినుఁ జూపులే పుష్పయాగము**
**సరసపు మాటలే సారె నాడి తమ నవ్వు**
**పొరి నీ పైఁ జల్లుటే పుష్పయాగము**

**గాఁటపు గొలనిదండఁ గాంతలు సిగ్గున నిన్ను**
**బూటకానకుఁ దిట్టుటే పుష్పయాగము**
**యీటున శ్రీవేంకటేశ యిట్టె యలమేలుమంగ**
**పూఁట పూఁట రతులివి పుష్పయాగము**

శృంగారభక్తి సంప్రదాయంలో సాగిన ఈ శృంగార కీర్తనలో శ్రీ అలమేలుమంగ యొక్క చూపులు, పులక జొంపములు, సరసపు మాటలు, నవ్వులు, బూటకపు తిట్లు పుష్పయాగంలోని పలురకాలైన పూజలుగా పోల్చబడి కమనీయంగా వర్ణింపబడింది.

**("సప్తగిరి"లో ప్రచురితం)**

# 15. కొండలరాయని అండలో కోటిదేవుళ్ళు

కలియుగ వైకుంఠంగా ప్రసిద్ధికెక్కిన శ్రీ వేంకటాచల క్షేత్రం పై స్వయంభువుగా ఆవిర్భవించి వున్న శ్రీ వేంకటేశ్వరస్వామి సాటిలేని మేటి దేవుడు. అందువల్లే...

**శేషాచలే యన్మాహాత్మ్య మన్యక్షేత్రే నతత్ క్వచిత్**
**తద్గత శ్రీనివాసస్య మహిమా నాన్యగః శుభః.**

అన్న ప్రసిద్ధిని పొందింది. శేషాచలం వంటి మహిమాన్వితమైన క్షేత్రం ఇతరత్రా కానరాదు. దయాంతరంగుడైన శ్రీనివాస ప్రభువువంటి మహిమగల దేవుడు ఇంకెక్కడా కనపడదు.

ఉత్తమోత్తముడైన దేవుడు కావడంచేతే తిరుమలప్పుడు సర్వలోకాలకూ ఆరాధ్యుడయినాడు. ఎందరో దేవుళ్లు కొండలరాయుని కొలువులో నిత్యమూ సేవిస్తూ తరిస్తూ వున్నారు.

**నిత్యం బ్రహ్మ శివః శేష**
**గరుడేంద్రాదయోఽమరాః**
**పూజయంతి మహాభక్త్యా**
**వేంకటేశం శ్రియా సహ.**

బ్రహ్మదేవుడు, శివుడు, శేషుడు, గరుత్మంతుడు ఇంద్రాది దేవతలెందరో లక్ష్మీసహితుడైన శ్రీ శ్రీనివాసస్వామిని ప్రతినిత్యం అత్యంత భక్తి ప్రపత్తులతో సేవిస్తుంటారు.

తిరుమల శ్రీ వేంకటేశునితోపాటు, ఆ స్వామిసన్నిధిలో వేంచేసి సేవచేస్తూ ఉన్న ప్రధాన, పరివార దేవతలను ఒక్కసారి స్మరిద్దాం.

**బ్రహ్మదేవుడు**

అనాదిగా వైఖానసఆగమం ప్రకారం పూజలు జరుగుతున్న తిరుమలలో ప్రతి రోజూ ఏకాంతసేవకు ముందు ఆనందనిలయంలో ఒక పెద్ద బంగారు

గిన్నెలో నీళ్లు పెడతారు. ఏకాంతసేవ పూర్తి అయిన తరువాత ఆలయం తలుపులు మూసివేస్తారు. ఆ రాత్రి బ్రహ్మాది దేవతలు వచ్చి ఆ నీటితో శ్రీ స్వామివారిని అర్చిస్తారట! సుప్రభాతానంతరం ఆ నీటినే భక్తులకు తీర్థంగా ఇవ్వడం జరుగుతున్నది. ఇలా ప్రతిరోజు తిరుమలలో బ్రహ్మదేవునిచే తొలిపూజ జరుపబడుతున్నది.

ఇంతమాత్రమేగాక వేంకటేశ్వరుడు ఇక్కడ వెలసిన తొలినాళ్లలోనే బ్రహ్మదేవుడు తిరుమలప్పకు వైభవంగా ఉత్సవాలు చేశాడు. అందుకే ఇవి బ్రహ్మోత్సవాలుగా ప్రసిద్ధి పొంది, నేటికీ ప్రతి ఏటా నిర్విఘ్నంగా, నిరాఘాటంగా సాగుతునే వున్నై. అందుకు గుర్తుగా బ్రహ్మోత్సవంలో ప్రతి ఊరేగింపుకు ముందుగా 'బ్రహ్మరథం' వెళుతూ వుంటుంది. ఖాళీగా కనిపించే ఈ రథంలో బ్రహ్మదేవుడు నిర్గుణ నిరాకారంతో వేంచేసి శ్రీస్వామివారిని సేవిస్తూ వుంటాడు.

పదినాళ్లపాటు జరిగే ఈ బ్రహ్మోత్సవాల్లో సూర్యుడు, చంద్రుడు, ఆదిశేషుడు, హనుమంతుడు, గజేంద్రుడు, గరుత్మంతుడు మున్నగు దేవుళ్లంతా వాహనాలుగా ఉపయోగపడుతూ శ్రీ తిరుమలస్వామిని వీథులలో ఊరేగిస్తారు. వీనిలో ఐదవరోజు జరిగే బంగారు గరుడోత్సవం వైభవం ఇంతింతని వర్ణింపలేనిది, వర్ణింపరానిది. ఆ రోజు ఆనందనిలయంలోని మూలవిరాట్టునకు అలంకరించే మకరకంఠి, లక్ష్మీహారాలు, శ్రీవారి ఉత్సవమూర్తికి అలంకరిస్తారు. ఆనాడే తమిళనాడులోని శ్రీ విల్లిపుత్తూరు గోదాదేవి కూడ తాను ధరించిన పూలమాల అత్యంత ప్రేమతో భక్తితో శ్రీస్వామివారికి పంపగా, దానిని అలంకరిస్తారు. అలాగే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరుపున పట్టువస్త్రాలు స్వామివారికి సమర్పించగా వాటిని అలంకరిస్తారు. ఇక ఆ సమయానికే మిరాశివాండ్లు కొత్తగొడుగులను స్వామివారికి సమర్పిస్తారు. వీటి అన్నింటిమధ్య అశేషభక్తజనం చూస్తుండగా, చిరునవ్వులు చిందిస్తూ క్రీగంటి చూపులతో భక్తులను



అనుగ్రహిస్తూ తిరుమల పురవీధుల్లో స్వామివారు ఊరేగుతారు. ఇక తొమ్మిదవరోజు జరిగే రథోత్సవం కూడా అత్యంత వైభవంగా జరుగుతుంది. చివరిరోజు సుదర్శన చక్రతాళ్వార్‌తో కూడ శ్రీస్వామివారు వరాహపుష్కరిణికి వెళ్లి స్నానం చేస్తారు. ప్రతిసంవత్సరం ఘనంగా జరిగే బ్రహ్మోత్సవాల్లో లక్షలాది జనం పాల్గొంటారు.

**అలమేలుమంగ**

శ్రీ వేంకటేశ్వరస్వామివారికి అన్నివేళలా అత్యంత సన్నిహితంగా వక్షఃస్థలంలో కొలువై వుండి, శ్రీ స్వామివారికి అర్చనలు జరిగిన వెంటనే, తానూ ప్రత్యేకంగా పూజలందుకుంటున్న అలమేలుమంగ సాక్షాత్తు శ్రీమహాలక్ష్మీదేవి– ''వ్యూహాలక్ష్మి''. ఈ యమ వక్షఃస్థలంలో కొలువై వున్నందువల్లే శ్రీస్వామివారివైభవం వేయి విధాలుగా వెలుగుతున్నదని ప్రసిద్ధి.

ఈమె అంశ కలిగిన శ్రీదేవి భూదేవులు శ్రీస్వామివారికి ఇరువైపులా వేంచేసి సేవచేస్తూంటారు.

**శ్రీరాముడు–శ్రీకృష్ణుడు**

ఆనందనిలయంలో శ్రీ స్వామివారి సన్నిధిలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూర్తులు కాకుండా శ్రీ సీతారామలక్ష్మణులు, శ్రీ రుక్మిణీకృష్ణులు ఉత్సవ విగ్రహరూపంలో కొలువై వున్నారు. శ్రీరామనవమి, కృష్ణాష్టమి పండుగ సందర్భాల్లో ఉత్సవాదులు జరుపుకునే ఈ విగ్రహాలు శ్రీస్వామివారిసన్నిధిలో ఎప్పుడు చేరాయో ఇదమిత్థంగా తేల్చి చెప్పడం కష్టం.

**శ్రీ సుదర్శన చక్రత్తాళ్వార్**

శ్రీస్వామివారి సన్నిధిలో ఆనందనిలయంలోనే శ్రీ సుదర్శన భగవానుడు పంచలోహ విగ్రహరూపంగా వేంచేసి, రథసప్తమి, బ్రహ్మోత్సవం వంటి పర్వదినాల్లో శ్రీ స్వామివారితోపాటు ప్రధాన పూజలందుకుంటున్నాడు.

బ్రహ్మోత్సవంలో చక్రస్నానం వంటి ఉత్సవం ఈ సుదర్శన చక్రత్తాళ్వారుకు సంబంధించినదే.

### శ్రీ నృసింహ, రామ, కృష్ణులు

శ్రీ నృసింహ, రామ, కృష్ణ... ఇత్యాది దేవుళ్లు సాలగ్రామాల రూపంలో శ్రీవారి ఆలయంలో కొలువైవుండి నిత్యమూ, అభిషేకార్చనలు పొందుతున్నారు. ఇంతేగాకుండ శ్రీ వేంకటేశ్వరస్వామివారికి 108 సాలగ్రామాలు కల ఒక మాల ఆభరణంగా విరాజిల్లుతోంది.

### అనంత, గరుడ, విష్వక్సేనులు

శ్రీస్వామివారి దర్శనానంతరం వెలుపలికి వస్తున్న దారిలో 'రామర్ మేడ' అనే ఇరుకైన నడవవుంది. ఈ దారిలో కుడి, ఎడమవైపునగల అరుగులమీద హనుమంత, అంగద, సుగ్రీవ, గరుడ, అనంత, విష్వక్సేనుల ఉత్సవ విగ్రహాలు వున్నాయి. స్వామివారికి జరిగే ఆ యా ఉత్సవాల్లో ఈ పంచలోహ విగ్రహాలు ప్రధానపాత్ర వహిస్తున్నాయి. ప్రస్తుతం ఈ విగ్రహాలు తీర్థం, శఠారి ఇచ్చే అర(గది)లో చూడవచ్చు.

### జయ విజయులు

బంగారు వాకిలిని ఏమరకుండా కావలి కాస్తూ వాకిలికి ఇరువైపులా శంఖ, చక్ర, గదాధారులై వున్నారు జయ విజయులు. ఇవి నిలువెత్తు పంచలోహ విగ్రహాలు.

### గరుడాళ్వార్

బంగారు వాకిలికి ఎదురుగా ఉన్న చిన్నమందిరంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి అభిముఖంగా నమస్కార భంగిమలో గరుత్మంతుడు కొలువైవున్నాడు. ఇది ఆరు అడుగులున్న శిలా విగ్రహం.



### శ్రీ వరదరాజస్వామి

విమాన ప్రదక్షిణమార్గంలో వెండివాకిలికి దక్షిణంగా శ్రీవరదరాజస్వామివారి ఆలయం పశ్చిమాభిముఖంగా వుంది. ఇందులో శంఖ చక్ర గదాధారుడైన వరదరాజస్వామికి విశేష పూజలు లేకపోయినా, ప్రతినిత్యం నైవేద్యాదులు మాత్రం ప్రత్యేకంగా జరుపబడుతున్నాయి. సంవత్సరంలో వరదరాజస్వామి జయంతినాడు మాత్రం తిరుమంజనం (అభిషేకం), విశేషపూజ, నైవేద్యాదులు జరుపబడుతున్నై.

### వకుళమాలిక

విమాన ప్రదక్షిణ మార్గంలో, శ్రీస్వామివారి దర్శనం చేసికొని బంగారువాకిలిదాటి బయటికి వచ్చినంతనే ఎదరుగా అన్న ప్రసాదాల వంటశాల వుంది. ఈ వంటశాలను (పోటు) పర్యవేక్షిస్తూ లోపల తూర్పు ముఖంగా వేంచేసి వున్నది వకుళమాలిక. ఈమెకు వేంకటేశ్వరునితోపాటు మూడు పూటలా నైవేద్యం జరుగుతున్నది. ఈమె శ్రీవేంకటేశ్వరుని తల్లి. పూర్వజన్మలో ఈమెయే యశోదగా చెప్పబడుతున్నది.

### విమాన వేంకటేశ్వరుడు

విమాన ప్రదక్షిణమార్గంలో ఉత్తరం వైపున ఆనంద నిలయం గోపురంమీది వేంకటేశ్వరుని దర్శించవచ్చు. ఈ విమాన వేంకటేశ్వరుని దర్శనం, సాక్షాత్తు గర్భాలయంలోని స్వామి దర్శనంతో సమానం.

### సన్నిధి భాష్యకారులు

విమాన ప్రదక్షిణ మార్గంలో ఉత్తరం వైపున శ్రీవారి హుండీకి ఎదురుగా భాష్యకారులయిన భగవద్రామానుజుల మందిరం వుంది. ఈ ఆలయంలో దక్షిణాభిముఖంగా శ్రీరామానుజుల శిలావిగ్రహం ప్రతిష్ఠింపబడింది. ఇవి కాక పంచలోహ ఉత్సవవిగ్రహం కూడా వుంది. ప్రతినిత్యం శ్రీ

వేంకటేశ్వరస్వామివారికి నివేదన అయిన ప్రసాదాన్ని శ్రీ రామానుజులకు నివేదన చేస్తారు.

**యోగ నరసింహస్వామి**

విమాన ప్రదక్షిణమార్గంలో ఈశాన్యమూలకు పశ్చిమాభిముఖంగా శ్రీ యోగనరసింహస్వామికి నిత్యం విశేషపూజలు లేకపోయినా ప్రత్యేక నైవేద్యాదులు జరుపబడుతున్నై, నరసింహజయంతినాడు మాత్రం తిరుమంజనం (అభిషేకం), విశేషపూజ, నైవేద్యాదులు జరుపబడుతున్నై

**విష్వక్సేనులు**

శ్రీస్వామివారి హుండీకి ప్రదక్షిణం చేసి వెలుపలికి వచ్చిన వెంటనే ఎడమచేతి వైపు వైకుంఠ ప్రదక్షిణ మార్గద్వారముంది. దీనికి పక్కన చిన్నమందిరంలో శ్రీవిష్వక్సేనుల శిలావిగ్రహం దక్షిణాభిముఖంగా ప్రతిష్ఠింపబడింది. వీరు వేంకటేశ్వరస్వామివారికి సేనాపతి. వీరి ఉత్సవ విగ్రహం ఆలయంలోపల వుంది. ఆణివార ఆస్థానం, ఉగాది, దీపావళి వంటి ఆస్థానాల్లోను, బ్రహ్మోత్సవాల్లోను, ఈ సేనాధిపతి ప్రధానపాత్ర వహిస్తారు.

**క్షేత్రపాలకుడు (రుద్రుడు)**

బంగారు ధ్వజస్తంభానికి, బలిపీఠానికి దగ్గరలోనే ఈశాన్యమూలకు క్షేత్రపాలక శిలవున్నది. ప్రతిరోజూ ఉదయం అర్చకులు ఇంటి నుండి ఆలయంలోనికి, రాత్రి ఆలయం నుండి ఇంటి వెళ్లేటప్పుడు బీగం చెవులను, ఈ క్షేత్రపాలక శిలకు తాకిస్తారు. ఈ క్షేత్రపాలకుడు రుద్రాంశతో కూడినవాడనీ, గోగర్భతీర్థంలో పూర్ణకళతో ప్రకాశిస్తున్నాడనీ చెప్పారు. ప్రతి మహాశివరాత్రినాడు గోగర్భంలో వెలసివున్న క్షేత్రపాలక గుండుకు శ్రీస్వామివారి అర్చకులు నమక చమక రుద్రాభిషేకం చేసి నైవేద్యం పెడతారు.



**శ్రీకృష్ణుడు**

అద్దాలమహలుకు ఉత్తరంగా 'యామునాత్తురై' అనే పుష్పమండపం ఉంది. పూర్వం యామునాచార్యులనే భక్తుడు శ్రీస్వామివారికి పూలమాలలు కట్టి కైంకర్యం చేసేవారు. వారి పేరుతోనే ఈ మండపాన్ని పిలుస్తున్నారు. ఈ మండపంలో రుక్మిణీ సత్యభామా సమేతుడైన శ్రీకృష్ణుని శిలావిగ్రహం వుంది. శ్రీ కృష్ణాష్టమినాడు శ్రీ వేంకటేశ్వరస్వామివారిని, ఈ మండపంలో వేంచేపు చేసి ఆస్థానం జరుపుతారు.

**పోటుతాయారు**

పుష్పఅరకు ఆనుకుని పడమటికి లడ్డు, వడ, జిలేబి, అప్పం వంటి పిండివంటల పోటువున్నది. ఈ వంటశాలలో ఆగ్నేయమూలకు తూర్పుముఖంగా పోటుతాయార్ అను దేవత కొలువై వుండి వంటలను పర్యవేక్షిస్తున్నది.

**బేడి ఆంజనేయస్వామి**

శ్రీస్వామివారి ఆలయానికి ఎదురుగా సన్నిధి వీధిలో శ్రీ బేడి ఆంజనేయస్వామి ఆలయం వుంది. శ్రీ వేంకటేశ్వరస్వామికి అభిముఖంగా చేతులకు బేడిలు తగిలించుకుని నమస్కార భంగిమలో నిలిచివున్న ఆంజనేయస్వామికి ప్రతి ఆదివారం పంచామృతాభిషేకం జరుగుతుంది. ప్రతి పునర్వసునక్షత్రం రోజున ఆనందనిలయంలోని శ్రీ సీతారామ లక్ష్మణులు ఇక్కడికి వేంచేయగా, రాములవారి మీది పూలమాల ఆంజనేయస్వామికి సమర్పించడం జరుగుతుంది.

**భూ వరాహస్వామి**

శ్రీ స్వామి పుష్కరిణికి వాయవ్యమూలలో వరాహస్వామి ఆలయం ఉంది. శ్రీ మహావిష్ణువు ఆది వరాహస్వామిగా అవతరించి భూదేవిని రక్షించి ఇక్కడే నిలిచాడు. అందుకే ఇది వరాహక్షేత్రమని ప్రసిద్ధి పొందింది. ఆ

తర్వాత మరి కొంతకాలానికి శ్రీనివాసుడు వైకుంఠం నుండి ఇక్కడికి వచ్చి తాను వుండడానికి వరహస్వామిని కొద్ది స్థలాన్ని అడిగాడు. "ప్రతినిత్యం మొదటిపూజ, మొదటి నైవేద్యం, మొదటి దర్శనం" అనే నియమ ఒప్పందంతో దానపత్రం రాసిచ్చి, స్థలాన్ని సంపాదించి, తన ప్రాబల్యాన్ని పెంచుకున్నాడు వేంకటేశ్వరస్వామి. ప్రస్తుతం అప్పటి నియమం ప్రకారమే శ్రీ వరాహ స్వామివారి పూజానివేదనాదులన్నీ వేంకటేశ్వరుడే చూస్తున్నాడు.

**ఆంజనేయస్వామి**

వరాహస్వామి ఆలయానికి ఎదురుగా కోనేటి ఆవలిగట్టున ఆంజనేయస్వామి నమస్కార భంగిమలో ఉన్నాడు. ఈ స్వామికి ప్రతి ఆదివారం అభిషేక పూజానివేదనలు జరుగుతాయి.

**తీర్థ, క్షేత్ర దైవాలు**

తిరుమల కొండల్లో, కోనల్లో నెలకొన్న చక్రతీర్థంలోని శ్రీ సుదర్శనస్వామి, రామకృష్ణతీర్థంలోని శ్రీరామకృష్ణులు, కుమారతీర్థంలోని కుమారస్వామి జాబాలి తీర్థంలోని హనుమంతుడు... ఇత్యాది తీర్థ క్షేత్ర దైవాలెందరో ప్రతినిత్యం శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధికి వేంచేసి సేవిస్తుంటారని ప్రతీతి.

**తోవభాష్యకారులు**

కొండ దిగి వెళ్లే దారిలో మోకాళ్ల పర్వతంలో తోవభాష్యకారులనబడే శ్రీరామానుజస్వామి ఆలయం వుంది. వీరికి ప్రతినిత్యం తిరుమల శ్రీవారి ఆలయం నుండి నైవేద్యం వస్తుంది.

**శ్రీ లక్ష్మీ నృసింహస్వామి**

కొండదిగి వెళ్లేదారిలో రోడ్డు దాటిన తర్వాత శ్రీ లక్ష్మీ నృసింహాలయం వుంది. ఇచ్చట, ప్రతి శుక్ర, శనివారాలు ఘనంగా పూజలు జరుగుతున్నై.



**శ్రీ ప్రసన్నాంజనేయస్వామి**

తిరుమల తిరుపతి కాలినడక మార్గంలో ఏడవమైలులో సుమారు 30 అడుగుల ఎత్తైన శ్రీ ప్రసన్నాంజనేయస్వామి విగ్రహం వుంది. తిరుమల యాత్రీకులకు కన్నుల పండువుగా దర్శనమిస్తూ ప్రసన్నంగా ఉంటారు ఈ ఆంజనేయస్వామి.

ఇక్కడేగాక కాలినడకదారిలో అనేకచోట్ల ఆంజనేయస్వామివారి విగ్రహాలు భక్తులకు దర్శనమిస్తూ, భక్తిని ఇంకా వృద్ధి చేస్తాయి.

**గరుత్మంతుడు**

తిరుమల కొండ దిగిన తర్వాత అలిపిరిలో భగవంతుని కన్న భక్తుడే గొప్ప అన్న భావంతో తిరుమల భక్తులకు నమస్కార పూర్వకంగా స్వాగతం చెబుతూ సుమారు, 20 అడుగుల గరుడుడు దర్శనమిస్తాడు.

**శ్రీ కపిలేశ్వరస్వామి**

తిరుమల గిరులకు మూలంలో వెలసిన ప్రాచీనమైన క్షేత్రం కపిలతీర్థం. వేంకటాచలమాహాత్మ్యంలో ఈ కపిలతీర్థాన్ని గూర్చి గొప్పగా చెప్పబడింది. ఇక్కడ శ్రీ కామాక్షీ సమేత కపిలేశ్వరస్వామితోపాటు గణపతి, కుమారస్వామి, అగస్త్యేశ్వరస్వామి, కోటిలింగేశ్వరస్వామి ఆలయాలు కూడా వున్నాయి. పూర్వం యాత్రికులు ఇచ్చటి పుష్కరిణిలో తీర్థమాడి కపిలేశ్వరస్వామిని దర్శించిన తర్వాతే తిరుమలకు వెళ్లేవారు.

శ్రీకృష్ణమందిరం, శ్రీలక్ష్మీ నారాయణ మందిరం, ఆంజనేయస్వామి ఆలయం, శ్రీనమ్మాళ్వారుల గుడి కూడా ఈ క్షేత్రంలో వెలసివున్నాయి. ఈ తీర్థాన్ని కొందరు ఆళ్వారుతీర్థమని కూడ పిలవడం కద్దు.

కపిలతీర్థం, నిత్యం పూజా నివేదనాదులతో భక్తుల రద్దీతో సందడిగా వుంటుంది.

### ఇంకా ఇతర క్షేత్ర దైవతాలు

తిరుపతి గోవిందరాజస్వామి, శ్రీ కోదండ రామస్వామి, తిరుచానూరులోని శ్రీపద్మావతిదేవి, శ్రీసూర్యనారాయణస్వామి, అప్పలాయగుంటలోని శ్రీ ప్రసన్నవేంకటేశ్వరస్వామి, కార్వేటినగరం శ్రీ వేణుగోపాలస్వామి, నాగలాపురం శ్రీ వేదనారాయణస్వామి, నారాయణవనం శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి, శ్రీనివాసమంగాపురం కల్యాణ వేంకటేశ్వరస్వామి, వాల్మీకిపురంలోని శ్రీపట్టాభిరామాలయం, నగరిలోని శ్రీకరియమాణిక్యస్వామి ఆలయం, బుగ్గ శ్రీరామేశ్వరాలయం, కీలపట్ల శ్రీవేంకటేశ్వరుడు, నారాపురం వేంకటేశ్వరుడు, కడప వేంకటేశ్వరుడు, గండి, తాళ్లపాక, ఇత్యాది ఆలయదేవుళ్ళతోపాటు ఇంకా ఋషికేశ్‌లోని చంద్రమౌళీశ్వరుడు, వేంకటేశ్వరుడు... ఇంకా అమెరికా పిట్సుబర్గులోని వేంకటేశ్వరుడు, ఆస్ట్రేలియాలోని శ్రీ వేంకటేశ్వరస్వామి ఇలా ఎందరో దేవుళ్లు ఏడుకొండలదేవుడి అండలో చేరి సేవించి తరిస్తున్నారు.

ఈ దేవుళ్లంతా ప్రతినిత్యం దేవాధిదేవుడైన తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి వారిని సేవించి తరించడానికి బారులు తీరివుంటారట! అందువల్లే ప్రతిరోజు సుప్రభాత సమయంలో ఘనవేంకటేశ్వరుడు ఇలా స్తుతింప బడుతున్నాడు.

**సేవాపరాః శివసురేశ కృశానుధర్మః**
**రక్షోంబునాథ పవమాన ధనాధినాథాః**
**బద్ధాంజలి ప్రవిలసన్నిజ శీర్షదేశాః**
**శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్**

శివుడు, ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడు, వాయువు, కుబేరుడు మున్నగు దిక్పాలకులు చేతులు తలపై జోడించి నీ సేవకై వేచివున్నారు స్వామీ! ఓ వేంకటాచలపతీ! నీకు సుప్రభాతమగుగాక!!

**("సప్తగిరి"లో ప్రచురితం)**

## 16. భగవద్గీత - తాళ్లపాక కవులు

**"ఏకం శాస్త్రం దేవకీ పుత్రగీతం**
**ఏకో దేవో దేవకీ పుత్ర ఏవ**
**ఏకో మంత్ర స్తస్య నామాని యాని**
**కర్మాప్యేకం తస్య దేవస్య సేవా"**

శాస్త్రాలలో కెల్లా దేవకీ పుత్రుడైన శ్రీకృష్ణుడుపదేశించిన భగవద్గీత ఒక్కటే ఉత్తమ శాస్త్రం. దేవతలలోకెల్ల శ్రీకృష్ణభగవాను డొక్కడే గొప్పవాడు. మంత్రాలలోకెల్ల శ్రీకృష్ణనామం, కర్మలలోకెల్ల శ్రీకృష్ణసేవ అత్యుత్తమమైనవని అర్థం.

పరమపవిత్రమైన భగవద్గీత, పంచమ వేదమైన మహాభారతంలో ప్రధాన ఘట్టంగా విరాజిల్లుతున్నది. భీష్మపర్వంలో 25 నుండి 42 వరకు గల 18 అధ్యాయాల్లో భగవద్గీత రూపొందింది. ఇందులో 700 శ్లోకాలున్నాయి.

దేవ దేవుడైన శ్రీకృష్ణ భగవానుడు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో వికల మనస్కుడై కర్తవ్య విముఖుడైన అర్జునునికి గీతోపదేశం చేశాడు. ఆ గీత

**సర్వోపనిషదో గావః**
**దోగ్ధా గోపాలనందనః**
**పార్థో వత్స స్సుధీర్భోక్తా**
**దుగ్ధం గీతామృతం మహత్॥**

శ్రీకృష్ణుడు ఉపనిషత్తులనెడి గోవుల నుండి అర్జునుడనెడి దూడను నిమిత్తంగా జేసికొని గీత అనే అమృతాన్ని పితికినాడు. ధీమంతులందరు ఈ అమృతాన్ని సేవించవచ్చును.



ఈ గీతామృతాన్ని ఎందరో, మరెందరో సేవించి తరించారు. మరెందరో అనేక ప్రపంచ భాషలలోనికి అనువదించారు, వ్యాఖ్యానించారు. శ్రీమచ్ఛంకర భగవత్పాదులు, శ్రీభగవద్రామానుజులు, శ్రీమధ్వాచార్యులు వంటి మతాచార్యులు వారి వారి సిద్ధాంత పరంగా వ్యాఖ్యానించారు. మరికొందరు మహానుభావులు ఉపన్యాసాల ద్వారా గీతాయజ్ఞాల ద్వారా గీతామృతాన్ని లోకానికి అందించారు. అందిస్తున్నారు. ఇలాగ ఒక భారతీయ భాషల్లోనే కాదు. ఆంగ్లం, జర్మనీ, జపాన్, రష్యన్ మున్నగు అనేక భాషల్లో అనువదింపబడి వ్యాఖ్యానింపబడి శ్రీకృష్ణు విశ్వరూపంవలె భగవద్గీత కూడ విశ్వవ్యాప్తమై వున్నది.

తెలుగు సాహిత్యంలో చూచినట్లయితే పద్య కావ్యాలుగా, వచన కావ్యాలుగా, ప్రబోధాత్మక గేయాలుగా, ఉపదేశాత్మక కీర్తనలుగా... నాటకాలుగా... ఇలా భగవద్గీత వేయి విధాలుగ వెల్లి విరిసినది.

ముఖ్యంగా, ఆంధ్రవాఙ్మయంలో విస్తృతంగా వైష్ణవ భక్తి సాహిత్యాన్ని వెలయించిన తాళ్ళపాక కవుల వాఙ్మయంలో భగవద్గీత ఎలా వివరింప బడిందో, కీర్తింపబడిందో దిఙ్మాత్రంగా పరిశీలించడమే ప్రకృతోద్దేశం.



భగవద్గీతను తొలిగా తెలుగుభాషలో వ్యాఖ్యానించిన ఘనత తాళ్లపాక కవులకే చెందుతుంది. భగవద్గీతా ఘట్టాలను, భావాలను, పద కవితా పితామహుడైన అన్నమాచార్యులు తన కీర్తనల్లో ఎడనెడ దండిగా మెండుగా వివరించాడు. ఆ తరువాత అన్నమాచార్యుల కుమారుడైన పెద తిరుమలాచార్యులు కూడ గీతార్థాలను తండ్రి వలెనే పదకవితల్లోనే కాక, భగవద్గీత పదునెనిమిది అధ్యాయాలకు వ్యావహారిక సరళవచనానువాదాన్ని వెలయించాడు. పెద తిరుమలయ్య ఈ వ్యాఖ్యాన గ్రంథం తెలుగులో తొలి భగవద్గీతా వ్యాఖ్యాన గ్రంథంగా కీర్తి పొందింది. అంతేకాదు. తెలుగు సాహిత్య చరిత్రలోనే తొలి వ్యాఖ్యాన గ్రంథంగా కూడ ప్రసిద్ధి పొందింది. పెద తిరుమలాచార్యులు తెనిగించిన వచన భగవద్గీతకు ఆంధ్ర వేదాంతమని నామాంతరం కూడ ఉందని విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు.

అన్నమయ్య భగవద్గీతను పూర్తిగా వ్యాఖ్యానించినట్టు కన్పడదు. బహుశా భగవద్గీతనంతా తన కుమారుడైన పెదతిరుమలయ్యను తెనిగించవలసిందని అన్నమయ్య ఆదేశించి వుంటాడు. అందుకే అన్నమాచార్యులు భగవద్గీతను సంపూర్ణంగా కీర్తనల్లోగాని లేదా మరో విధంగా అనువదించలేదు. అందులో కీలకమైన అంగన్యాస కరన్యాస శ్లోకాలను తన కీర్తనల్లో వ్యాఖ్యానించాడు.



గీతాపారాయణ చేసేవాళ్ళు సంకల్పం చెప్పుకున్న తర్వాత క్రింది విధంగా అంగన్యాస కరన్యాస పూర్వకంగా గీతాపారాయణం చేస్తారు.

"అస్య శ్రీభగవద్గీత శాస్త్ర మహామంత్రస్య, భగవాన్ వేదవ్యాస ఋషిః, అనుష్టుప్ ఛందః శ్రీకృష్ణ పరమాత్మా పరదేవతా

1. 'అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాం శ్చ భాషసే' – ఇతిబీజమ్

2. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి' శక్తిః

3. 'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః' ఇతి కీలకమ్

4. 'నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః" ఇతి అంగుష్ఠాభ్యాం నమః

5. 'న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః" ఇతి తర్జనీభ్యాం నమః

6. 'అచ్ఛేద్యో యం యహ్యోయ మక్లేద్యోఽ శోష్య ఏవ చ" ఇతి మధ్యమాభ్యాం నమః

7. 'నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽ యం సనాతనః' ఇతి అనామికాభ్యాం నమః

8. 'పశ్యఽ మే పార్థ రూపాణి శతశోథ సహస్రశః' ఇతి కనిష్ఠికాభ్యాం నమః

9. 'నానా విధాని దివ్యాని నానా వర్ణాకృతాని చ' ఇతి కరతలపృష్ఠాభ్యాం నమః

10. 'నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః" ఇతి హృదయాయ నమః

11. 'న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః" ఇతి శిరసేస్వాహా

12. 'అచ్ఛేద్యోయ మదాహ్యోయ మక్లేద్యోఽ శోష్య ఏవ చ" ఇతి శిఖాయైవషట్

13. 'నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽ యం సనాతనః' ఇతి కవచాయ హుమ్ఫట్



14. 'పశమే పార్థ రూపాణి శథశోధ సహస్రశః' ఇతి నేత్రత్రయాయ వౌషట్

15. 'నానావిధాని దివ్యాని నానావర్ణాకృతాని చ' ఇతి అస్త్రాయ ఫట్

16. భూర్భు వస్సువరోహ మితి దిగ్బంధః

భగవద్గీతలోని సారభూతమైన పైశ్లోకాలను అన్నమాచార్యులు స్వీకరించి పదకవితల్లో వ్యాఖ్యానించాడు.

**అశోచ్యానన్వశోచస్త్వం, ప్రజ్ఞావాదాం శ్చ భాషసే**
**గతాసూనగతాసూంశ్చ, నానుశోచన్తి పండితాః"**

అను గీతలోని బీజశ్లోకాన్ని అన్నమయ్య ఇలా వివరిస్తున్నాడు.

**"పుట్టిన వానికి నెల్లా భువి మరణము నిత్య**
**మట్టే చచ్చినవారి కవ్వల జననము**
**పుట్టనినాఁ డైతేను పొడగాన రాదు మేను**
**కొట్టఁ గొనరాదు కొన్నాళ్ళే కాని"**

కనుక చావుపుట్టుకల నుంచి విచారింప బనిలేదని అంటాడు అన్నమయ్య

పైన "ఇతిశక్తిః, ఇతికీలకం" అని చెప్పబడిని శ్లోకం మోక్షసన్యాస యోగమనబడే 18వ అధ్యాయంలోనిది.

**సర్వధర్మా న్పరిత్యజ్య**
**మామేకం శరణం వ్రజ**
**అహం త్వా సర్వపాపేభ్యో**
**మోక్షయిష్యామి మాశుచః**

ఈ శ్లోకాన్ని అన్నమాచార్యులు వ్యాఖ్యానిస్తూ శరణాగతిని, దాని మహిమనూ ఇలా కీర్తించాడు.

హరి "సర్వపాపేభ్యో అహం త్వా యనె
గరిమ నా వాక్యమే ప్రమాణమైనట్టి గతి యొక్కటే నాకు"

అని అంటూ ఈ పాటలో "ఎన్నో జన్మల్లో చేసిన పాపాలను అన్ని జన్మలెత్తి పుణ్యంచేసి, వాటిని పోగొట్టుకోగలనా? అది అసాధ్యం. కుండల దొంతరలను ఒక్క గుదియ వేటుతో పగులగొట్టినట్లుగా, 'శరణాగతి' ద్వారా ఆ పాపాలన్నీ నశిస్తాయని అన్నమయ్య నమ్మినాడు. అందుకే శ్రీవేంకటేశ్వర శరణాగతి ప్రచారం చేశాడు.

అలాగే పెద్దతిరుమలాచార్యులు కూడ పై శ్లోకాన్ని వివరిస్తూ

**"నాఁడు 'మామేకం శరణంవ్రజ' యనుమాట**
**పోఁడిమి దిక్కుల నీ వప్పుడు చాటఁగా**
**నేఁడు నీ దాసులమై నెరవేరితిమి గాక**
**వేఁడి వేఁడి కర్మపు విధులిడనేలా"**

అని శరణాగతిని ప్రచారం చేసినాడు.

అలాగే పైన పేర్కొన్న

4) ఇతి అంగుష్ఠాభ్యాం నమః (10 ఇతి హృదయాయ నమః)

5) ఇతి తర్జనీభ్యాం నమః (11. ఇతి శిరసే స్వాహా)

6) ఇతి మధ్యమాభ్యాం నమః (12. ఇతి శిఖాయైవషట్)

7) ఇతి అనామికాభ్యాం నమః (13. ఇతి కవచాయ నమః)

అని చెప్పబడిన శ్లోకాలు గీతలో సాంఖ్యయోగ మనబడే రెండవ అధ్యాయం లోనివి. వీటినన్నిటిని అన్నమాచార్యులు ఒకేపాటలో వివరించాడు.

**"నైనం ఛిందంతి శస్త్రాణి**
**నైనం దహతి పావకః**



**నచైనం క్లేదయం త్యాపో**
**నశోషయతి మారుతః**

**అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయం**
**అక్లేద్యో ఽశోష్య ఏవచ**
**నిత్యస్సర్వగతః స్థాణుః**
**అచలోఽయం సనాతనః ।**

ఈ శ్లోకాలను అన్నమాచార్యులు చిన్న చిన్న తేటతెలుగుని మాటలతో ఎలా వ్యాఖ్యానించాడో గమనించండి!

**"దేహి నిత్యుడు దేహము లనిత్యాలు**
**యీహల నా మనసా యిది మరవకుమీ॥**

**గుదిఁ బాఁతచీర మాని కొత్త చీర గట్టినట్టు**
**ముదిమేను మాని దేహి మొగిఁగొత్త మేను మోచు**
**అదనఁ జంపఁగలేవు ఆయుధము లీతని**
**గదిసి యగ్నియు నీరు గాలియుఁ జంపంగలేవు॥**

**యీతఁడు నరకువడఁ డీతఁ దగ్నిఁగాలఁడు**
**యీతఁడు నీట మునుఁగఁ డీతఁడు గాలిఁబోఁడు**
**చేతనుఁడై సర్వగతుండౌ చెలియంచ దేమిటను**
**యీతల ననాది యీతఁడిరవు గదలఁడు॥**

**చేరి కానరానివాఁడు చింతించరానివాఁడు**
**భారపు వికారాలఁ బాసినవాఁడీ యాత్మ**
**అరయ శ్రీవేంకటేశు నాధీన మీతఁడని**
**సారము దెలియుటే సత్యం జ్ఞానము॥**

ఇలాగ అన్నమయ్య కీర్తనలో వ్యాఖ్యానించగా పెదతిరుమలాచార్యులు వ్యావహారిక వచనంలో ఇలా వివరించాడు.

"అటువంటి యీ ఆత్మను శస్త్రాలున్ను చేదింపలేవు. అగ్నిన్ని కాల్పలేవు. వుదకాలున్ను తడపలేవు. వాయువున్నూ శోషింపజాయలేదు.

చేదింపరానివాడై, తడుపరానివాడై, యెండింపరానివాఁడై నిత్యుడై సర్వ శరీరాల యందున్ను వున్నవాఁడై స్థిత స్వభావుఁడై ఆచరణుడై సనాతనుడైన వాడు.

యీ ఆత్మ ప్రపంచం గానవచ్చినట్టు వ్యక్తము గాను కానరానివాడు. అటువంటివాడు యిటువంటివాడు అని చింతింపరానివాడు. అటు గనుక వికారము లేనివాడు. అది గారణాన బట్టుండి యీ ప్రకారాన యీ ఆత్మను యెరిగి యీ ఆత్మతత్త్వము గూర్చి శోకింపదగదు"

ఇలాగ పెద తిరుమలయ్య వచన వ్యాఖ్య ఆనాటి రాయలసీమ వ్యావహారిక భాషకు దర్పణం పడుతున్నది.

పైన 8) ఇతి కనిష్ఠికాభ్యాం నమః (14 ఇతి నేత్ర త్రయా య వౌషట్)

9) ఇతి కరతలపృష్ఠాభ్యాం నమః (15 ఇతి అస్త్రాయఫట్)

చెప్పబడిన శ్లోకం విశ్వరూప సందర్శన యోగమనబడు 11వ అధ్యాయంలోని ఐదవ శ్లోకం. దీనిని తాళ్ళపాక అన్నమాచార్యులు ఇలా వ్యాఖ్యానిస్తున్నాడు.

**"పశమే పార్థ! రూపాణి**
**శతశోஉథ సహస్రశః**
**నానావిధాని దివ్యాని**
**నానావర్ణాకృతాని చ"**

దీనిని సంకీర్తనాచార్యుడైన అన్నమయ్య

**"వొక్కక్క రోమకూపాన నొగి బ్రహ్మాండకోట్లు**
**ఉక్కుమీరి ధరించుక ఉన్నాఁడవట**



**నిక్కిన నీరూపమెంతో నిన్నుఁ గనుగొనుటెట్టు**
**అక్కజపు వేదముల కగోచరుడవు"**

**యెన్నో శిరసులట! యెన్నో పాదములట!**
**యెన్నరాని చేతులట! యిట్టి నీ మూర్తి**
**కన్నులఁ జూచుట యెట్టు కడ గురుతందు కేది**
**అన్నిటా మునీంద్రులకు నలభ్యుడవు"**

మరోచోట అన్నమాచార్యులు

**"నీ యందే బ్రహ్మ మరి నీ యందే రుద్రుడు**
**నీ యందే సచరాచరమును నీ యందే యీ జగము**
**నీ చేతలే రాత్రులుఁ బగళ్ళు నీ చేతలే కాలత్రయము**
**నీ చేతలే సర్వజంతువుల నిశ్చల చైతన్యములు**

అని స్తుతి పూర్వకంగా వివరించాడు.

ఈ క్రింది కీర్తనలో వివేకమును ప్రబోధిస్తూ శ్రీవేంకటేశ్వరుని విభూతిని. ఇలా చెప్పినట్లుగానే గీతను వ్యాఖ్యానించాడు.

**లలిత**

**"అని యానతిచ్చెఁ గృష్ణుఁడర్జునునితో**
**విని యాతని భజించు వివేకమా ॥**

**భూమిలోను చొచ్చి సర్వభూతప్రాణుల నెల్ల**
**దీమసాన మోచేటి దేవుఁడ నేను**

**కామించి సస్యములు గలిగించి చంద్రుడనై**
**తేమల బండించేటి దేవుఁడ నేను"**

అంతేగాక తాళ్ళపాక అన్నమాచార్యులు భగవద్గీత విజ్ఞానయోగంలోని క్రింది శ్లోకం

**"యో యో యాం యాం తనుం భక్తః**
**శ్రద్ధయార్చితుమిచ్ఛతి**
**తస్యా తస్యాచలాం శ్రద్ధాం**
**తామేవ విదధా మ్యహమ్"**

క్రింది విధంగా భాష్యం చెపుతున్నాడు.

**"ఎంత మాత్రమున నెవ్వరు దలంచిన**
**అంత మాత్రమే నీవు**
**అంతరాంతరము లెంచి చూడ బిండంతే**
**నిప్పటి యన్నట్లు"**

నీటికొలది తామర, ఎవ్వరు ఎట్లా తలిస్తే అట్లా కనపడతానని చెప్పిన శ్రీకృష్ణుని పల్కులను అన్నమయ్య అలాగే వాఖ్యానించాడు.

శ్రీ భగవద్గీత మాదిరే, అన్నమయ్య సంకీర్తనలు కూడ వారి వారి శక్త్యానుసారం అర్థమయ్యే అగాథ క్షీరసాగరాలు.

ఇలాగ భగవద్గీత, తాళ్ళపాక కవుల వాఙ్మయంలో కూడ వ్యాఖ్యానింపబడి తెలుగువారికి అందజేయబడివుంది.

భగవద్గీత పూర్తిగా పారాయణం చేయని, చేయలేనివారు, కీలకమైన శ్లోకాల కీర్తనలు చదివినా వాటి ఫలితం వస్తుందనడంలో సందేహం లేదు. అందుకే అన్నమయ్య వాటినే తెనిగించాడు.

**అన్నమయ్య జయంతి ఉత్సవంలో "సప్తగిరి" వ్యాసం**

## 17. తిరుమల వర్ణన - అన్నమయ్య

**"వేంకటాద్రి సమం స్థానం**
**బ్రహాండే నాస్తి కించన**
**వేంకటేశ సమోదేవో**
**న భూతో న భవిష్యతి"**

బ్రహ్మాండంలో వేంకటాద్రికి సమమైన పుణ్యక్షేత్రం లేదు. అట్లే శ్రీ వేంకటేశ్వరునికి సమానమైన దేవుడు ఇటు భూతకాలంలోను లేదు అటు భవిష్యత్తులోనూ ఉండబోడు.

అలాంటి మహిమాన్వితమైన ఈ వేంకటాచల క్షేత్రంలో వివిధ యుగాలలో అంజనాద్రి, వృషభాద్రి, నీలాద్రి, శేషాద్రి, గరుడాద్రి, నారాయణాద్రి, వేంకటాద్రి అని ప్రసిద్ధి పొందిన ఏడు కొండలు నెలకొని వున్నాయి. అందులకే దీనికి ఏడుకొండలనీ, అందున్న స్వామికి ఏడుకొండలవాడనీ, సప్తగిరీశుడనీ ప్రసిద్ధి ఏర్పడింది.

ఈ తిరుమల క్షేత్రంలో పవిత్రమైన శ్రీవారి ఆలయం. శ్రీస్వామి పుష్కరిణి, శ్రీభూవరాహస్వామి ఆలయం, ఆకాశగంగ, చక్రతీర్థం, పాపవినాశనం, గోగర్భం, తుంబురుతీర్థం, కుమారధారా తీర్థం, రామకృష్ణ తీర్థం, మున్నగు అనేక దివ్యస్థలాలు పవిత్రతీర్థాలు నెలకొనివున్నాయి. ఈ కొండ సిద్ధులు సంచరించే లోయలతో, యోగులు తపస్సు చేసుకొనే గుహలతో, సెలయేళ్ళతో, పచ్చని చెట్లతో, మృగపక్షి సంతతుల శబ్దాలతో, అరుపులతో, పవిత్రతకూ, ప్రకృతి రామణీయకతకూ నిలయమై అలరారుతూ ఎల్లప్పుడూ శోభాయమానంగా ఉంటుంది.

ఇలాగ మహిమోపేతమై విరాజిల్లుతున్న తిరుమలక్షేత్రం ఎందరో మహాభక్తులచే సేవింపబడింది. ఎందరెందరో మహా కవులచే వేదాల నుండి

పదాల వరకు అనేక భాషల్లో అనేక ప్రక్రియల్లో 'తిరుమలక్షేత్రం' అనేక విధాలుగా వర్ణింపబడింది.

పదకవితా పితామహుడు, హరియవతారం అయిన తాళ్లపాక అన్నమాచార్యులు కూడ తిరుమలక్షేత్రాన్ని, అందు వెలసిన కలియుగ వైకుంఠనాథుని అనంత మహిమలను, కోటానకోటి గుణాలను 32 వేల కీర్తనల్లో అపురూపంగా వర్ణించినాడు.

అన్నమయ్య పదాల్లోని తిరుమల వర్ణనను స్థాలీపులాకంగా పరిశీలించడమే ప్రధానోద్దేశం.

**భూపాళం**

కొండా చూతము రారో కొండుక తిరుమల కొండా
కొండని యడిగిన వరము లొసఁగు మా కొండల తిమ్మయ్య కొండా॥

మేరువు మును స్తుతియింపఁగను వారిజ సంభవుఁడా
పేరు కలుగు నవరత్నంబులు బంగారము కల్పతరువూ
మేరకు మీఱఁగని నెలవున నారుగ నిడె నొకో యనఁగా
ధారుణి బ్రహ్మాండములకు నాధారంబగు మా కొండా॥

గరుడాచలంబనగా శ్రీవేంకటశైలం బనఁగా
గిరులకు నేలికెయగు ననంతగిరి దానీలగిరి యనఁగా
సిరులాయఁ జనమగు యంజన శబరియనెడి నామములా
పరగఁగ నాలుగు యుగముల వెలసిన ప్రబలంబగు మా కొండా॥

పొదలూ సొంపగు నింపుల పూఁబొదలూ వాసన నదులూ
మొదలూగల తామర కొలఁకులపై మెదలు తుమ్మెదలూ
కదలి మలయానిలు వలపుల పస కదళీ వనములనూ
మొదలుగా నెల్లప్పుడు నీ సంపదలు గల మా కొండా॥



జంతువులెల్లను మునులూ సకలమైన దేవతలూ
జంతువుల యెలుఁగులు వేదసారంబగు హరినుతులూ
చింతామణులట రాళ్లెల్లను సిరుల నెలవు లాగుహలూ
సంతత సౌభాగ్యంబుల నొప్పెడు సందడి గల మా కొండా॥

వొకచో బ్రహ్మాదులు మునులు వొకచో నింద్రాదులునూ,
వొకచో భాగవతులు యతులు శ్రుతులు వొకచోఁజంద్రార్కులు
వొకచో తీర్థంబులు గిరులును వొకచో యోగీశ్వరులూ
అకలంకత తనుఁగోరి తపము సేయనాస లెఱుఁగు మా కొండా॥

శుకములతోఁ జదువుదు రాశుక బ్రహ్మాదులు శ్రుతులూ
తకదిమ్మని యాడించు మయూరతతిని యోగీశ్వరులు
సకల పురాణంబులు విందురు మఱి పికశారికలచే మునులూ
ప్రకటితముగ నీ విద్యల నొప్పెడు భాగ్యముకల మా కొండ॥

స్వామితీర్థములకును స్వామి పుష్కరిణియునూ,
పామరులా యమరులఁజేయును పాపవినాశనమూ
తామహిఁగోరిక లిచ్చుఁగుమారధారయు పాండవసరసీ
కామిత ఫలదాయిని ఆకాశగంగయుఁగల మా కొండా॥

యిదియె క్షీరాంబుధి యనుచు మరి యిదియె ద్వారక యనుచు
యిదియె నందవ్రజ మనుచును మరి యిదిదా నయోధ్యయనుచూ
యిదియె వైకుంఠం బనుచును యిది పరతత్త్వం బనుచు
యిదియె పరమపదం బనుచు వేదములు యెన్నఁగఁగల మా కొండా॥

తలఁచిన శుకశౌనకాదులకు తలఁచిన తలఁపోసఁగినా
తలంపు లోపల నెలకొన్నా దయతో నన్నేలినా
చెలువుఁడు మా వేంకటరాయఁడు సిరుల నెలవు చేకొన్నా
కలియుగ వైకుంఠంబను నామము గలిగి వెలయు మా కొండా॥

మా తిరుమలకొండ అన్ని కొండలను పోలిన సామాన్యమైన కొండగాదు. సర్వకాల సర్వావస్థలయందును సకల వరములను ప్రసాదించగల మహిమగల కొండ ఈ కొండల కోనేటి తిమ్మప్ప కొండ! పూర్వం ఒకప్పుడు మేరు పర్వతం బ్రహ్మను ప్రార్థించిందట! అందువల్లే ఆ బంగారు కొండయొక్క పేరు కలుగునట్లుగా నవరత్నాలను కల్పవృక్షాలను ఈ కొండలో సమకూర్చినాటడ బ్రహ్మ. ఇది సమస్త బ్రహ్మాండాలకు ఆధారమయినది.

ఈ తిరుమల గరుడాచలమనీ, శ్రీ వేంకటాచలమనీ అనంత మహిమలు కలిగి సర్వపర్వతాలను పాలించునట్టి నీలగిరియనీ, సిరిసంపదలతో కూడిన అంజనాచలమనీ నాలుగు యుగాల్లో నాలుగు పేర్లతో ప్రసిద్ధి పొందింది.

ఎల్లప్పుడూ పచ్చని చెట్లతో, పూపొదరిండ్లతో, పవిత్ర పరిమళ జరులతో నిండి ఉంటుంది. ఎక్కడ చూచినా తామర కొలనులు, ఆ కొలనులపై తిరిగాడు తుమ్మెదలతో, ఫలవంతమైన అరటి తోటలతో ప్రకాశిస్తూ ఉంటుంది ఈ తిరుమల కొండ.

ఎన్నో మృగాలకు, పక్షిసతంతులకు నిలయం కూడ ఈ కొండ. మహర్షులూ, యోగులూ, దేవతలూ ఈ కొండల్లో జంతు రూపాల్లో చరిస్తుంటారు. జంతువుల, పక్షుల అరుపులే వేదసారమయిన శ్రీహరి సంకీర్తనలు. ఈ పవిత్రమైన కొండల్లోని రాళ్లన్నీ రత్నరాసులే, చింతామణులే! ఇందలి గుహలు సకల సంపదలకు నిలయం! ఈ విధంగా సంతత సౌభాగ్యలతో ప్రకాశించే కొండ ఈ తిరుమల కొండ!

ఒక చోట బ్రహ్మాదులు ఒక చోట మునులు వేరొక చోట నింద్రాదులు మరియొక చోట పరమ భాగవతోత్తములయిన ఋషులు, యోగులు, వేదములు, ఇంకొకచోట సూర్యచంద్రులు ఒకచోట సకల తీర్థములు సర్వ పర్వతములు, వేరొక చోట యోగీశ్వరులు... ఇలాగ తిరుమల కొండమీద ఎక్కడ చూచినా అకలంక చిత్తాలను కోరి తప మాచరించుచుండగా వారి కోరికలన్నీ ఈడేర్చే కొండ తిర్మలకొండ!!



శ్రీ శుకయోగీంద్రుడు, బ్రహ్మాదులకు రామచిలుకలతో కలిసి చదువుతూ ఉంటారు. పరమయోగీశ్వరులు నెమళ్లతో కలిపి 'తకధిమ్మని' నాట్యం చేస్తుంటారు. కోయిలల చేత, గోరువంకలచేత సమస్త పురాణాలను వింటూ ఉంటారు. ఇలాగ ప్రసిద్ధములైన సర్వ విద్యలకు నిలయమైన భాగ్య ప్రదమైన కొండ ఈ తిరుమలకొండ!

తిరుమల కొండలోని స్వామిపుష్కరిణి పామరులను అమరులుగా చేస్తుంది. పాపవినాశనం సకలప్రజల పాపాలను నాశనం చేస్తుంది. కోరికలను తీరుస్తుంది. ఇక కుమారధారాతీర్థం, పాండవతీర్థం (గోగర్భం), ఆకాశగంగ... మున్నగు అనేక తీర్థాలు కామిత ఫలములనెల్ల ప్రసాదిస్తూ ఉంటాయి. కావున ఈ తిరుమల కొండ కామిత ఫలదాయినిగా ప్రసిద్ధి పొందింది.

ఈ సప్తగిరి, శేషశాయి పవ్వళించే క్షీరసముద్రమనీ, గోపాలుడుండు ద్వారకయనీ, నంద గోకులమనీ, ఇదియే లోకాభిరాముడుండే అయోధ్యయనీ, ఇదియే వైకుంఠమనీ, పరమపదమనీ, సకల వేదాలు కొనియాడు తుండగా వెలసినట్టి కొండ మా కోనేటి తిమ్మయ్యకొండ అని అన్నమాచార్యులు వర్ణించినాడు!

శునశౌనకాదులు తనను స్మరించిన మాత్రం వెంటనే వారి కోరికల ప్రకారం వరములను ప్రసాదిస్తున్నదీ తిరుమల. నా హృదయంలో నిలిచి మిగుల దయతో నన్ను పాలించునట్టి సౌందర్యమూర్తి మా వేంకటరాయడు. కలియుగ వైకుంఠమను నామధేయంతో జగత్ప్రసిద్ధమై ప్రకాశిస్తున్న వేంకటాచలమే మా తిరుమల శిఖరము!!

అని అన్నమాచార్యులు తిరుమల క్షేత్రాన్ని అణువణువూ వర్ణించి అందులో పవిత్రతనూ, మహిమనూ దర్శించినాడు. అంతేకాదు. సాక్షాత్తు వైకుంఠంగా, మహిమలే తెట్టెలుగా గుంపులుగా, కనబడు కొండయనీ,

సకల వేదములే శిలలుగా వెలసిన కొండయనీ, పుణ్యరాసులే నదులుగా గల కొండయనీ, సర్వదేవతలు మృగజాతులై చరించే కొండలనీ, మహాసముద్రం నిట్ట చరులుగా కన్పట్టుచున్న కొండయనీ, అచటి వృక్షములే తపస్సంపన్నులనీ, సంపదలన్నీ గుహల్లో నిక్షిప్తమై ఉన్న కొండలనీ, సర్వశుభములకు నిలయమైన కొండలనీ, శ్రీవేంకటేశ్వరుడుండే కొండయనీ అన్నమాచార్యులు తిరుమలను పరమపావన క్షేత్రంగా అనేక పవిత్ర తీర్థాలకు నిలయంగా వర్ణించి కీర్తించినాడు. అట్లే తిరుమల శ్రీస్వామి పుష్కరిణిని అత్యంత భక్తితో వర్ణించినాడు.

పరమ భక్తాగ్రేసరుడైన అన్నమయ్య తిరుమల క్షేత్ర వర్ణనమేకాదు. ఔచిత్యమునూ, మహిమనూ, శ్రీవేంకటేశ్వరుని లీలలనూ తన పదకవితల్లో తనివితీర వర్ణించినాడు. సుప్రభాతం మొదలు ఏకాంతసేవ వరకు గల పూజాకార్యక్రమాల్లో శ్రీస్వామివారి వైభవమును గూర్చిపాడి పరమగాన ములుగా భక్తలోకానికి వినిపించాడు అన్నమయ్య. అంతే కాదు నిత్యోత్సవం, వారోత్సవం, పక్షోత్సవం, మాసోత్సవం, బ్రహ్మోత్సవం, కళ్యాణోత్సవం, రథోత్సవం, తెప్పోత్సవం, పుష్పయాగం, డోలోత్సవం మున్నగు సేవల్లో, ఉత్సవ సమయాల్లో శ్రీదేవి, భూదేవి, ఉభయ నాంచారులతో విలసిల్లుతూ భక్తకోటికి కొంగు బంగారమై దర్శనమిస్తున్న తిరుమల కోనేటిరాయని ఆర్త రక్షకత్వమును, అఖండ పరిపూర్ణత్వమును, ఆద్యంత రహితత్వమునూ ఆపదుద్ధారకత్వమునూ, సర్వదాతృత్వమునూ తాను ఆడిన ప్రతి మాటలో వర్ణించి సంకీర్తనాచార్యుడైన అన్నమాచార్యులు వాటిని అమృత కావ్యాలుగా భక్త ప్రజలకు ముదుపులుగా చెల్లించినాడు.

ఇలాగ అన్నమాచార్యులు తిరుమల క్షేత్రాన్ని, శ్రీవేంకటేశ్వరుని వైభవాన్ని వర్ణించడమే కాదు. అత్యంత భక్తి ప్రపత్తులతో ఎన్నో ఉత్సవాలు స్వయంగా చేశాడు. ఇతరులతో చేయించి తరింప చేశాడు. శ్రీవేంకటేశ్వరుని వైభవమును ఊరూరా, వాడవాడలా ప్రచారం చేసినాడు. 'వినా వేంకటేశం న నాథో న నాథః', 'సర్వం విష్ణుమయం జగత్' అన్న అభిప్రాయాలు అణువణువునా దర్శించిన ద్రష్ట తాళ్లపాక అన్నమాచార్యులు. అట్లే తాను త్రికరణ శుద్ధిగ శ్రీవేంకటేశుని నమ్మి, తెలుగువారి ఇలవేలుపు అయిన శ్రీవేంకటేశుని అపరావతారమై వెలుగొందిన పరమభక్తశిఖామణి అన్నమయ్య.



కనుకనే తెలుగువారి నోముల పంట తెలుగుతల్లి గారాల బిడ్డడైన తాళ్లపాక అన్నమాచార్యులు శ్రీ కళ్యాణలక్ష్మీ వేంకటేశ్వరుని ఆంతరంగిక భక్తుడై తిరుమల కొండను ఇలా మహిమాన్వితంగా కీర్తించినాడు.

**రామక్రియ**

**కట్టెదుర వైకుంఠము కాణాచయన కొండ।**
**తెట్టెలాయ మహిమలే తిరుమల కొండ॥**

**వేదములే శిలలై వెలసినది కొండ।**
**యే దెసఁ బుణ్యరాసులే యేరులై నది కొండ॥**
**గాదిలి బ్రహ్మాదిలోకముల కొనల కొండ।**
**శ్రీదేవు డుండేటి శేషాద్రి యీ కొండ॥**

**సర్వదేవతలు మృగజాతులై చరించే కొండ।**
**నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ।**
**వుర్వి దపసులే తరువులై నిలిచిన కొండ॥**
**పూర్వపు టంజనాద్రి యీ పొడవాటి కొండ॥**

**వరములు కొటారుగా వక్కణించి పెంచే కొండ।**
**పరగు లక్ష్మీకాంతు సోబనపు గొండ।**
**కురిసి సంపదలెల్ల గుహల నిండిన గొండ।**
**విరివైన దిదివో శ్రీవేంకటపు గొండ॥**

**(తి.తి.దేవస్థానం స్వర్ణోత్సవసంచికలో ప్రచురితం)**

# 18. అమృతవర్షం కురిసే అన్నమయ్య పదాలు

**"అదివో తాళ్లపాక అన్నమాచార్యులు**
**యిదె వీడె శ్రీవేంకటేశు నెదుట**
**వెదవెట్టి లోకములో వేదములన్నియు, మంచి**
**పదములు సేసి, పాడి పావనము సేసెను"**

భాషను ప్రధానంగా స్వీకరించి, తమ తమ సాహిత్యాల్ని అట్టడుగు ప్రజలస్థాయికి తగ్గట్లుగా రచించి, ప్రచారం చేసి వేళ్లూనుకున్న భక్తి సంప్రదాయాలు శైవ వైష్ణవాలని చెప్పవచ్చు.

క్రీస్తుశకం 11వ శతాబ్దం ఉత్తరార్థంలో తమిళదేశంలో రామానుజులు వీరవైష్ణవాన్ని, 13వ శతాబ్దంలో కన్నడదేశాన బసవేశ్వరుడు వీర శైవమతాన్ని ముమ్మరంగా ప్రచారం చేశారు. వారి వారి మత ప్రచార కోలాహలం తెలుగుభాషాసంస్కృతులపైన ఎనలేని ప్రభావం చూపింది.

ఆంధ్రదేశంలో పాల్కురికి సోమనాథాధి కవులు వీరశైవమత ప్రచారానికి ఎంతో కృషి చేశారు. ప్రధానంగా సోమన ప్రజానీకానికి సులువుగా అర్థమయ్యేవీ. ఆవేశాన్ని కలిగించేవీ, పాడుకునేదానికి అనువైనవీ, అయిన ద్విపదలల్లాడు. సీసం, తేటగీతి, ఆటవెలది... ఇత్యాది కవితలు చెప్పాడు. రగడలు, మంజరులు రాశాడు. ఇలాగ వివిధ సాహిత్య ప్రక్రియల ద్వారా సోమన్న చేస్తున్న వీరశైవ మతప్రచారం ఆంధ్రదేశంలో అప్రతిహతంగా సాగింది.

వీరశైవమత ప్రభంజనం ఉధృతంగా వీస్తున్న సమయంలో 13వ శతాబ్దంలో కవిబ్రహ్మ తిక్కన సోమయాజి, నాచన సోమనాథుని వంటి మహాకవు లుద్భవించారు. హరిహరనాథ తత్త్వాన్ని ప్రతిపాదించారు. తమ హరిహర అభేధ భావనతో కొంతవరకు వీరశైవ విశృంఖలతను అడ్డుకున్నారు.



కాని పూర్తిగా ప్రతిఘటించలేక పోయారు. ఇలాగ వీరశైవ ఝంఝూ మారుతం క్రీస్తుశకం 14వ శతాబ్దం వరకు నిర్విఘ్నంగా నిరాఘాటంగా వీచింది.

కేవలం మతదురభిమానం చెలరేగుతూ విష్ణుభక్తులు హింసల పాలవుతున్న నేపథ్యంలో రాయలసీమ నడిబొడ్డున క్రీస్తుశకం 1408న తాళ్లపాక గ్రామంలో అన్నమయ్య జన్మించాడు.

అన్నమయ్య పుట్టుకతో అద్వైతి. తనముందు జరిగిన జరుగుతున్న మత బీభత్సకాండను విన్నాడు. కన్నాడు. తనకు శివద్వేషం లేకపోయినా పరమత సహనంలేని వీరశైవులకు ప్రత్యర్థిగా ప్రతిద్వంద్విగా నిలవడానికి వైష్ణవాన్ని స్వీకరించాడు. అప్పటి నుంచి అన్నమయ్య అన్నమాచార్యులై నాడు. కేవలం మతం స్వీకరించడంతో సరిపెట్టుకోలేదు. తన జన్మస్థలానికి దగ్గరలో నున్న ప్రసిద్ధ వైష్ణవక్షేత్రం తిరుపతిని ప్రధాన కేంద్రంగా చేసుకున్నాడు. అక్కడి నుంచి శ్రీవేంకటేశ్వర భక్తి ప్రచారం ద్వారా వైష్ణవాన్ని వ్యాపింపజేయడానికి పూనుకున్నాడు అన్నమయ్య. తను ఒక్కడేకాదు. కొడుకులూ, మనుమలూ ఇత్యాదిగా వంశ పారంపర్యంగా వైష్ణవ మత వ్యాప్తికి కంకణం కట్టుకున్నాడు.

తెలుగునాట వీరశైవమతానికి తీవ్ర ప్రతిఘటన అన్నమయ్యతో ప్రారంభమయింది.

అన్నమయ్య కూడా వీరశైవకవుల మాదిరిగానే మత ప్రచారానికి సాహిత్యాన్ని ప్రచారసాధనంగా ఎన్నుకున్నాడు.

శివకవులు శివపరంగా ఎల్లాంటి స్తుతులు చేశారో, కావ్యాలు రాశారో అన్నమాచార్యులు కూడా శ్రీవేంకటేశ్వరస్వామి పరంగా అట్లాంటి స్తోత్రాలు చేశాడు. సోమనాథుడు బసవపురాణం, పండితారాధ్య చరిత్ర వంటి ద్విపదలు రాస్తే అన్నమయ్య ద్విపదరామాయణం (అలభ్యం) రాశాడు. సోమన శతకాలు రచిస్తే అన్నమయ్య కూడా శతకాలు రాశాడు.

ఇలాగ పాల్కుర్కి సోమన మతప్రచారంలో ఏ యే పోకడలు పోయినాడో అన్నమాచార్యులు వైష్ణవమత ప్రచారంలో అన్ని పోకడలూ పోయినాడు. వీరశైవులు తమ ప్రచారానికి గానఛాయ కలిగిన ద్విపదలు స్వీకరిస్తే, పై పెచ్చు అన్నమయ్య గానమే పెద్దగా పీట వేసుకున్న 'పదకవితల' ద్వారా శ్రీవైష్ణవమత ప్రచారాన్ని చేసి కృత కృత్యుడైనాడు. పదకవితాపితామహుడుగా ప్రసిద్ధి పొందాడు.

పాల్కురికి సోమనలో విష్ణుదూషణం విపరీతం. విష్ణువును కనీసం శివభక్తునిగా కూడా అంగీకరించడు. పరమతసహనం ఆవంతయినా కనిపించదు. వేదాల్లోంచి, పురాణాల్లోంచి ప్రస్తావనలు చూపి శివుడే సర్వోత్తముడుగా నిరూపిస్తాడు సోమన.

కాని అన్నమాచార్యుల పదకవితల్లో శివదూషణ ప్రత్యక్షంగా కన్పట్టదు. విష్ణుభక్తులలో, విష్ణుసేవకులలో శివుడు ఒకడని చెప్తాడు. అన్నమయ్య కూడా విష్ణువే సర్వోత్తముడని వేదాల్లోంచి, పురాణాల్లోంచి ప్రస్తావనలిస్తాడు. పదకవితల్లో అన్యమత దూషణగాని, అన్య దేవతా తిరస్కారంగాని కన్పట్టదు. అందుకే అన్నమాచార్యుల పదకవితలు మిక్కుటంగా ప్రజాదరణ పొందాయి.

పాల్కుర్కి సోమన దేశం నలుమూలలా తిరుగుతూ ఆ యా చోట్ల పల్లెటూరి ప్రజల సుద్దుల్లో నిలిచిన సాధారణ భక్తులను అసాధారణ భక్తులుగా పేర్కొని తద్వారా శైవమతం ప్రచారం చేశాడు. వాటిని వర్ణించడంలో ప్రధానంగా ద్విపదలనే స్వీకరించాడు. ఎంత ప్రచారం చేసినా ఆ మతం శైవం పుచ్చుకున్నవారికే. లింగధారణ చేసినవారికే పరిమితమై నిరంకుశంగా వున్నందున పరమత సహనం మచ్చుకయినా లేనందున ఆంధ్రదేశంలో వీరశైవం అంతగా ప్రజాదరణ పొందలేదని నిశ్చయంగా చెప్పవచ్చు.

అన్నమాచార్యులు కూడా ఆంధ్రదేశంలో పల్లెపల్లెకు, వాడ వాడకు తిరిగాడు. తెలుగునాట, తెలుగు నోట ముఖ్యంగా రాయలసీమ ప్రజల్లో



నానుతున్న నుడులనూ నానుళ్లనూ, జాతీయాలను, పలుకుబళ్లనూ, భావాలనూ నిశితంగా గమనించి వాటిని స్వీకరించాడు. ఆ ప్రజా జీవితంలో తానూ తాదాత్మ్యంచెంది అనుభవించాడు. ఆ యా సన్నివేశాల్లో లోకులు మైమరచి సహజధోరణిలో వూసులాడుకున్న సుందరమైన, సున్నితమైన, సునిశితమైన తేటతెనుగు మాటలను విన్నాడు. ఆ తెలుగు గొంతుల్లో మోగుతున్న "జాజరలు చందమామలు, కోవెల, చిలుక, తుమ్మెద. పదములు, లాలి, సువ్వి, గొబ్బి, ఉయ్యాల, లాల, జోల, జోజో, జేజే, జయజయ, విజయీభవ, శోభన, మంగళ వైభోగములు, మేలుకొలుపులు, నలుగులు, దంపుళ్లు, కొట్నాలు, కూగూగులు, గుజ్జెన గూళ్లు, చందమామ గుటకలు, నివాళులు, ఆరతులు, మంగళారతులు, జయమంగళాలు, అల్లోనేరేళ్లు, చాంగుభళాలు, బళాబళాలు, సాసముఖాలు, అవధానములు, తందనాలు, వెన్నెలలు, చిత్తమా! మనసా! బుద్ధి (సంబోధనలు)... మున్నగు కమనీయమైన గేయఫణితులలోనే అన్నమాచార్యులు మంజులమైన మధురమైన, మనోహరమైన పద కవితలను రచించాడు. యావత్ ప్రజను ఆకట్టుకొన్నాడు. ఆకర్షించుకున్నాడు. కేవలం వ్యాకరణబద్ధంగా వ్రాసినందుకే పదకవితా పితామహుడుగా పేరొందలేదు. ఆయన వాసిలో, రాసిలో ససి చక్కనైన పదకవిత లల్లినందుకే పదకవియై వరలినాడు. పదకవితలో అగ్రతాంబూలాన్ని అందుకున్నాడు.

కేవలం పదరచన చెయ్యడమే అన్నమయ్య ఉద్దేశం కాదు. ఆ పదాల ద్వారా తిరుమల వేంకటేశుని భక్తిని, తద్వారా వైష్ణవ మతాన్ని వ్యాపింపజేయాలన్నదే అన్నమయ్య పరమ లక్ష్యం. అందుకే ప్రతి పాటలో కూడా శ్రీవేంకటేశుని ఏదో విధంగా ముడిపెడతాడు. తిరుమలప్పను గూర్చి గొప్పగా వర్ణిస్తాడు.

**"కలఁడా ఇంతటి దాత కమలనాభుఁడె కాక**
**కలఁడన్న వారి పాల కలిగిన దైవము"**

అని తిరుమల శ్రీనివాసుని, కోరినవారి కల్పతరువుగా పేర్కొనినాడు అన్నమయ్య.

ఒక చోట అన్నమయ్య తిరువేంకటగిరి దేవుని గూర్చి "పట్టిన చేతి బంగారమనీ, ముట్టి కొలిచినవారి ముందుజీతమని, సేవ చేసినవారి చేతిలో మాణిక్యమనీ, భావించువారి పరబ్రహ్మమనీ, బత్తి చేసినవారి భవరోగ వైద్యుడనీ, హత్తి నుతించినవారి ఆనంద రూపుడనీ. ఆపన్నులపాలిటి దైవమనీ" ప్రచారం చేశాడు. ఈ తిరుమల హరిని కొలువని కొలువులు అడవి గాచిన వెన్నెలలనీ, ఈ అచ్యుతుని గూర్చి వినని కథలు భువిలో గజ స్నానాలనీ, వైకుంఠుని పొగడని ప్రార్థనలు బూడిదలో పోసిన పన్నీరులనీ, సర్వదాత అయిన కమలోదరుని కోరని కోరికలు అందని మానిపండ్లనీ, తిరుమలేశుని గూర్చి తెలియని 'తెలివి' ఏదైతే వుందో అది నట్ట నడియేటి పైరులనీ, వక్కాణిస్తూ అన్నమయ్య కోనేటిరాయని పరమభక్తుడై వేంకటపతిమీద వింత వింతలుగ ముప్పది రెండువేల సంకీర్తనలను పాడినాడు. ప్రచారం చేసినాడు.

అన్నమయ్య తన మతప్రచారోద్యమంలో అహోబల నారసింహుని, కప్పురపు నవ్వుల కడపరాయడైన వేంకటేశుని, శ్రీరంగనాథుని, పాండురంగ విఠలుని, మాడుపూరు మాధవుని, మార్కాపురం చెన్న కేశవుని, మంగాపురం హనుమంతుని, కదిరి నృసింహుని, ఒంటిమిట్ట రఘురాముని, వాయిల్‌పాడు రాముని, వెలుగోటి చెన్నుని... ఇలాగ మహావైష్ణవ పుణ్యక్షేత్రాల నుండి మారుమూల పల్లెల దాకా ఆ యా ప్రజలు అక్కడ పూజించే దేవుళ్లను తానూ పూజించాడు. ఆ దేవుళ్లందరినీ తిరుమల వేంకటేశునితో అభేదం కల్పించి పదాలు రచించాడు. అందుకే ఒక చోట అన్నమయ్య

**"ఎవ్వరి గొలిచిననేమి గొరత, మరి**
**యెవ్వరి దలచిన నేమి?**



**అవ్వలివ్వల శ్రీహరి రూపుగాని వా**
**రెవ్వరు లేరని యెరుక దోచిన జాలు"**

అని ప్రజలందరి పూజలు శ్రీవేంకటేశునికే చెందుతాయనీ చెప్పాడు అంతేకాదు.

శ్రీ వేంకటేశ్వర భక్తి ప్రచారంతో పాటు లోక కల్యాణానికి కూడా పాటు పడ్డాడు అన్నమాచార్యులు. తన లక్ష్య సాధనలో చెడును తెంచుకుంటూ, మంచిని పెంచుకుంటూ పురోగమించిన గొప్ప ఆధ్యాత్మిక తత్త్వవేత్త అన్నమయ్య. అందువల్లే అన్నమాచార్యుల పదాలు "హరి కరుణా సారంబులే గాక, దుర్గుణ గణభంజనములు"గా ప్రసిద్ధి కెక్కాయి.

తన బహుదేశ సంచారంలో అన్నమయ్య ఆడంబరంతో, అహంకార గర్వాలతో విర్రవీగుతున్న మానవులను చూచి

**"నానాటి బదుకు నాటకము**
**నట్టనడిమి పని నాటకము"**

అని ప్రబోధిస్తాడు అలాగే నిరంతర స్త్రీ లోలులను

**"అలరి యింతుల యధరామృతము లివి యెల్ల**
**కాలకూటవిషముల కరణి సుండి**
**శీలముతో వీరల చెట్టలు వట్టుట లెల్లా**
**బాల నాగాల దొడికి పట్టుట సుండి"**

అని హెచ్చరిస్తాడు.

సంసార జంజాటంలో మునిగి వున్న పామరులను గూర్చి అన్నమయ్య.

**"నీరు లోపలి మీను నిగిడి యామిషముకై**
**కోరి గాలము మ్రింగి కూలబడినట్లు"**

నశిస్తారని అభిప్రాయం వెలిబుచ్చాడు. ఇదే భావాన్ని అభ్యుదయ కవి వేమనకూడ

**"నీళ్లలోని చేప నెరిమాంస మాశకు**
**గాలమందు చిక్కి కూలినట్లు**
**ఆశబుట్టి మనుజుడారీతి చెడిపోవు**
**విశ్వదాభిరామ వినురవేమ"**

అని స్పష్టం చేశాడు.

అభ్యుదయ మానవతావాదియైన అన్నమయ్య తన పదకవితల్లో కులమత భేదాలను కులసంకుచితత్వాన్ని, అస్పృశ్యతను తీవ్రంగా నిరసించాడు.

**"విజాతు లిన్నియు వృథా వృథా**
**అజా మిళాదుల కది యే జాతి"**

అని అంటూ

**"జాతి భేదములు శరీర గుణము**
**జాతి శరీరము సరి దోడనె చెడు"**

అని వ్యాఖ్యానించాడు మరోచోట

**"ఏ కులజుడేమి? ఎవ్వడైన నేమి?**
**ఆకడ నాతడే హరి నెరిగినవాడు"**

**"ఎక్కువ కులజుడైన హీన కులజుడైన**
**నిక్క మెరిగిన మహానిత్యుడే ఘనుడు"**

అని హరి నెరిగిన వాణ్ణే హెచ్చైన కులజునిగా తీర్మానిస్తాడు అన్నమాచార్యులు

ఈ మహనీయుడు కులగోత్రాలను కుండ బద్దలు గొట్టినంత తీవ్రంగా ఇలా ఖండించాడు.



**"మల మూత్రంబుల మాంసపు ముద్దకు**
**కుల గోత్రంబుల గుతి గలిగె**
**తొలులు తొమ్మిదగు తోలు తిత్తికిని**
**పిలువగా పేరును పెంపును గలిగె"**

అని చెపుతూ, ఇంకా

**"యోని జనకమగు యొడలిది**
**యే నెలవైనా నేటి కులము**
**తానును మలమూత్రపు జెలమ**
**నానాచారము నడచీనా"**

అని కులమదాంధులకు గట్టి చురక అంటించాడు.

చివరగా అన్నమాచార్యులు

**"బ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటె పర**
**బ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటె**
**కందువగు హీనాధికము లిందు లేవు**
**అందరికీ శ్రీహరే అంతరాత్మ"**

అని భాష్యం చెపుతూ, అందరూ శ్రీవేంకటేశ్వరుని స్వరూపులే అని వివరించాడు.

**"నా నాలికపై నుండి నానా సంకీర్తనలు**
**పూని నాచే నిన్ను పొగడించితివి**
**వేనామాల వెన్నుడా వినుతించ నెంతవాడ**
**కానిమ్మని నాకీ పుణ్యము గట్టితి వింతేయయ్యా"**

అని భక్తితో స్మరిస్తూ సర్వజనామోదకంగా, సర్వజనాహ్లాదంగా శ్రీవేంకటేశ్వర పదకవితాయజ్ఞాన్ని సాగించి 32 వేల పదకవితలను వ్రాశాడు. ఆ సంకీర్తన పుష్పాలకు

**"దాచుకో నీ పాదాలకు తగ**
**నే చేసిన పూజలివి"**

అని తిరుమల వేంకటనాధునికే అంకితం జేసి 1503 ఫాల్గుణ బహుళ ద్వాదశి నాడు తన తొంబదియైదవ ఏట శ్రీవేంకటేశ్వరుని పరమ పదం జేరుకున్నాడు అన్నమాచార్యులు.

అన్నమయ్య రచించిన పదాలు కులమత విచక్షణ లేకుండా తెలుగువారి వేదాలుగా పరిఢవిల్లాయి. ఆ పాటలు రతనాల బాటలుగా విలసిల్లాయి. ఆయన మాటలు ముత్యాల మూటలై వరలినాయి. ఆ కీర్తనలు తెలుగుతల్లి శృంగార నర్తనలుగా రూపుదిద్దుకున్నాయి. ఆ కవితలు తిరుమల శ్రీవేంకటేశ్వరుని దరహాస చంద్రికలను వర్ణించే సాహితీపతాకలుగా రెపరెప లాడుతున్నాయి.

**"ఆంధ్రజ్యోతి" దినపత్రికలో ప్రచురితం**

# 19. అన్నమయ్య దర్శించిన - పుణ్యక్షేత్రాలు

**అదివో అల్లదివో హరివాసము!**
**పదివేల శేషుల పడగల మయము!!**

అని తిరుమల క్షేత్ర ప్రశస్తినీ, మహిమను తెలియజేసే ఈ కమ్మని తెలుగు పాట తాళ్ళపాక అన్నమాచార్యులు మొట్టమొదట తాను దర్శించిన వేంకటాచలక్షేత్రాన్ని గూర్చి ఆర్తితో, ఆనందంతో తన్మయించి పాడినట్టిది.

'తిరువేంకటగిరి రాయని సంతర్పణమే' మా సంధ్య. అని చాటుకుని అన్నమయ్య శ్రీవేంకటేశుని ఆలయకవిగా, అంతరంగిక భక్తునిగా విలసిల్లినాడు. ఆ ఆనంద నిలయుని కరుణా కటాక్ష వీక్షణాలను సంపూర్తిగా పొంది అనుభవించినాడు. తాను ఒక్కడు మాత్రమే కాదు. తన కుటుంబమూ, తను తరువాతి ఏడు తరాల సంతతికీ ఆ దేవదేవుని కరుణాభాగ్యం కలిగేటట్లు చేశాడు అన్నమాచార్యులు. అయినా ఆ పరమ భక్తునికి తృప్తి అనేది ఏమాత్రం కలగలేదు. ఆ కొండలలో నెలకొన్న కోనేటిరాయని కృపను కేవలం తానూ, తన కుటుంబ సభ్యులు మాత్రమే పొందకూడదు. ఆ ఘన వేంకటేశుని అనుగ్రహాన్ని తెలుగు ప్రజ యావత్తూ పొందాలి. అదే ఈ తెలుగు ఆళ్వారుని ఆరాటం, పరమాశయం కూడా. కనుకనే సపరివారంగా శ్రీవేంకటేశ్వర భక్తి ప్రచారోద్యమానికి కంకణం కట్టుకున్నాడు. ఆ దీక్ష దేవుడు మెచ్చునట్లుగా లోకం మెచ్చునట్లుగా త్రికరణ శుద్ధిగా సాగుతుందని శ్రీస్వామివారి ఆదేశం అయింది. తాళ్ళపాకను విడిచి తిరుమలేశుని పంచన చేరిన అన్నమయ్య తాను పూనిన ఈ మహాకార్యానికై మళ్ళీ ఆనందనిలయుని వీడలేక వీడలేక తిరుమలకొండ దిగినాడు. తెలుగునాట కనపడిన ఊరూ, వాడా తిరిగాడు. ఆ యా ఊళ్ళలోని దేవుళ్ళను వేనోళ్ళ కీర్తించాడు. ఒక్క తెలుగునాడే కాదు. దక్షిణాదిన ఎన్నోవైష్ణవ క్షేత్రాలు దర్శించాడు. అందలి మూర్తులను సేవించినాడు. అన్నమాచార్యులు తాను సంచరించిన పుణ్యప్రదేశాల్లోని

వేల్పులను తిరుమలవేంకటేశ్వరునితో అభేదాన్ని పాటించి ఆనంద పారవశ్యంతో సంకీర్తన చేశాడు.

మొట్టమొదట అన్నమాచార్యులు వటపత్రశాయి అయిన రూపమిట్టిదని కొలువై పొడచూవుతూ దిగువ తిరుపతిలో అందంగా పవ్వళించిన గోవిందరాజస్వామిని దర్శించి.

**"కొలిచితే రక్షించే గోవిందుఁడీతడు**
**ఇలకు, లక్ష్మికి మగఁడీ గోవిందుఁడు"**

అని కీర్తించినాడు. ఆ తిరుపతిలోనే దర్శనమొసగుచున్న శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేతుడైన ఇష్టార్థ రాముణ్ని సేవించి కొనియాడినాడు తదుపరి తిరుమలకు వేళ్ళేదారిలో దాసులను తప్పక కాచేనని అమర అభయమిచ్చుచున్న దిగువ పట్టణంలోని దేవ హనుమంతుణ్ని కూడ అన్నమాచార్యులు కీర్తించినాడు. తరువాత





**"అనిశము దలఁచరో అహోబలం**
**అనంత ఫలదం బహోబలం"**

అని అహోబలక్షేత్ర ప్రాశస్త్యాన్ని కీర్తిస్తూ

'అదివో చూడరో ఆదిమ పురుషుని' అంటూ 'పెద యౌభళము మీద పెను సింహము'ను కొనియాడతూ, బ్రహ్మాదులు, వేదాంతతతులు వెదకి కానగలేని ఆ ఘనసింహమును ప్రత్యక్షంగా దర్శించి వర్ణించినాడు. అన్నమాచార్యులు. అంతేకాదు. ఈ అహోబలంలో అన్నమయ్య తన శాస్త్రాధ్యయనాన్ని కొంతకాలం సాగించాడు. ఆ కాలంలో తాళ్ళపాక కవుల విష్ణుభక్తి తత్పరతకూ, వైష్ణవ మత ప్రచారానికీ తిరుమల వలనే అహోబలక్షేత్రం కూడా ప్రధాన కేంద్రంగా భాసిల్లింది.

అన్నమయ్య పావనపినాకినీ తటంలో వెలసిన కప్పురపు నవ్వుల కడపరాయడైన వేంకటేశుణ్ణి జగదేక సుందరునిగా తీర్చిదిద్ది, ఆయన మితిలేని శృంగార లీలలను వర్ణించిన తీరు కడు హృద్యం. "ఫాలలోచనుడై భయదోగ్రముఖము గలిగి సకలాయుధములు సహస్ర భుజములతో కంభమున వెడలిన కదిరీ నృసింహుడు! దుష్టుల భంజించె నిదివో!" అని చెప్పుతూ ఆయనను విదితముగా సేవించరో అని అన్నమయ్య కదిరీ నృసింహుణ్ణి కీర్తించినాడు.

విందువలె పరదైవముగా దర్శనమొసగుచున్న ఒంటిమిట్ట వీరరఘు రాముణ్ణి కూడా ఈ పదకవితా పితామహుడు దర్శించి కొనియాడిన తీరు కడు రమణీయం. పట్టపు వేంకటేశునకు నమ్మినబంటు అయి, పదియారు వన్నెల బంగారు కాంతుల తోడ పొదలిన కలశాపుర హనుమంతుణ్ణి పవిత్ర ద్వాదశ నామాలతో అన్నమాచార్యులు స్తుతించినాడు. అన్నమయ్య తన వేంకటేశ్వర భక్తి ప్రచారోద్యమంలో గుత్తి దర్శించినప్పుడు అచట వెలసిన సౌమిత్రీ సహోదరుడైన దశరథ రాముణ్ణి గూర్చి వీనులవిందుగా గానం చేశాడు.

ఎక్కడ ఎదురు లేక ఈరేడు లోకములందు ఒక్కడే నిలిచిన విజయనగర ఉగ్రహనుమంతుణ్ణి పుత్ర కామేష్టియందు పరమాన్నమున పరగ జన్మించి, లంక సాధించి యవని భారము దించి, పరబ్రహ్మమై వెలుగొందిన విజయనగర రాముణ్ణి, అన్నమాచార్యులు దర్శించి కీర్తించినాడు వేదాద్రి నారసింహుణ్ణి సేవించాడు.

దక్షిణాదిన వైష్ణవక్షేత్రాల్లో ముఖ్యమైనది శ్రీరంగం. శేషశాయి అయిన శ్రీ రంగనాథుడు చిన్ని శిశువుగా దర్శనమొసగి అన్నమయ్యచే 'మఱ్రాకు తొట్టి'లో జోల పాడించుకొన్నాడు. మూడు మూరుతులకెల్ల మూలమై పెక్కు మహిమలతో పవిత్ర చంద్రభాగానదీ తీరాన వెలసి 'పరగ నేడునూట డెబ్బది ఏడుగురుచేత నిరవై పాడించుకొన్న' పాండురంగ విఠలుణ్ణి దర్శించి, కీర్తించి ధన్యుడైనాడు అన్నమయ్య.

కేవలం ప్రసిద్ధ క్షేత్రాలే కాదు, మారుమూల పల్లెలు కూడ తన భక్తి సాహిత్య ప్రచారానికి ఆటపట్టులుగా చేసుకొన్నాడు. అన్నమాచార్యులు ఆ పల్లెల్లో వెలసిన దేవతామూర్తులందరిలోనూ, తన పరదైవమైన వేంకటేశుణ్ణి దర్శించి కీర్తించిన ధన్యజీవి అన్నమాచార్యులు.

అన్నమయ్య వెలుగోటి చెన్నకేశవున్ని వేడుకున్నాడు. 'అందపు వేంకటేశుడు కోన చెన్నుడై వెలయగా' కోరిన వరాలు పొందాడు. ఇంతులతో విహరిస్తున్న చుక్కలూరి చెన్నునితో, పేలకురితి చెన్నునితో అన్నమయ్య శృంగారలీల నెరపినాడు. చెలువపు సింగారాల శ్రీరామచంద్రుని దాసరిపల్లెలో దర్శించినాడు.

'నల్లబల్లి చెన్నుడు నా పాలిటి వెన్నుడు'

అని నల్లబల్లి చెన్న కేశవున్ని ప్రసన్నం చేసుకున్నాడు. అట్లే ముడియం నారసింహుణ్ణి, సంబటూరి చెన్నుని, ఉదయగిరి ముద్దుకృష్ణుణ్ణి, మాడుపూరు మాధవుణ్ణి, మంగాంబుభి హనుమంతుణ్ణి, ఒగు నూతుల నారసింహుణ్ణి దర్శించి కీర్తించినాడు.



'దీన రక్షకు డఖిలవినుతుడు రాముడూ, హరుని తారక బ్రహ్మమంత్రమై యమరిన యర్థము రాముడు' అని వావిలిపాటి వీరవిజయుడైన రాముణ్ణి కూడా అన్నమాచార్యులు కొనియాడినాడు. మార్కాపురం చెన్నకేశవుణ్ణి మహిమాన్వితునిగా కీర్తించినాడు.

ఇలా పరమభక్తాగ్రేసరుడైన అన్నమయ్య ఏ పుణ్యతీర్థాన్ని సేవించినా, ఏ దేవుణ్ని దర్శించినా అక్కడ అందులో ఆయనకు తిరుమలేశుని రూపే గోచరించేది. అందువల్లే ఆ సంకీర్తనాచార్యుడు తాను దర్శించిన క్షేత్రాధినాథులను శ్రీ తిరుమల వేంకటేశ్వరునికి ప్రతిబింబాలుగా సృష్టించి కీర్తించినాడు. అన్నమయ్య దృష్టిలో తిరుమల కోనేటి దండనున్న వెంకటపతికీ, ఆ దేవుళ్ళకు అభేదం. అంటే తిరుమల వేంకటేశ్వరుడు మూలవిరాట్టు కాగా ఇతర క్షేత్రాల్లోని దేవతామూర్తులు ఆ వేంకటేశ్వరుని ఉత్సవమూర్తులని అన్నమయ్య పవిత్రభావం కనుకనే అన్నమయ్య.

**"ఎవ్వరి గొలిచిన నేమి గొరత, మరి**
**ఎవ్వరి దలచిన నేమి**
**అవ్వలివ్వల శ్రీహరి రూపుగానివా**
**రెవ్వరు లేరని యెరుక దోచిన జాలు"**

అని అంటూ తన సంకీర్తనయజ్ఞాన్ని నిరాఘాటంగా సాగించాడు. ఇలా ఆ బాలగోపాలంలో వేంకటేశ్వరభక్తి వికాసాన్ని కలిగించి దేశాన్ని భక్తి సుసంపన్న చేసిన చైతన్యమూర్తి తాళ్ళపాక అన్నమాచార్యులు. ఈ భక్తి సాహిత్య విహాయసంలో ఆయన ఒక ధ్రువతార!

**("ఆంధ్రప్రభ" దినపత్రికలో ప్రచురితం)**

# 20. ఆపన్నులపాలి దైవం

తాళ్లపాక అన్నమాచార్యులు కొండల కోనేటి రాయని పరమభక్తుడు. వింత వింతలుగా 32వేల సంకీర్తనల్లో వేనామాల వెన్నుని అనంత మహిమలను చాటినాడు. కోటాన కోటి గుణాలను అపురూపంగా వర్ణించాడు. శ్రీ వేంకటేశుని మహిమలను ఎన్నివిధాలుగా చాటినా, ఎన్నిగుణాలను వక్కాణించినా, ఆ అన్నింటి సారాన్ని ఒక్క సంకీర్తనల్లో హరి నందకాంశ సంభూతుడైన అన్నమయ్య అనుభవ పూర్వకంగా ఆనంద దాయకంగా ఇలా స్పష్టీకరించాడు.

**ఆపన్నులపాలి దైవ మాతఁడే గతి దక్క**
**యే ప్రొద్దును భజియించఁగ నితరుఁడు మరికలఁడా ॥పల్లవి॥**

**నిరుపాధిక నిజబందుడు నిరతిశయానందుడు**
**కరివరదు డితఁడేకాక ఘనుదధికుడు గలడా ॥ ॥ఆ పన్నుల॥**

**సంతత గుణ సంపన్నుడు సాధులకుఁ బ్రసన్నుఁడు**
**అంతర్యా మితఁడేకాక అధికుఁడు మరి కలఁడా ।**
**పరమాత్ముఁడు పరమపురుషుండు పరికింపఁగ కృపాలుఁడు**
**తిరువేంకట విభుఁడేకాక దేవుఁడు మరి కలఁడా ॥ ॥ఆ పన్నుల॥**

వైకుంఠవాసుడు ఆపన్నులపాలిటి కొంగుబంగారం. వారికి ఆయనే గతి దిక్కుకూడా. అందరూ అన్నివేళల్లో స్మరించి పూజింపగల దేవుడు ఇంకొకడు లేడు!

తిరువేంకట విభుడు కారణం లేని ఆత్మబంధువు! నిరతిశయానంద మూర్తి! కరిరాజ వరదుడు. ఇట్టి ఘనుడు ఇంకొకడు ఉన్నాడా!

ఘన వేంకటేశుడు సమస్త కల్యాణ గుణాభిరాముడు. సత్పురుషులకు ప్రసన్నుడు! సర్వాంతర్యామి! ఇతన్ని మించిన అధికుడింకొకడు కలడా!





పరమాత్ముడు, పరమపురుషుడు, శరణంటే కరుణించే కృపాలుడు తిరువేంకట విభుడే! మరి యొక్కడు ఇలలో లేడు.

శ్రీవేంకటేశ్వరుని మూలతత్త్వం ఈ పాటలో వ్యక్త పరచబడింది. చిన్న చిన్న మాటల్లో కలియుగ వైకుంఠుని ఆర్త రక్షకత్వమూ, ఆపదుద్ధారకత్వమూ, ఆద్యంతరహితత్వమూ, అఖండ పరిపూర్ణత్వమూ సర్వదాతృత్వమూ, పురుషోత్తమత్వమూ, విశ్వాత్మకత్వమూ, విశ్లేషించి చూపడం జరిగింది. అదే ఈ కీర్తనలోని విశిష్టత. ఈ పాట సారభూతమైంది.

**"ఆంధ్రప్రభ" వారపత్రికలో ప్రచురితం**

# 21. శ్రీలక్ష్మీనృసింహావతార వైభవము

**ముఖారి**

నరులార నేఁడువో నారసింహజయంతి
సురలకు నానందమై శుభము లొసఁగెను ॥పల్లవి॥

సందించి వైశాఖ శుద్ధచతుర్దశి శనివార[1]-
మందు సంధ్యాకాలమున నౌభళేశుఁడు
పొందుగాఁ గంభములోనఁ బొడమి కడపమీఁద
కందువ గోళ్లఁ జించెఁ గనకకశిపుని ॥నరు॥

నరమృగరూపము నానాహస్తముల
అరిది శంఖచక్రాది ఆయుధాలతో
గరిమఁ బ్రహ్లాదునిఁ గాచి రక్షించి నిలిచె
గురుతర బ్రహ్మాండగుహలోనను ॥నరు॥

కాంచనపుగద్దెమీఁద గక్కనఁగొలువై యుండి
మించుగ నిందిరఁదొడమీఁదఁ బెట్టుక
అంచె శ్రీవేంకటగిరినాదిమపురుషుండై
వంచనసేయక మంచివరాలిచ్చీ నదివో ॥నరు॥

**(సంపు-11. భాగ-1. సంకీ-14)**

'నరసింహజయంతి' ని గూర్చిన పైపాట తాళ్ళపాక అన్నమాచార్యులు రచించినది. శ్రీనారసింహజయంతి వైశాఖమాసం శుద్ధచతుర్దశినాడు అనాదినుంచీ జరుపబడుతున్నది. అనగా ఆనాడు శ్రీమహావిష్ణువు బెదురుగొలుపు 'మానిసి మెకము' గా రూపుదాల్చి కసిగా కనకకశిపుని

1. ఈ శనివార విషయం భాగవత విష్ణుపురాణాదుల పరిశీలించి చెప్పవలసియున్నది.



పొట్టచీల్చి పొట్టనబెట్టుకొన్న రోజన్నమాట. ఈ నృసింహావతారం దశావతారాల వరుసక్రమంలో నాలుగవదిగా పేర్కొనబడింది.

**మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః ।**
**రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కి రేవ చ ॥**

ప్రాచీన భారతీయవాఙ్మయంలో నరసింహావతారవృత్తాంతాన్ని గూర్చి పరిశోధించినట్టయితే పలుతావుల ఎన్నోఘట్టాలు మనకు గోచరిస్తాయి. తెలుగుసాహిత్యంలో చూచినట్లైతే అద్వితీయ ప్రబంధమైన 'నృసింహపురాణం' లక్ష్మీనృసింహావతారావిర్భవాన్ని గూర్చి విపులంగా వివరిస్తుంది. ఈ కమనీయకావ్యం కవిత్రయంలో ఒకరైన ఎఱ్ఱాప్రెగ్గడచే రచింపబడింది. భారతభాగవతాది మహాగ్రంథాల్లో దశావతారవర్ణనా సమయంలో ఈ నృసింహావతారమూర్తి చక్కగా వర్ణింపబడివుండటం విజ్ఞులెరిగినదే.

ఇక శతకవాఙ్మయంలో సరేసరి. ధర్మపురి నరసింహాశతకము[1]. సింహాద్రినారసింహాశతకము[2], తరిగొండ నృసింహాశతకము[3] మున్నగు నవెన్నో వెలిశాయి. జానపదవాఙ్మయంలోని పెక్కు గేయాల్లో, యక్షగానాల్లో నృసింహుడు 'నరహరి'గా, ఆయనదేవేరి 'చెంచులక్ష్మి' గా తెలుగునాట తేనెలూర వేనోళ్ల కీర్తింపబడినారు. ఇలా ఎన్నో ఉదాహరణలు.

సారస్వతంలోనేకాక చిత్రలేఖనం, శిల్పంవంటి తదితర లలిత కళల్లో సయితం నరసింహావతార రూపచిత్రణ నిండుగా కన్నులపండువుగా విస్తరించి ఉంది. శ్రీ లక్ష్మీనృసింహస్వామి ఆంధ్రావళికి అభీష్టాలనొసగే ఆరాధ్యదైవమని వక్కాణించవచ్చు. అందుకనేనేమో అహోబిలం, యాదగిరి, సింహాచలం, మంగళగిరి, కదిరి, కంభం వేదాద్రి, తరిగొండ మున్నగు ప్రసిద్ధ లక్ష్మీనృసింహక్షేత్రాలన్నీ ఆంధ్రదేశంలో నెలకొనివున్నాయి.

1. శేషప్పకవి కృతము, 2. గోగులపాటి కూర్మనాథకవి ప్రణీతము,
3. తరిగొండ వెంగమాంబ కృతము.

శ్రీ వేంకటేశ్వరుని అంతరంగిక భక్తుడూ. పదకవితాపితామహుడూ అయిన తాళ్ళపాక అన్నమయ్య, తన 'సంకీర్తనలహరి'లో శ్రీనృసింహుని దివ్యస్వరూపాన్ని, అవతార కథాంశాలను.

శ్రీరాముడు, హనుమంతుడు, కృష్ణుడూ ఇత్యాదిగా ఎందరో దేవుళ్ల మాదిరిగానే ఈ సంకీర్తనాచార్యునిపదాల్లో శ్రీనృసింహస్వామి సయితం చక్కగా చోటు చేసికొని ఉన్నాడు. అందువల్ల అన్నమాచార్యులకు లక్ష్మీనృసింహునిపైగల భక్తిప్రపత్తులు లోకానికి ప్రస్ఫుటమవుతున్నాయి. శ్రీ అహోబిలమఠం పీఠాధిపతి అయిన శ్రీఆదివన్‌శఠగోప యతీంద్రులు అన్నమయ్యకు శ్రీవైష్ణవ దీక్షను ప్రసాదించడమే మంత్రాన్ని ఉపదేశించాడట. వీరికి సాక్షాత్తు నరసింహుడే గురువై త్రిదండాన్ని, నారసింహచక్రాది మంత్రాలను ప్రత్యక్షంగా అనుగ్రహించినట్లు:

**"పరమేశుఁడగు నహోబిలనృసింహుండు**
**గురుభావమునఁ జేకొని త్రిదండంబు**
**నా నరసింహు చక్రాది మంత్రములు**
**తానె ప్రత్యక్షంబు దయసేయఁగొనుచు"**

అనే ద్విపదపంక్తుల్లో పేర్కొనబడింది. అంతేకాదు అన్నమయ్య అహోబిలంలోకూడ కొంతకాలంపాటు నివసించాడు. సకలవేదాంత శాస్త్రాలను అక్కడనే అధ్యయనంచేశాడు. ఆ కాలంలో తాళ్లపాక కవులవిష్ణుభక్తితత్పరతకూ, వైష్ణవమతప్రచారానికీ తిరుపతివలెనే అహోబిలక్షేత్రంకూడా ప్రధానకేంద్రంగా భాసిల్లింది. కనుకనే అహోబిలంలోకూడ వారిరచనలు చెక్కినరాగిరేకులు కొన్ని లభ్యమైనాయి.

''వరకవితాగుణచతురుడైన'' అన్నమాచార్యుడు హరిభక్తి విభావనములైన తన సంకీర్తనల్లో శ్రీనరసింహావతారకథాఘట్టాలను 'నరసింహవిజయము' గా పదకొండు చరణముల పెద్దపాటలో ఈ క్రింది రీతిని వీనులవిందుగా గానం చేశినాడు.



**నాట**

వినరయ్య నరసింహవిజయము జనులాల
అనిశము సంపదలు నాయువు నొసఁగును ॥పల్లవి॥

మొదలఁ గొలువుకూటమున నుండి కశిపుదు
చదివించెఁ బ్రహ్లాదుని శాస్త్రములు
అదన నాతఁడు నారాయణుఁడే దైవమనె
అదిరిపడి దైత్యుఁడు ఆతనిఁ జూపుమనె ॥విన॥

అంతటఁ బ్రహ్లాదుఁడు అన్నిటా నున్నాఁడనియె
పంతమున దానవుఁడు బాలునిఁ జూచి
యెంతయుఁ గడకతోడ ఇందులోఁ జూపుమని
చెంతనున్న కంబము చేతఁగొని వేసె ॥విన॥

అఁటమీఁదట బ్రహ్మాండం బదరుచు
కుటిల భయంకర ఘోషముతో
చిట చిట చిటమని పెట పెట పెటమని
పట పట మనుచును బగిలెఁ గంబము ॥విన॥

కులగిరు లదరెను కుంభిని వడఁకెను
తలఁకిరి దైత్యులు తల్లడిలి
కలఁగెను జగములు కంపించె జగములు
ప్రళయకాలగతిఁ బాటిల్లెనపుడు ॥విన॥

ఘననారసింహుఁడదె కంబమునందు వెడలె
కనుపట్టె నదిగొ చక్రజ్వాలలు
మునుకొని వెడలెఁ గార్ముకముక్తశరములు
కనకకశిపునకుఁ గలఁగె గుండియలు ॥విన॥



అదరె నద్దేవుని కోపాగ్నులు బెడిదపు
మిడుఁగురులతోడుత మిన్నులు ముట్టె
పిడుగులు రాలేటి భీకరనఖరములు
గడుసురక్కసునికి గాలములై తగిలె ॥విన॥

తొడికిపట్టి విష్ణుఁడు తొడమీఁద నిడుకొని
కడుపు చించెను వాని గర్వమడఁగ
వెడలెఁ జిల్లున వాని వేఁడినెత్తురు నింగికి
పొడి పొడి యాయ శత్రుభూషణములెల్లను ॥విన॥



నెళ నెళన విరిచె నిక్కి వాని యెముకలు
పెళ పెళ నారిచి పెచ్చు పెరిగె హరి
జళిపించి పేగులు జంద్యాలుగా వేసుకొనె
తళుకుఁగోరలు తళ తళమని మెరచె ॥విన॥

పెటలించె నరములు పెరికి కుప్పలు వేసి
గుట గుటమని రొప్పె గోవిందుఁడు
చిటిలించి కండలు చెక్కలువారఁ జెండి
కుటిలదానవుఁ జూచి ఖోయని యార్చెను ॥విన॥

తెంచి శిరోజములు దిక్కులకు వాని
పంచప్రాణములు గొనెఁ బరమాత్ముఁడు
అంచెల నీరీతిని ప్రహ్లాదునిపగ నీఁగె
మించి దేవతలు మితిమీతి జయవెట్టిరి ॥విన॥

అప్పుడిందిరా దేవి యంకమునఁ గూచుండె
వొప్పుగ శాంతమందె నహోబలేశుఁడు
తప్పక కోనేటిదండఁ దానై యిందును నందు
చిప్పిల వరము లిచ్చీ శ్రీవేంకటేశుఁడు ॥విన॥

ఈ 'నరసింహ విజయకథ'ను తనివితీర విని నిత్యమూ, సంపదలను ఆయురారోగ్యములను పొందవలసినదిగా ప్రజానీకాన్ని అన్నమయ్య పల్లవిలో ప్రబోధిస్తున్నాడు.

ఒకానొకరోజు హిరణ్యకశిపుడు కొలువుతీర్చివుండడం చక్కగా చదివించిన ప్రహ్లాదుని పరీక్షచెయ్యడం, ఆ బాలకుడు నారాయణుడే ఏకైకదైవమనడం, అంత ఆ దానవుడు మండిపడి ఎక్కడ నీ హరి? చూపరా! అని ప్రశ్నించడం. 'హరి సర్వాంతర్యామి' అని ప్రహ్లాదుడు పలుకగా దైత్యుడు కంబాన్ని పగులవెయ్యడం, ఆ మీద చిటఫెట భయంకర ధ్వనులతో ఆ

స్తంభం పగలడం, అందులోంచి శంఖ చక్రాద్యాయుధాలతో ఘననారసింహుడు అవతరించడం జరుగుతుంది.

అపుడు కనకకశిపుని గుండియలదరగా ఆ ఉగ్రనారసింహుడు వాడిగోళ్ళచే హిరణ్యకశిపుణ్ని తొడలమీద తొడికిపట్టి పొట్టను చించడం, వెంటనే వాని వేడినెత్తురు పైకి చిమ్మగా, నరసింహుడు గుట గుటమని జుఱ్ఱుకోవడం, వాని ఎముకలు తుత్తునియలుగా విరవడం. పేగులు జంద్యాలుగా వేసుకోవడం. శరీరాన్ని ఏ కండకాకండ చెక్కడం. వెంట్రుకలన్నీ తెంచిపారెయ్యడం... ఇలాగ నానాభీభత్సంచేస్తూ చివరకు ఆ రక్కసుని పంచప్రాణాలు బలిగొనడం జరుగుతుంది.

ఆ రౌద్రనారసింహుణ్ని ప్రహ్లాదాదిభక్తులు, దేవతలు జయవెట్టగా లక్ష్మీదేవి తన యంకము నలంకరించగా నరసింహుడు శాంతించి అహోబలేశుడుగా వరాలియ్యడం... ఆదిగాగల కథాభాగాన్ని అన్నమాచార్యులు చిన్న చిన్న తేటతెల్గు పదాలతో సరళంగా నరసింహవిజయమనే పేరిట పై పాటలో పొందుపరచాడు.

సహజంగా పరమశాంతమూర్తియైన నారాయణుడు ఇంతటి భీభత్సమూర్తిగా మారడం, చాల భీకరంగా ప్రవర్తించడం ఏమిటా అని ఆలోచిస్తే, తన భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదునిపై ఆ రక్కసుడు జరిపిన హింసాకాండయేనని అర్థమవుతుంది. భక్తునికి తగిలిన దెబ్బలు భగవంతుడే స్వయంగా అనుభవిస్తాడు. అందువల్ల భీభత్సమూర్తిగా ప్రతీకారం చేశాడు.

పాటచివరలో అహోబలమునందున్న నరసింహుడే తిరుమల కోనేటిదండనున్న వేంకటేశుడుగామారి వరాలిస్తున్నాడనడంలో అన్నమాచార్యులయొక్క అభేదదృక్పథం ఆవిష్కరింపబడింది. ఆ అభేదమూ నిజమే. ఇందుకు నిదర్శనంగా తిరుపతినుండి తిరుమలవెళ్లే కాలిబాటలోనూ, తిరుమల శ్రీవేంకటేశ్వరాలయ ప్రాంగణంలోనూ శ్రీనరసింహస్వామి కన్నులపండువుగా వెలసి ఉన్నాడు.



అట్లే ఈ అభేదాన్ని చాటుతూ తాళ్ళపాక అన్నమాచార్యులు మరొక పెద్దసంకీర్తనలో శ్రీనరసింహస్వామి భీకరస్వరూపంతో ఉద్భవించినతీరు. తదుపరి హిరణ్యకశిపుణ్ని సంహరించినరీతి ఇలాగ వర్ణించినాడు.

**సాళంగనాట**

శరణని బ్రదుకరో జనులాల
గరిమ మెరిసె నిదె కనకసింహము ॥పల్లవి॥

అహరహమునుఁ బ్రహ్లాదుఁడు దొరకొని
బహువిధముల హరిమహిమలు వొగడఁగ
కహ కహ హిరణ్యకశిపుఁడు నగి హరి
సహజ మేదియని చఱచెఁ గంభము ॥శర॥

అట మరి పెట పెటమని బేట్లెగసి
చిట చిట రవములఁ జిరుత పొగలెగసి
తట తట మనుచును తరలి వ్రయ్యలై
పట పట మనుచును పగిలెఁగంభము ॥శర॥

బెడిదపు చూపుల మిడుగురు లెగయఁగ
పుడమి యదర నూర్పులు చెలఁగ
గడ గడ వడఁకి దిక్తటము లల్లాడఁగ
వెడలెఁ గంభమున విజయసింహము ॥శర॥

నగవుల సుడివడె నభోంతరంబులు
పొగ లెగసెను పెనుబొమముల్ల
పగటు నార్పులను పగిలెను గొండలు
వెగటున వెడలెను వీరసింహము ॥శర॥

తెఱచిన నోరఁబ్రతిధ్వను లెసఁగఁగ
కఱకు గతుల చుక్కలు చెదర

నెతి హుంకృతులను నిఖిలము బెదరఁగ
వెఱచఱవఁగెరలె విమలసింహము ॥శర॥

పటు విహారముల బ్రహ్మాండముపగల
గుట గుట రవళి నాకులు వొగడ
నిటల నేత్రమున నెఱమంట లదర
పటుగతి మెరసెను భయదసింహము ॥శర॥

పెద పెద కోఱల పిడుగులు రాలఁగ
తుద నఖముల నెత్తురు దొరుగ
గుదిగొను కసరుల కులగిరులూఁటాడ
వుదయించెనదివో వుగ్రసింహము ॥శర॥

అట్టహాసమున నసురలు వారఁగ
ముట్టి వాయువులు మొగతిరుగ
దట్టములై జలధరములు ముసరఁగ
దిట్టయై వెడలె ధీరసింహము ॥శర॥

జలధులు గలఁగెను జడిసె లోకములు
తలఁకె సప్తపాతాళములు
వులికి పడదొడఁగె నూర్ధ్వలోకములు
కొలువున నిలిచెను ఘోరసింహము ॥శర॥

అచ్చట హిరణ్యు నదరంటఁబట్టి
యిచ్చులఁ దొడపై నిడిచించి
కుచ్చి వాని పేగులు జంద్యములుగ
విచ్చి వేసుకొనె విష్ణుసింహము ॥శర॥

పొగడిరి దివిజులు భువనములు వెలనె
పగ యుడిగి చెలఁగెఁ బ్రహ్లాదుఁడు



మిగుల శాంతమున మించె శ్రీవేంకట-
నగమున నహోబలనారసింహము ॥శర॥

**(సంపు-8. సంకీర్తన-239)**

'జనులారా అదిగో బంగారుఛాయమేనితో శ్రీనరసింహస్వామి అత్యంతవైభవముతో వెలుగొందుచున్నాడు. ఆ దేవుణ్ని శరణువేడి బ్రదుకుడు' అని పల్లవిలో ప్రజలను ప్రబోధిస్తున్నాడు.

ఎల్లప్పుడు ప్రహ్లాదుడు అనేకవిధాలుగా విష్ణువుమహిమలు పొగడుచుండగా, హిరణ్యకశిపుడు 'కహ కహ' నవ్వి నీ వన్నట్లు సర్వాంతర్యామియైన ఆ హరిని ఇక్కడ చూపుమని ప్రక్కనున్న స్తంభాన్ని చేతితో గట్టిగా చరచినాడు.

అప్పుడు ఆ స్తంభం పెట పెటార్భాటములతో పేట్లెగసి చిట చిట శబ్దములతో పొగలు చిమ్మినవట. వెంటనే స్తంభం తట తటమని అదరుతూ చీలికలయ్యింది.

భీకరములైన కన్నులనుండి అగ్నికణాలు రాలినాయి. అట్టి సమయంలో భూమి అదిరింది. దిక్కులెల్ల గడ గడ వడకగా ఆ స్తంభమునుండి విజయోత్సాహంతో శ్రీనృసింహు డావిర్భవించినాడు.

ఆ నృసింహుని భయంకరమైన నవ్వులకు గగనములు సుడివడ్డాయి. పెద్ద బొమముళ్ల నుండి పొగలు వ్యాపించినవి. భీకరమైన గర్జనలచే కొండలు పగిలినాయి. ఆ విధంగా వీరనృసింహుడు కంభము నుండి వెడలినాడు.

తెరచిన నరసింహుని నోటినుండి ప్రతిధ్వను లెసగినవి అతని తీవ్ర చలనమునకు చుక్కలు చెల్లాచెదరు అయినవి. గొప్ప హుంకారములచే లోకములన్నీ బెదరుచుండగా విమలుడైన నృసింహుడా స్తంభమునుంచి వెడలినాడు.

పటుతరములైన తన విహారములచే బ్రహ్మాండములు బ్రద్దలు కాగా దేవతలుపొగడుచుండగా నొసటికంటినుండి మంటలు వ్యాపింపగా భయంకరనృసింహుడు మిక్కిలి ప్రకాశించినాడు.

ఆయన పెద్దకోఱలనుండి పిడుగులు రాలినాయి. వాడిగోళ్ళ నుండి నెత్తురు కారెను. తీవ్రమైన కోపములచే కులగిరలు చలించు చుండగా ఉగ్రనారసింహు డుదయించినాడు.

ఆయన అట్టహాసమునకు రాక్షసులు భీతిచే పారిరి. గాలులు విముఖములై వీచగా దట్టములైన మేఘములు ముసరు కొన్నప్పుడు ధీరనరసింహుడు వెడలినాడు.

ఆ సమయమున సముద్రాలు అల్లకల్లోలమయినవి. లోకాలు జడిసినవి. పాతాళ లోకము లేదును చలించినవి. ఊర్ధ్వలోకాలన్నీ ఉలికి పడుతుండగా ఘోరనరసింహుడు కొలువుకూటమునకు వేంచేసెను.

అచటనే ఆయన హిరణ్యకశిపుణ్ని అణచిపట్టి తొడపై నిడి గోళ్లచే వానిపొట్టను చించి, వాని ప్రేగులను జంద్యాలుగా వేసుకొన్నాడు విష్ణునరసింహుడు.

అప్పుడు దేవతలు పొగడినారు. లోకములు శాంతిసహితములై వెలసినవి. అప్పటినుండి ప్రహ్లాదుడు పగను వీడినాడు. తదుపరి ఆ అహోబిలనారసింహుడు తన ఉగ్రరూపమును వీడి మిగుల శాంతస్వరూపుడై శ్రీవేంకటాచలమున (శ్రీవేంకటేశ్వరస్వామిగా) వేంచేసినాడు.

ఇట్లు అన్నమాచార్యులు శ్రీనరసింహస్వామి అవతారావిర్భావమును కన్నులకు కట్టినట్లుగా పై పదకొండుచరణముల పెద్దపాటలో హృదయరంజకముగా వర్ణించినాడు.

ఈ విధముగా పదకవితాపితామహుడైన తాళ్ళపాక అన్నమాచార్యులు తిరుమల శ్రీవేంకటేశ్వరునికి, శ్రీలక్ష్మీనరసింహస్వామికీ అభేదాన్ని కల్పించి



రసానుగుణంగా రచించినసంకీర్తనలు వందలకుపైగా నున్నవని చెప్పవచ్చును. ఈ అభేదాన్నిచాటే అన్నమయ్య శృంగారసంకీర్తనల్లో ఈ క్రిందిది ఒకటి.

**పాడి**

**ఇంతులాల చూడరమ్మ ఇద్దరు జాణలే వీరు**
**చెంత రమాదేవిఁ గూడె శ్రీ నరసింహుఁడు** ॥పల్లవి॥

**సరిఁగొండలెక్కుకొని సరసము లాడుకొంటా**
**సొరిది మోములు తొంగి చూచుకొంటాను**
**విరుల చెండులఁగొని వేటలాడుకొంటాను**
**సిరితోడ విహరించీ శ్రీనరసింహుడు** ॥ఇంతు॥

**భవనాశిలోని నీరు పైఁ జల్లులాడుకొంటాను**
**నవకపు సిరులను నవ్వుకొంటాను**
**జవళిఁ గెమ్మోవులు సన్నలఁ జూపుకొంటాను**
**చివన నిందిరనంటె శ్రీనరసింహుడు** ॥ఇంతు॥

**వేమరుఁ దొడలెక్కువ వీడుదోడులాడుకొంటా**
**ప్రేమమునఁ గాఁగిళ్లఁ బెనఁగుకొంటా**
**ఆముక శ్రీవేంకటాద్రి నౌభళాన నిలిచిరి**
**శ్రీమహాలక్ష్మితోడ శ్రీనరసింహుఁడు** ॥ఇంతు॥

**(సంపు-11. భాగ-1. సంకీ-216)**

శ్రీరమానరసింహులు పుట్టల్లో, చెట్లల్లో, కోనల్లో, వాగుల్లో, వంకల్లో చేసిన విహారాల్నీ, సరసాల్నీ, పూలచెండ్లాటలతో పరస్పరం కొట్టుకోవడాన్ని, భవనాశిలో వాళ్ళు సలిపిన జలక్రీడల్నీ, కన్నులతో మోములతో చేసుకొన్న సైగలనూ, ఒకరినొకరు ప్రేమతో కౌగిళ్ళలో అణగివుండడంవంటి ప్రణయానురాగాల్ని అన్నమయ్య పైపాటలో దండిగా పండించినాడు.

తిరుపతిక్షేత్రం వలనే అహోబిలపుణ్యక్షేత్రం కూడా కొండ పై భాగం ఎగువఅహోబిలమనీ, కొండక్రింది ప్రదేశం దిగువఅహోబిలమనీ ప్రాచీనకాలంనుండీ ప్రసిద్ధంగా వ్యవరింపబడుతున్నది. పై రెండు దివ్యస్థలాల్లో శ్రీనరసింహస్వామి తొమ్మిదిరూపాల్లో భక్తులకు దివ్య దర్శనమిస్తూ అనుగ్రహిస్తున్నాడు. ఈ నవనారసింహులను మన అన్నమాచార్యులు ఒక్కపాటలో పేర్కొంటూ ఇన్నిరూపాలూ శ్రీవేంకటేశ్వరునివిగా కీర్తించినాడు.

**నాట**

**నవనారసింహా నమో నమో**
**భవనాశితీర యహోబిల నారసింహా ॥పల్లవి॥**

**సతత ప్రతాప రౌద్రజ్వాలానారసింహా**
**వితత వీరసింహ విదారణా**
**అతిశయకరుణ యోగానందనారసింహా**
**మతిశాంతపు కానుగుమానునరసింహా ॥నవ॥**

**మరలి భీభత్సపు మట్టెమళ్ల నరసింహా**
**నరహరి భార్గోటినారసింహా**
**పరిపూర్ణ శృంగార ప్రహ్లాద నరసింహా**
**సిరుల నద్భుతపు లక్ష్మీనరసింహా ॥నవ॥**

**వదన భయానకపు వరాహనరసింహా**
**చెదరని వైభవాల శ్రీనరసింహా**
**అదన శ్రీవేంకటేశ అందునిందు నిరవైతి**
**పదివేలరూపముల బహు నారసింహా ॥నవ॥**

**(సంపు-1.సంకీ-453)**

తాళ్ళపాక అన్నమాచార్యులు పేర్కొనిన ఈ నవనారసింహులు వరుసగా



**1. జ్వాలానరసింహుఁడు :**

ఎగువ అహోబిలమునుండిమూడుమైళ్ల దూరాన ఎత్తైనప్రదేశంలో ఉన్నాడు జ్వాలానరసింహస్వామి. గరుడాచలము వేదాచలము అనురెండు కొండల మధ్యలోవున్న అచలచ్ఛాయమేరుపు అనే కొండమధ్యలో శ్రీనరసింహుడు జ్వాలారూపియై కోటిసూర్యప్రకాశముతో వేంచేసి ఉన్నాడట.

**2. అహోబలనరసింహుఁడు :**

ఎగువఅహోబిలంలో వెలసినస్వామి. ఇచట ఒక గుహలో చక్రాకారముగా ఒకకొండనీటిధార అడుగుభాగములోవున్న ఒక అరుగుమీద దశభుజములతో హిరణ్యకశిపుని సంహరించెడు సంహారమూర్తిగా వీరసింహుడై శ్రీనరసింహస్వామి దర్శనమిచ్చుచున్నాడు.

**3. మాలోలనరసింహుడు :**

ఎగువ అహోబిలంలోని ఆలయానికి 6 కి.మీ దూరంలో ఉన్న స్వామి లక్ష్మీ నరసింహుడు. ఆయనే మాలోలనరసింహుడు.

**4. వరాహ నరసింహస్వామి :**

ఎగువ అహోబిలఆలయానికి ఒక కిలోమీటరు దూరంలో వరాహ నరసింహుడు దర్శనమిస్తాడు. ఈయనే క్రోడాకారనరసింహుడు.

**5. కానుగుమాని నరసింహస్వామి : (కారంజ నరసింహస్వామి)**

దిగువ అహోబిలమునకు ఎగువఅహోబిలమునకు మార్గమధ్యలో వేంచేసి ఉన్న స్వామి ఈయన. కరంజమనే (కానుగుమాను) వృక్షము క్రింద నరసింహస్వామి వేంచేసియుండుటచేత కానుగుమాని నరసింహుడని పేరువచ్చినదట. ఇచ్చటస్వామి శార్ఙమనెడు ధనుస్సును, చక్రమును ధరించి, కూర్చునియుండి దర్శనమిచ్చుచున్నాడు.

**6. భార్గవోటి నరసింహుడు :**

దిగువ అహోబలానికి 2 కి.మీటర్ల దూరంలో ఈ భార్గవోటి నరసింహుడు దర్శనమిస్తాడు.

**7. యోగానంద నరసింహస్వామి :**

దిగువ అహోబిలానికి ఆగ్నేయదిశలో రెండుమైళ్ల దూరాన యోగానందనరసింహుడు ఆవిర్భంచివున్నాడు. ప్రహ్లాదునకు యోగాభ్యాసమునేర్పిన మూర్తియగుటచే యోగానందనరసింహస్వామియను పేరువచ్చినదట. ఇచట నరసింహుడు యోగపట్టముతో దర్శనమిచ్చుచున్నాడు.

**8. ఛత్రవట నరసింహుడు :**

యోగానంద నరసింహునికి 2 కి.మీటర్ల దూరంలో మర్రి చెట్టుకింద దర్శనమిస్తాడు ఛత్రవటస్వామి.

**9. పావన నరసింహుడు :**

ఎగువఅహోబిల ఆలయానికి 6 కీ.మీటర్ల దూరంలో పావన నరసింహుడు వేంచేసివున్నాడు.

ఈ నవనారసింహులే

**"జ్వాలాహోబిల మాలోల క్రోడకారంజ భార్గవాః**
**యోగానంద ఛత్రవట పావనా నవమూర్తయే"** .అని కీర్తింపబడుట విశేషం!

**-1980 'సప్తగిరి' లో ప్రచురితం**

## 22. అన్నమయ్య - రామకథ



**యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే।**
**తావద్రామాయణకథా లోకేషు ప్రచలిష్యతి॥**

"పర్వతాలు భూమండలంపైన ఉన్నంతకాలమూ, నదులు భూతలాన ప్రవహించుచున్నంతవరకూ పవిత్రమైన రామకథ సర్వ లోకాల్లో వ్యాప్తిలో ఉంటుంది"– ఇట్టి ప్రశస్తి యావద్భారతీయ సారస్వతంలో ఒక్క రామాయణ మహాకావ్యానికి మాత్రమే కలదు.

భారతీయసాహిత్యాల్లో అన్నింటియందు పరమపవిత్రతను, పూజనీయతను సంతరించుకొన్న రమణీయచరితం రామకథ. పరమ కిరాతకుడగు ఒకబోయ (వాల్మీకి) 'రామ' నామ జపంచేసి పవిత్రుడై నాడు. కవికోకిలగా మారి మధురాక్షరసమన్వితముం రామకథను గానంచేసి లోకానికి అందించినాడు. అప్పటినుండి ఈ మహనీయ గాథ భారతీయులకంఠాల్లో శతకోటిప్రవిస్తరంగా పల్లవిస్తూనే వుంది.

ఒక్క భారతీయ సాహిత్యంలోనే కాదు. మలయా, బర్మా, ఇండోనేషియా, నేపాల్, చైనా, టిబెట్, రష్యన్, జర్మనీ మున్నగు విదేశ భాషాసంస్కృతుల్లోకూడా విశ్వమోహనమూర్తి యైన శ్రీరామచంద్రుని గాథ సుందరంగా రూపు దిద్దుకొన్నది. ప్రపంచ సాంస్కృతిక జీవన పథంపై ఇంత ప్రగాఢంగా ప్రభావాన్ని నెరపిన మహాకావ్యం విశ్వవాఙ్మయంలో మరేదీ కానరాదు.

ముఖ్యంగా తెలుగు సాహిత్యంలో రామకథ కమనీయకావ్యాలుగా–ప్రబంధాలుగా–నాటకాలుగా–యక్షగానాలుగా–హరికథ బుఱ్ఱకథలుగా–శతకాలుగా–సంకీర్తనలుగా–జానపదగేయాలుగా స్త్రీలపాటలు...ఇలాగ అనేక ప్రక్రియాభేదాల్లో సంతరించబడింది. నేటికీ ఈ గాథ ఎందరో ఉవులచే రచింబడుతూనే వుంది; గాయకులచే పాడబడతూ నేవుంది; పండితులచే పరిశీలింప బడుతూనే వుంది; ఇంతటి ప్రశస్తికి కారణం ఏమిటా అని ప్రశ్నించుకుంటే అందుకు సమాధానం ఇలాగ మనకు స్ఫురిస్తుంది.

రామాయణకావ్యంలోని ఉపదేశం, రామునిపితృవాక్యపరిపాలన, ఒకేసతి, ఒకేమాట, ఒకేబాణం అన్న ఆతని నియమాలు. స్నేహానురక్తి. ప్రతిజ్ఞాపాలన, శిష్టరక్షణ, ఔదార్యం–అట్లే సీతాదేవిపాతివ్రత్యం, ఓర్పు, ఆదర్శధర్మ నిర్వహణ, పుత్రవాత్సల్యం–దశరథుడి పుత్రప్రేమ–భరతాదుల సోదరప్రేమ–లక్ష్మణునిసేవ–రామకార్య దురంధరుడైన హనుమంతుని స్వామిభక్తి, సహజశ్రద్ధ, సమయజ్ఞత, అకుంఠిత బ్రహ్మచర్యం, భక్తులపాలిటి అభయప్రదానత–ఇవన్నీ కలసి రామాయణమహాకావ్య పవిత్రతకు, ప్రచారానికీ దోహదం చేశాయి.

ఇంతటి పవిత్రతను సంతరించుకున్న రామకథ, రామకథా ఘట్టాలు ప్రధానంగా శ్రీ వేంకటేశ్వరుని ఆంతరంగిక భక్తుడూ, పదకవితా పితామహుడు 'హరియవతార' మని కొనియాడబడిన మహానుభావుడు



అయిన అన్నమాచార్యులపదకవితల్లో రూపుదిద్దుకొన్న రీతిని ఇంచుక పరిశీలించడమే ప్రధానాంశం.

అన్నమయ్య తిరుమలమందిరసుందరుడైన శ్రీనివాసుని తన జీవితేశ్వరునిగా, నాయికాభావంతో వలచి, వలపించుకొని సుమారు ముప్పది రెండువేల కీర్తనలను రచించినాడు. ఆయన మనుమడైన చిన తిరువేంగళనాథుడు (చిన్నన్న) ఈ విధంగా పేర్కొన్నాడు[1]

**"యోగ మార్గంబున నొక కొన్ని బుధులు**
**రాగిల్ల శృంగారరసరీతిఁ గొన్ని**
**వైరాగ్యరచనతో వాసింపఁ గొన్ని**
**సారసనేత్రుపై సంకీర్తనములు**
**సరసత్వమునఁ దాళసముఖముల్గాఁగ**
**పరమతంత్రములు ముప్పదిరెండువేలు"**

అన్నమాచార్యుడు ఏపదం పాడినా, ఏమాట మాట్లాడినా, శ్రీ వేంకటపతి తానే వచ్చి ఆ పాటల్లో నర్తనమాడినాడు. అందువల్లనే ఆయన 'ఆడిన మాటెల్ల అమృతకావ్యంగ, పాడిన పాటెల్ల పరమగానంగ' పరిఢవిల్లింది. అన్నమయ్య ఏ పుణ్యతీర్థాన్ని సేవించినా, ఏ దేవుణ్ని దర్శించినా అక్కడ అందులో ఆయనకు తిరుమలేశునిరూపే గోచరమయ్యేది. కనుకనే ఆ సంకీర్తనాచార్యుడు తాను కీర్తించిన శ్రీకృష్ణుడు, లక్ష్మీనృసింహుడు, శ్రీరాముడు మున్నగు అర్చామూర్తులను శ్రీ వేంకటేశ్వరుని ప్రతిబింబాలుగానే కీర్తించినాడు. అన్నమయ్య దృష్టిలో వారికీ కోనేటిదండనున్న వేంకటపతికీ అభేదం. రావణసంహారార్థం భువిలో కౌసల్యానందనుడై జన్మించిన లోకాభిరాముడు సాక్షాత్తు వేంకటేశ్వరుడే అని అన్నమయ్య అచంచల భావన. ఆ భావనకు తగినట్టుగానే ప్రతిరోజు సుప్రభాతాన శ్రీ వేంకటేశ్వరుడు

1. చూడు. అన్నమాచార్య చరిత్రము (చిన్నన్న) పుట:45.
పరిష్కర్త. గౌరిపెద్ది రామసుబ్బశర్మ. తి.తి.దే. ముద్రణ. 1978.

**"కౌసల్యా సుప్రజారామ! పూర్వా సంధ్యా ప్రవర్త తే ।**
**ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్॥**[1]

అని రామచంద్రమూర్తి పేరుతో మేల్కొలుపులు పాడించు కొంటున్నాడు. కనుకనే అన్నమయ్య దశావతారాలను వర్ణించే సందర్భాల్లో రామావతారం పేర్కొనవలసి వచ్చినపుడు వేంకటేశ్వరుణ్ని 'గాఁటపు జడల బింకపు భూత' మంటాడు మరొకచోట వెంకటేశ్వరుని వరదహస్తాన్ని వర్ణిస్తూ' మొనసి జలనిధి యమ్ము మొనకుఁ దెచ్చిన చేయి' అని కీర్తిస్తాడు. వేరొకచోట వేంకటేశ్వరుని పాదాన్ని వర్ణిస్తూ' చేరి యడుగు వెట్టితే శిలకుఁ బ్రాణము వచ్చె' అని అంటాడు...ఇలాగ రామావతార విశేషాలను తిరుమలప్పులో దర్శించిన అపర వాల్మీకి అన్నమయ్య.

అన్నమయ్యకు రాముడన్నా, రామాయణ మహాకావ్యమన్నా అత్యంత భక్తిప్రపత్తులు. కనుకనే

**"ఘనతరసకలభోగంబులుగాఁగ**[2]
**మనుచు వాల్మీకిరామాయణమెల్ల**
**రాగంబుతో ననురాగంబుతోడ**
**బాగుగా గంధర్వుబాగుగాఁ జదివి"**

చక్కగా పాడేవాడట దానిని

**"విన్నవారెల్ల నువ్విళ్లూరి యొక్క**[3]
**ప్రన్నవీనులు నిండు పండువుల్ సేయ**
**తుంబురుఁడో నారదుఁడో కాక యీ వి-**
**ధంబునఁ దిరుగు గంధర్వుఁడో కాక**
**మనుజుఁడో యీ యన్నమయ్య యని సర్వ**

1. చూడు. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతమ్. తి.తి.దే. ముద్రణ.
2,3. చూడు. అన్నమాచార్య చరిత్రము (చిన్నన్న) పుట:30 (1978)



జనులును కొనియాడి" సంతసించెడివారట అన్నమాచార్యులు రాముణ్నీ రామకథను సంకీర్తనల్లో కీర్తించడమే కాదు. తాను ద్విపదలో రామాయణాన్ని రచించినాడు. ఈ విషయం చిన్నన్న "ప్రవిమల ద్విపదప్రబంధరూపమున, నవముగా రామాయణము" ను అన్నమయ్య రచించినట్లు పేర్కొన్నాడు.[1] కాని నేడు ఆ ద్విపదరామాయణం నామావశిష్టమైనది. అయినను రామకథకు సంబంధించిన రసవత్తర సన్ని వేశాలు నిండుగా మెండుగా వర్ణింపబడిన అన్నమయ్యకీర్తనలు దండిగానే మనకు లభ్యమవుతూ వున్నాయి. ఈ సంకీర్తనలను సంకీర్త న రామాయణాలనీ, సంగ్రహ(సంక్షిప్త) రామాయణాలనీ పేర్కొనవచ్చు.

వైష్ణవులకు 'రామకథ' అత్యంత ప్రీతిపాత్రమైనది. ఆ దృక్పథంతో సైతం వైష్ణవుడైన అన్నమాచార్యులు రామాయణంపై ఎక్కువగా భక్తిశ్రద్ధలు ప్రదర్శించినాడని నుడువవచ్చు.

రామాయణంలోని ఏ ఒక్క అక్షరాన్ని ఉచ్చరించినా మహాపాతకాలు నశిస్తాయట.

**"[2]చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్ ।**
**ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్॥"**

అని రామాయణ ప్రాశస్త్యాన్ని మనపూర్వులు ప్రవచించినారు. ఈ శ్లోకాన్ని బాగా మననం చేసికొని ఆ అర్థాన్నే ఇంచుక విపులంగా, రామాయణ గాథయొక్క పవిత్రతను గుండెకు హత్తుకొనేటట్లుగా ఈ క్రింది చిన్నిసంకీర్త నలో రామకథనంతా వర్ణించినాడు.

**బౌళిరామక్రియ**

**ఇతఁడే పరబ్రహ్మ మిదియె రామకథ**
**శతకోటివిస్తరము సర్వపుణ్యఫలము** ॥పల్లవి॥

1. చూడు. అన్నమాచార్య చరిత్ర.పుట. 45-46
2. చూడు. పీఠిక "సుందర కాండము" బాలసరస్వతి బుక్‌డిపో 1972.

**ధరలో రాముఁడుపుట్టె ధరణిజఁబెండ్లాడె**
**అరణ్యవాసుల కెల్లా నభయమిచ్చె**
**సొరిది ముక్కుఁ జెవులు చుప్పనాతిని గోసె**
**ఖరదూషణులను ఖండించి వేసె ॥ఇతఁ॥**

**కినిసి వాలిఁజంపి కిష్కింధ సుగ్రీవు కిచ్చె**
**వనధి బంధించి దాఁటె వానరులతో**
**కనలి రావణకుంభకర్ణాదులను జంపి**
**వనితఁ జేకొని మళ్లివచ్చె నయోధ్యకును ॥ఇతఁ॥**

**సౌమిత్రియు భరతుఁడు శత్రుఘ్నుఁడుఁ గొలువఁగ**
**భూమి యేలె కుశలవపుత్రుల గాంచె**
**శ్రీమంతుఁడై నిలిచె శ్రీవేంకటాద్రిమీఁద**
**కామించి విభీషణు లంకకుఁ బట్టము గట్టె ॥ఇతఁ॥**

(సంపు11-భాగ-1. సంకీ 224)

పై సంకీర్తనలో అన్నమయ్యప్రదర్శించిన కవితాప్రతిభ, ప్రజ్ఞ పరిశీలిస్తే ఆతని అలభ్య ద్విపదరామాయణకావ్యం ఇంకెంత సుమధురంగా ఉండి ఉండేదో పాఠకు లూహించుకోగలరు.

సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపమే భువిలో రామచంద్రునిగా అవతరించి నాడు. ఆతని కథ శతకోటివిస్తరమూ, సర్వపుణ్యఫల ప్రదమూ-అని అన్నమయ్య రామకథను కొండాడుతూ బాలకాండ మొదలుగా ఉత్తరకాండ వరకుగల కథనంతా సంగ్రహంగా మూడు చరణాల్లో అలతి యలతి తేటతెలుగుపలుకుల్లో అత్యంతరమణీయంగా ఇమిడ్చినాడు.

శ్రీరామజననం సీతారామలకల్యాణం పిమ్మట సీతారామ లక్ష్మణులు అరణ్యవాసానికి వెళ్లడం, అరణ్యవాససమయంలో శిష్ట రక్షణ, దుష్ట శిక్షణ,



శూర్పణఖ ముక్కుచెవులు ఖండించడం, ఖర దూషణా దులను సంహరించడం ఇత్యాది బాల అయోధ్య అరణ్యకాండల్లోని కథాభాగాన్ని మొదటి చరణంలో వివరించినాడు అన్నమయ్య.

వాలిని చంపి కిష్కంధకు సుగ్రీవుణ్ని రాజుగా చెయ్యడం వానరుల సహకారంతో వారధి కట్టి సముద్రం దాటడం రావణ కుంభకర్ణాది రాక్షసులను చంపడం, విభీషణున్ని లంకకు రాజుగా చెయ్యడం.తదుపరి సీతతో అయోధ్యాపురానికి ప్రట్టాభిషిక్తుడై రాజ్యం చెయ్యడం, కుశలవులను పుత్రులుగా పొందడం వరకుగల కిష్కింధ, సుందర, యుద్ధ ఉత్తర కాండల్లోని కథాభాగాన్ని రెండవ, మూడవ చణాల్లో కమనీయంగా వర్ణించి, ఆ శ్రీరామచంద్రుడే అలమేల్మంగావల్లభుడై వేంకటాద్రిమీద నిలిచినాడని అన్నమయ్యభక్తితో కీర్తించినాడు.

అన్నమాచార్యులు ఒక్క అధ్యాత్మకీర్త నల్లోనేగాక శృంగార కీర్తనల్లో కూడా రామకథను గానం చేసినాడు. రాముడు జన్మించినది మొదలుకొని ఆయన చూపిన అతిమానుషకార్యాలను సంగ్రహీకరించి ఈ క్రింది ఏడు చరణాల శృంగారసంకీర్తనలో రామకథనంతటినీ సుమధురంగా సుందరంగా గానం చేసినాడు.

**మళవిగౌళ**

**సీతకపడుసు దోసిటిపాలమగఁడు**
**బాఁతిపడిన నగపడునటె వీఁడు ॥పల్లవి॥**

**[1]మూఁడుగాళ్ల పెద్దముసలి సవులుగొన్న**
**పాఁడిమేకల పాలపాశము**

1. "చత్వారిశృంగా త్రయోస్యపాదా, ద్వేశీర్షే, సప్తహస్తాసోస్య" అని శ్రుతి. అనగా అగ్నిదేవుడు నాలుగుకొమ్ములు, మూడుకాళ్లు, రెండు తలలు, ఏడు చేతులు కలిగివుంటాడని తాత్పర్యం.



వేడి జుట్టినతల్లి వేఁకటియై కన్న
వాఁడు వీఁడు శిన్నవాఁడటె వీఁడు ॥సీత॥

కొండలంత సనుగుబ్బలరాకాశి
మిండెత గవిశి పై మింగరాఁగా
గుండె వగుల నొక్క కోలనె సరగన
సెండివేసినట్టి సిసువటె వీఁడు ॥సీత॥



వుడుకునుదుటివాఁడు వుదుటున దాఁసిన
బెడిదపు మోతల పెనువిల్లు
తొడికి విరిశివేశి దోమటి నునుఁబాల
కుడుపుల తొలిపెండ్లి కొడుకటె వీఁడు ॥సీత॥

మారుదల్లి సేఁతిమాటల ఁబడలేక
వూరు విడిశి యడవుల కేఁగి
సేరవచ్చిన యింతి సెవులు ముక్కుఁగోసి
పేరువారిన పెద్దబిరుదటె వీఁడు ॥సీత॥

పొగదాగుతపసుల పుల్లవెలుగుమంట
లగడు సేయఁగ ముగురసురల
సగము సాయసంపి సడిఁబెట్టి విడిశిన
బగిడికాఁడు సిన్నపడుసటె వీఁడు ॥సీత॥

మిస మిస మెరసేటి మెగము మేనిపై
పసల ఁదగిలి వెంట ఁబారిపారి
గసిక వింటికోల గరిగాఁడనేసిన
మసిమాయల సలమరి గదెవీఁడు ॥సీత॥

రవ్వల సేఁతల రాకాశినాయని
కొవ్విన మదము తెక్కోలుగొని
యివ్వలఁ దిరువేంకటేశుఁడై యున్నాఁడు
గువ్వెక నినుఁ జట్టిగొనెఁగదె వీఁడు ॥సీత॥

మూడుగాళ్ల పెద్దముసలి అగ్నిదేవుడు. పాడిమేకల నుపయోగించి దశరథుడు పుత్రకామేష్టి చేస్తాడు. అందుండి అగ్నిదేవుడుద్భవించి పాయసం ఇస్తాడు. దానిని తిని వేకటి (గర్భవతి) అయ్యింది కౌసల్య. ఆ కౌసల్య కనిన చిన్నవాడేనా వీడు! అంటూ మొదటిచరణంలో శ్రీరామజననమును పేర్కొనినాడు.

కొండలంతటిచనుగుబ్బలరాకాశిమిండెత తాటక. ఆపె కౌశిక యాగాన్ని రక్షిస్తున్న రామలక్ష్మణులిద్దర్నీ మింగడానికి పైబడింది. ఆ క్షణంలో దానిగుండె పగిలేట్టుగా ఒక్క బాణంతో తాటక నేసిన సిసువా వీడు! అని రెండవచరణంలో తాటకవధను వర్ణించినాడు.

ఉడుకునుదుటివాడు శివుడు. ఆ శివునివిల్లు బెడితపుమోత (పెద్దబరువు) గలది. దానిని తునియలుగా విరిచివేసి మనోహరమైన క్షీరాన్నాలు ఆరగించినట్టి ఆనాటి పెండ్లికొడుకు వీడు (ఆ వేంకటేశుడు!) అని ఈ చరణంలో శివధనుర్భంగ సీతారామకల్యాణ సన్నివేశాలు రమ్యంగా వర్ణింపబడినాయి.

మారుదల్లి కైక. ఆమె చేదుమాటలను పడలేక అయోధ్యను వీడి అడవుల కేగినాడు దాశరథి. అక్కడ తనను కోరి చేరవచ్చిన చుప్పనాతి ముక్కు చెవులను గోసి పేరుపొందిన ఆ పెద్ద బిరుదు మగడట వీడు! (వేంకటేశుడు) అని అన్నమయ్య ఇందులో కైకమాటపై అడవికెళ్లిన రాముడు, శూర్పణఖ ముక్కుచెవులు కొయ్యడం వరకుగల కథను వర్ణించినాడు.

పొగత్రావి బ్రతికేవారు తపస్వులు. వారు ఎండు పుల్లలతో (సమిధలు) మంటలుచేసి యాగం చేస్తుంటారు. ఆ యాగాలను పాడుచేసి మంటలను ఆర్పుతున్న ఖరదూషణ త్రిశిరులనెడు రక్కసులను చచ్చేంతవరకు కొట్టిన బగిడికాడైన ఆ చిన్నవాడు వీడా! (వేంకటేశుడు!) అని ఈ చరణంలో ఖరదూషణాదులవృత్తాంతం పేర్కొనబడింది.

మిస మిస మెరిసేటిమెకం మాయలేడి. దానికాంతికి లోబడి వెంట పారి పారి ఒక్కబాణంతో దానిని చంపివేసి దాని మాయలను మట్టుపెట్టిన మాయకాడు వీడు! అని అన్నమయ్య ఈ ఆరవ చరణంలో మారీచవధను వక్కాణించినాడు.



రవ్వలసేఁతలు అనగా కఠినపుపనులు లేదా కచ్చుపోతు పనులు. శివధనుర్భంగ సమయంలో సీతాదేవి తననుచూసి నవ్విందట! దానిని సహించలేక కక్షతో సీతనెత్తుకొనిపోయిన రాకాసినాయడు రావణుడు. వాని క్రొవ్వినమదాన్ని నశింపజేసిన ఆ శ్రీరాముడే సీతమ్మతోగూడి నేడు ఇక్కడ తిరువేంకటేశుడై యున్నాడు. ఇట్లు తాను దర్శించిన శ్రీవేంకటేశ్వరునిలో రామావతారవిశేషాలను చూచిన ధన్యజీవి అన్నమయ్య.

రామాయణమంతా సంగ్రహంగా వర్ణింపబడిన మరియొక అధ్యాత్మకీర్తన ఇది. తిలకించండి :

**సాళంగనాట**

**కౌసల్యానందనరామ కమలాప్తకులరామ**
**భాసుర వరద జయపరిపూర్ణరామ ॥పల్లవి॥**

**మునుప దశరథరాముఁడవై తమ్ములు నీవు**
**జనించి తాటకఁజంపి జన్నము గాచి**
**వెనుకొని హరువిల్లు విరిచి సీతఁబెండ్లాడి**
**అనుమతి పరశురామునిచేఁ గైకొంటివి ॥కౌస॥**

**సుప్పనాతి శిక్షించి సొరిది రుషులఁగాచి**
**అప్పుడే ఖరదూషణాదులఁ గొట్టి**
**చొప్పుతో మాయామృగము సోధించి హరియించి**
**కప్పి హనుమంతు బంటుగాఁ నేలుకొంటివి ॥కౌస॥**

**సొలసి వాలినడఁచి సుగ్రీవుఁ గూడుక**
**జలధి బంధించి లంకసాధించి**
**వెలయ రావణు గెల్చి విభీషణునిమన్నించి**
**చెలఁగితి వయోధ్యలో శ్రీవేంకటేశుఁడ ॥కౌస॥**

అయోధ్యలో దశరథనందనులుగా రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు జన్మించడం, ధనుర్వేద విద్యాపారంగతులైన రామలక్ష్మణులను విశ్వామిత్రుడు తనవెంట తీసికొనివెళ్లడం అచట తాటకను చంపి యాగాన్ని రక్షణ చెయ్యడం, తదుపరి మిథిలానగరంలో విశ్వామిత్రుని ఆనపై శివధనుస్సును విరచి సీతను పెండ్లాడడం, సీతాసమేతుడై రాముడు అయోధ్యకు వస్తూ పరశురాముని ప్రశంసలందడం, ఇత్యాదిగా గల బాల అయోధ్యాకాండల్లోని కథను మొదటిచరణంలో వర్ణించినాడు.

తండ్రియానతిపై అడవికి వెళ్లిన రాముడు తన్ను కామించవచ్చిన శూర్పణఖ ముక్కుచెవులు కోస్తాడు. తదుపరి ఖరదూషణాదులనెడు రాక్షసులను వధించి ఋషులను రక్షిస్తాడు. నేర్పుతో మాయలేడిని సంహరిస్తాడు. తదుపరి హనుమంతుణ్ణి తనబంటుగా నేలుకొంటాడు. ఇత్యాది ఆరణ్య, కిష్కింధాకాండల్లోని కథను రెండవ చరణంలో వివరించినాడు అన్నమయ్య.

వాలిని చంపి, సుగ్రీవాది వానరులతో సముద్రందాటి లంకను జయిస్తాడు రాముడు. రావణున్ని సంహరించి విభీషణున్ని రాజుగా చేసిన ఆ రాముడే (వేంకటేశుడే) అయోధ్యలో వెలసినాడు. అని ఇలాగ సుందర, యుద్ధకాండల్లోని కథ ఈ మూడవచరణంలో వర్ణింపబడింది.

అన్నమాచార్యులు తనసంకీర్తనల్లో రామకథను సామాన్య ధోరణిలో వర్ణించడమేకాక, అందలి కొన్ని ముఖ్య ఘట్టాలనుకూడా ఆ యాచోట్ల వర్ణించడం కద్దు.

ఒకానొకప్పుడు వేంకటేశ్వర భక్తిప్రబోధంలో అన్నమయ్య తిరుపతి సమీపంలోని వావిలిపాటికి (వాయల్‌పాడు) వెళ్ళడం తటస్థించింది. ఈ గ్రామాన్ని వాల్మీకిపురం అని కూడా అంటారు. బహుశః ఆ రోజు శ్రీరామనవమి కాబోలు. అచటి రామాలయంలో సీతాకల్యాణం కన్నులపండువుగా





జరుగుతున్నది. ఆ బొమ్మలపెండ్లే మన అన్నమయ్య హృదయానికి సాక్షాత్తు సీతారాముల పెండ్లిలాగా రంగరంగ వైభోగంగా గోచరించింది. ఆ పెండ్లి సందడిని అలనాడు జనకుని యింటిలో జరిగిన సీతారాముల పెండ్లిని మరపిస్తూ వర్ణించినాడు. ఆ పెండ్లిలో సీతాదేవి సిగ్గుతో తలవంచుకొన్నది. ఆ సింగారపు బొమ్మను 'తలవంచకమ్మా' అని అంటూ అడుగడుగునా సీతమ్మ సిగ్గుపడకుండా చేయవలసినపనులను ఆమెకు బోధిస్తూ అన్నమయ్య సీతమ్మకు దగ్గరి చుట్టంగా భావించి తన్మయుడై పోతున్నాడు తిలకించండి.

**సాళంగనాట**

**సిగ్గరిపెండ్లికూఁతుర సీతమ్మ**
**దగ్గరి సింగారబొమ్మ తలవంచకమ్మా ॥పల్లవి॥**

**అల్లనాఁడే రాఘవుఁడు హరువిల్లు విరిచెను**
**యెల్లి నేఁడే పెండ్లాడీ నిదివో నిన్ను**
**యెల్లగా జనకుఁడు నిన్నిచ్చీనట వీఁడె**
**వెల్లవిరి నీమాట వినవమ్మా ॥సిగ్గ॥**

**అదె పెండ్లితెర యెత్తి రండనే వసిష్ఠుఁడుండి**
**చదివీ మంత్రాలు సేసచల్లవమ్మా**
**మొదల రామునికంటె ముంచి తలఁబాలు వోసి**
**సుదతి యాతనిమోము చూడవమ్మా ॥సిగ్గ॥**

**కంకణదారాలు గట్టి కాలుదొక్కితివి, మీరు**
**పొంకాన బువ్వమందరో పొత్తులనమ్మ**
**వుంకువ వావిలిపాటనుండి శ్రీవేంకటగిరి**
**తెంకుల నిన్నుఁగూడి తిరుమాయనమ్మా ॥సిగ్గ॥**

**(సంపు. 32-సంకీ. 40)**

ఆనాడే ఈ రఘురాముడు శివధనుస్సు విరిచాడు. నేడు నిన్ను పెండ్లాడబోతున్నాడు. అదిగో జనకుడు నిన్ను కన్యాదానం చేయబోతున్నాడు. నా మాట వినుతల్లీ! తలవంచకుమమ్మా!

శుభముహూర్తం ఆసన్నమైంది. అడుగో పురోహితులు వసిష్ఠులవారు మంత్రాలు చదువుతూ మీరిద్దరి మధ్యనున్న పెండ్లితెర యెత్తినారు. సేసలు చల్లవమ్మా! ఆ చల్లడం ఎట్లా అంటావా? రామునికంటె ముందగా నీవే ఆయనను తలంబ్రాలతో ముంచెత్తాలి. అందుకే ఓ సుదతీ! సిగ్గుతో తలవంచక రాముని మోము చూడవమ్మా!



కంకణదారం నీకు రాముడు కట్టాడు. రామునికి నీవుకట్టి ఆతని కాలు దొక్కితివి. మీరిద్దరూ పొంకంతో ప్రేమతో బువ్వమందరో! అని అన్నమయ్య తాను దర్శించిన వావిలిపాటి సీతారాముల కల్యాణాన్ని ఉద్దేశించి పాడినాడు.

పైపాటలో అన్నమయ్య తెలుగువారు ఆచరించే పద్ధతిలో కన్యావరణం, కన్యాదానం, శుభముహూర్తంలో తెరఎత్తడం, అక్షతారోపణం. రక్షాబంధనం మున్నగు పెండ్లితంతునంతా క్రమంగా సశాస్త్రీయంగా వర్ణించినాడు. తదుపరి 'పొంకాన బువ్వమందడం' ఇది నేడు 'బువ్వంబంతి'గా ప్రచారంలో ఉంది. అనగా పెండ్లితంతు అంతాముగిసిన వెనుక వధూవరులు ప్రక్క ప్రక్కన కూర్చొని విందు చెయ్యడం అన్నమాట. అదొక రసవత్తర వేడుక. ఒక్క తెలుగు దేశంలోనే నాటికీ నేటికీ కనబడుతున్నది.

అన్నమయ్య అలంకారప్రియుడు[1]. ఆయన శృంగారాధ్యాత్మ సంకీర్తనల్లో అనేక శబ్దార్థాలంకారాలు మెండుగా కనబడతాయి. అందులో మచ్చునకు ఒకటి రెండు.

**పాడి**

**సౌమిత్రి సహోదర దశరథరామా**
**చేముంచి గుత్తిలో వెలసిన రామా**

**చెలిమి సుగ్రీవుతోడఁ జేసినరామ తొల్లి**
**శిలను బడఁతిఁ గావించినరామా**
**చెలరేఁగిన వానరసేనలరామా**
**శిలుగు మాయామృగముఁ జించినరామా**

1. చూడు: పీఠిక. అన్నమయ్య శృంగార సంకీర్తనలు. సంపుటము-29 పరిష్కర్త: గౌరిపెద్ది రామసుబ్బశర్మ. తి.తి.దే. ముద్రణ. 1981

**తరణి వంశ తాటకాంతకరామా**
**నరనాథ కౌసల్యానందనరామా**
**సిరులఁ బెండ్లాడిన సీతారామా**
**గరిమతో సేతువుగట్టిన రామా**

**రావణాది దనుజహరణరామా**
**కావించి విభీషణునిఁ గాచినరామా**
**దీవెన లయోధ్యలోఁ జెందినరామా**
**శ్రీవేంకటాద్రిమీఁదిశ్రీరామా**



**(సంపుటం.9 - సంకీర్తన-210)**

అన్నమయ్య తన వేంకటేశ్వరభక్తి ప్రచారోద్యమంలో గుత్తి దర్శించినపుడు అచటి సౌమిత్రీ సహోదరుడైన దశరథరాముణ్ని గూర్చి అంత్యానుప్రాసాలంకారములో శ్రుతిపేయంగా పాడినపాట ఇది.

సుగ్రీవమిత్రుడనీ, రాతిని నాతిగా చేసినవాడనీ, వానరులతో కూడిన వాడనీ, మాయలేడిని చించినవాడనీ రాముడు వర్ణింపబడినందువల్ల మొదటిచరణలో అయోధ్య, అరణ్య కిష్కింధకాండల్లోని కథ వర్ణింపబడింది.

తాటకాంతకరాముడనీ, కౌసల్యానందనరాముడనీ, సీతారాముడనీ, సేతువు గట్టినరాముడని వర్ణించినందువల్ల పై రెండవచరణంలో బాల, అయోధ్య యుద్ధకాండల్లోని కథ సూచింపబడింది.

రావణాదులను చంపినరాముడనీ, విభీషణవరదుడనీ, అయోధ్యా రాముడనీ చెప్పినందువల్ల ఈ మూడవచరణంలో యుద్ధకాండ, పట్టాభిషేకం వర్ణింపబడింది.

పై కీర్తనలో రామకథను ఒక క్రమంగా వర్ణించడం కనపడదు. ఇందులోకేవలం రాముణ్ని కీర్తించడమే అన్నమయ్య ప్రధానధ్యేయంగా



కనపడుతుంది. అందులకే ప్రతిపాదం చివర "రామా" అని అంత్యాను ప్రాసంలో వీనులకువిందుగా గానంచేసినాడు.

అట్లే అన్నమయ్య, రావణసంహారానంతరం యుద్ధభూమిని కన్నులకు కట్టినట్లుగావర్ణిస్తూ ఇంచుమించుగా అర్థభేదంలోని యమకాలంకారంలో వర్ణించినాడు.

**సామంతం**

**సమసె రావణుఁడు సమరములోపల**
**అమరులు కడు ముదమందరి మెరసి** ॥పల్లవి॥

**బెరగిరి రామునిశరముల కసురలు**
**సురిగిరి పోట్ల చురకునను**
**తొరిగిరి నెత్తుటఁ దునియలు సేసిన**
**తిరిగిరి తరుమఁగ దిక్కులకు** ॥సమ॥

**కూలిరి భల్లూకకుల ఘోషములకు**
**వాలిరి వాయుజ వాలహతి**
**వీలిరి యంగదు వివిధనాదముల**
**తూలిరి సుగ్రీవు దోర్బలమునను** ॥సమ॥

**దాఁగిరి లక్ష్మణుదాకకు నులుకుచు**
**వీఁగిరి వనచరవితతికిని**
**పాఁగిరి శ్రీవేంకటపతి కృపారసమునఁ**
**దోఁగిరి జనులు సంతోసంబునను** ॥సమ॥

**(సంపు-11. పుట.155 సంకీర్తన.228)**

రావణుఁడు సమరంలో సమసినాడు. విజయలక్ష్మిరాముణ్ని వరించింది. 'దేవతలంతా సంబరపడినారని' అన్నమయ్య పల్లవిలో సంతోషంతో

చెప్పుతూ తర్వాతిచరణాల్లో శ్రీరాముని సేనలోని వీరుల విజృంభణమును తట్టుకోలేని దానవుల అవస్థలను ప్రతిచరణంలోను అర్థభేదం లేని యమకంలో వర్ణించినాడు అన్నమయ్య.

తాళ్లపాక అన్నమాచార్యులు ఒక్క శబ్దాలంకారాలేకాదు అర్థాలంకారాల్లో సైతం రామకథను గానం చేసినాడు.

"లోకాభిరాముడైన దశరథరాముడు అందరికి రక్షకుడు. ఆయన కామితఫలదుడు" చరాచరభూతాలన్నిటికి ఆయనే కర్త" అని తెలిసి కొలువరో జనులారా! అని అన్నమయ్య రామావతారవైభ అందలివిశేషాలను ఉదాత్తంగా ఈ క్రింది అధ్యాత్మకీర్తనయందు ఉదాత్తాలంకారంలో వర్ణించినాడు.

**నాట**

**రాముఁడు లోకాభిరాముఁడందరికి రక్షకుఁడీతనిఁ దెలిసి కొలువరో**
**కామితఫలదుఁడు చరాచరములకుఁ గర్తయైన సర్వేశ్వరుఁడితఁడు**
**॥పల్లవి॥**

**తలఁప దశరథుని తనయుఁడట తానె తారకబ్రహ్మమట**
**వెలయ మానుషపు వెగటు హరువిల్లు విరిచెనట**
**అలరఁగ తానొక రాజట పాదాన నహల్యాశాపము మాన్పెనట**
**సొలవక దైవిక మానుషలీలలు చూపుచు మెరసీఁ జూడరో యితఁడు**
**॥రాముఁ॥**

**జగతి వసిష్ఠుని శిష్యుఁడట జటాయువుకు మోక్షమిచ్చెనట**
**అగచరులే తన సేనలట అంబుధి కొండలఁగట్టెనట**
**మగువకొరకుఁ గానట కమలాసను మనుమనిరావణుఁ జంపెనట**
**తగ లౌకికవైదికములు నొక్కట తానొనరించీఁ జూడరో యితఁడు**
**॥రాముఁ॥**



**వెస నమరుల వరమడిగెనట విభీషణు పట్టము గట్టెనట**
**యెసగ నయోధ్యకు నేలికట యింద్రాదులకుఁ గొలువిచ్చెనట**
**పొసగ శ్రీ వేంకటగిరి నివాసమట భువనము లుదరంబున ధరించెనట**
**సుసరపు సూక్ష్మాధికములు తనందుఁ జూపుచునున్నాఁడు చూడరోయితఁడు**
**॥రాముఁడు॥**

**(సంపుటము-10-సంకీర్తన-277)**

తలంచిచూస్తే ఆయన దశరథునికొడుకు మాత్రమే. కాని తాను ముక్తినొసగే తారకబ్రహ్మం. వేసమేమో సామాన్యమనిషి. కాని హరువిల్లు విరిచిన అతిలోక మానిసి. అతనొక రాజట! కాని తన పాదస్పర్శచేత రాతిని నాతిగా (అహల్య) చేసిన మహానుభావుడు. ఇలాగ ఇటు మానుషలీలలు అటు అతిమానుష (దైవిక) లీలలు చూపుతూ ప్రకాశిస్తున్న రాముణ్ని చూడరో అంటూ అన్నమయ్య మొదటిచరణంలో బాల అయోధ్యకాండల్లోని కథ వర్ణించినాడు.

జగతిలో వసిష్ఠుని శిష్యుడట. కాని జటాయువునకు ముక్తి ప్రదాత! వానరులే తన సేనలట. వారితో సంద్రంలో, కొండలతో వారధి గట్టెనట. మగువమాటకొరకై కానకు వెళ్లినవాడట. కాని రావణబ్రహ్మను చంపినవాడట. ఈ విధంగా ఒకవైపు లౌకిక కార్యాలు మరొకవైపు అలౌకికకార్యాలు తానొక్కడే చేస్తున్నవానిని చూడరో! అంటూ అన్నమయ్య ఇందులో అరణ్య కిష్కింధ సుందర యుద్ధకాండల్లోని కథను వర్ణించినాడు.

రాక్షస సంహారానికై వానరులుగా పుట్టుమని అమరులను వరమడిగినాడట. కాని విభీషణుణ్ని లంకకు రాజుగా చేసెనట. అయోధ్యకు మాత్రమే రాజట. ఇంద్రాది దేవతలకుకూడ కొలువిచ్చినవాడట; వేంకటాచలమే అతని నివాసమట. కాని అఖిల భువనాలు అతని ఉదరంలో గలవట! ఇలాగ సూక్ష్మాధికాల రెండింటిని చూపుతున్న పురుషోత్తముడైన రాముణ్ని దర్శించండి!

అని అంటూ అన్నమయ్య ఈ కీర్తనలో రామునిలోకోత్తరవిశేషాలను ఉదాత్తాలంకారంలో ఉగ్గడిస్తూ రామకథను పైవిధంగా కీర్తించినాడు.

అన్నమాచార్యులపదసాహిత్యంలో భజనకీర్తనలుకూడా బాగా చోటు చేసుకున్నాయి. అనగా వీటిని కొంతమంది గుంపుగాపాడుతూ వలయాకారంగా ఆడుతూ (చిందులేస్తూ) చేతుల్లోన్ని చెక్కలతో తాళం వేసుకుంటూ ఈ సంకీర్తనలను పాడుకొంటారు. వారందరి మధ్యలో గరడగంభంగానీ, కల్పవృక్షంగానీ పెట్టుకొని దానిచుట్టూ భజనచేస్తూ చిందులేస్తారు. ఇట్టివాటిని చెక్కభజనలంటారు. అంతేకాదు. మామూలు భజన మందిరాల్లోకూడా వీటిని పాడుకుంటూ భజనచేస్తారు. ఈ పాటలనే 'గోవిందరామనామా' లని అంటారని. వీటిని కొందరు వయసుమళ్లిన స్త్రీలు ఇట్టిపాటలు పాడుకుంటూనే తమపనులు చేసుకునేవారని శ్రీ ఆచార్యబిరుదరాజు రామరాజుగారు చెప్పారు[1]. అట్టి భజనసంకీర్తనలు దండిగానే వ్రాసినాడు మన అన్నమయ్య. అందులో ఈ క్రిందిది రామకథను కీర్తిస్తూ రచింపబడిన భజనసంకీర్తన. ఇందులోకూడా మనోహరమైన అంత్యానుప్రాసం చోటు చేసికుంది.

**దేవగాంధారి**

**ఎంతని నుతియింతు రామరామ యిట్టె నీప్రతాపము రామరామ**
**పంతాన సముద్రము రామరామ బంధించవచ్చునా రామరామ**
**॥పల్లవి॥**

**బలుసంజీవనికొండ రామరామ ఒక్కచేత మోసితివట రామరామ**
**కొలఁదిలేని వాలిని రామరామ ఒక్కకోల నేసితివట రామరామ**
**వెలయ నెక్కువెట్టి రామరామ హరువిల్లు విరిచితివట రామరామ**
**పెలుచ భూమిజను రామరామ పెండ్లాడితివట రామరామ**
**॥ఎంత॥**

1. 1981 మే. అన్నమయ్యజయంత్యుత్సవంలో శ్రీ ఆచార్య బి. రామరాజుగారి ఉపన్యాసం.



**శరణంటే విభీషణుని రామరామ చయ్యనఁ గాచితివట రామరామ**
**బిరుదుల రావణుని రామరామ పీఁచమడఁచితివట రామరామ**
**ధరలోఁ జక్రవాళము రామరామ దాఁటి వచ్చితివఁట రామరామ**
**సురలు నుతించిరట రామరామ నీచొప్పుయిఁక నదియెంతో రామరామ**
**॥ఎంత॥**

**సౌమిత్రి భరతులు రామరామ శత్రఘ్నులుఁ (డు?) దమ్ములట రామరామ**
**నీ మహత్త్వము రామరామ నిండె జగములెల్లా రామరామ**
**శ్రీమంతుఁడ వన్నిటాను రామరామ శ్రీవేంకటగిరిమీఁది రామరామ**
**కామితఫలదుఁడవు రామరామ కౌసల్యానందనుఁడవు రామరామ।**
**॥ఎంత॥**

**(సంపు-11. భాగ-1. సంకీర్తన-190)**

పై సంకీర్తనలో రాముని ప్రతాపాన్ని కీర్తిస్తూ, రాముడు సాధించిన గొప్పగొప్పకార్యాలను ఏకరువుపెడుతూ, తద్వారా రామకథను వర్ణిస్తూ, ఆ కౌసల్యానందనుడైన రాముడే వేంకటగిరిమీద వేంచేసి శ్రీమంతుడైవున్న తిరుమలేశ్వరుడు అని భక్తితో తన్మయించి శ్రావ్యంగా కీర్తించినాడు తాళ్ళపాక అన్నమాచార్యుడు.

పదకవితాపితామహుడైన అన్నమయ్య ఈ క్రింది సంకీర్తనలో తిరుగులేని రామబాణంయొక్క గొప్పదనాన్ని వర్ణిస్తూ, అది ఎదురులేక ఎవరెవరిని ఎలా పరిమార్చిందో తెలుపుతూ, రక్కసులారా రామునికి శరణంటూ రక్షణపొంది బ్రదకండి! అని పల్లవిలో ప్రబోధిస్తున్నాడు.

**సామంతం**

**రామునికి శరణంటె రక్షించీ బ్రదుకరో**
**యేమిటికి విచారాలు యిఁకదైత్యులాల ॥పల్లవి॥**

చలమునఁ దాటకిఁ జదిపిన బాణము
లలి మారీచసుబాహులపై బాణము
మెలఁగి పరశురాము మెట్లేసిన బాణము
తళ తళ మెరిసీని తలరో యసురలు ॥రాము॥

మాయామృగములమీఁద మరివేసిన బాణము
చేయి చాఁచి వాలినేసిన బాణము
తోయధిమీఁద వటు తొడిగిన బాణము
చాయలు దేరుచున్నది చనరో దైతేయులు ॥రాము॥

తగఁగంభకర్ణునితల ద్రుంచినబాణము
జిగి రావణుఁబరిమార్చిన బాణము
మిగుల శ్రీవేంకటేశు మేఁటిపొదిలోనున్నది
పగసాధించీ నిఁకఁ బారరో రాకాసులు ॥రాము॥

(సంపు-10. సంకీ-283)

మొదటిచరణంలో, తాటకను చంపినబాణమనీ, మారీచ సుబాహులపై వేసినబాణమనీ, మేటియైన పరశురాముణ్ణి చిన్నబుచ్చిన బాణమనీ రామ బాణమనీ రామబాణాన్ని గూర్చి చెప్పడం ద్వారా అన్నమయ్య, బాలకాండ, అయోధ్యాకాండల్లోని కథను సంక్షిప్తంగా వర్ణించినాడు.

అట్లే మాయలేడిని వేసినబాణంగా, వాలిని చంపినబాణంగా, సముద్రుణ్ని బంధించిన బాణంగా రామబాణాన్ని కీర్తించుటద్వారా ఆరణ్య, కిష్కింధ సుందరకాండల్లోని కథను రెండవచరణంలో వర్ణించి నట్లయ్యింది.

రావణ కుంభకర్ణాదులను సంహరించిన బాణమని చెప్పినందువల్ల మూడవచరణంలో యుద్ధకాండ వర్ణింపబడింది. ఆ రామబాణమే శ్రీవేంటేశుని అమ్ములపొదిలో ఉన్నదని వర్ణిస్తూ ఆ రామునికీ ఈ తిరువేంకటేశునికీ అభేదాన్ని సృష్టించినాడు మన అన్నమాచార్యులు.



ఈ విధంగా తాళ్ళపాక అన్నమాచార్యులు కొన్ని వందల సంకీర్తనల్లో రామకథను, రామాయణకథాఘట్టాలను చక్కగా చిక్కగా వర్ణించినాడు. ఆ అయోధ్యారాముడే ఈ వెంకటాద్రిపై నెలకొన్న పరంధాముడనీ అడుగడుగునా ఇరువురికీ అభేదాన్ని కల్పిస్తూ, ఒకరిలో ఇంకొకరిని దర్శించి, భక్తిపారవశ్యం చెందిన మహనీయుడు తాళ్ళపాకఅన్నమాచార్యులు. ఈ భక్తి సాహిత్య విహాయసంలో ఆయన ఒక ధ్రువతార.

**శ్రీరాగం**

రామచంద్రుఁడితఁడు రఘువీరుఁడు
కామితఫలములియ్యఁ గలిగె నిందరికి ॥పల్లవి॥

గౌతముభార్యపాలిటి కామధేనువితఁడు
ఘాతలఁ గౌశికుపాలి కల్పవృక్షము
సీతాదేవిపాలిటి చింతామణీతఁడు
యీతఁడు దాసులపాలి యిహపరదైవము ॥రామ॥

పరగ సుగ్రీవుపాలి పరమబంధుఁడితఁడు
సరి హనుమంతుపాలి సామ్రాజ్యము
నిరతి విభీషణునిపాలి నిధానము
గరిమ జనకుపాలి ఘనపారిజాతము ॥రామ॥

తలఁప శబరిపాలి తత్వపురహస్యము
అలరి గుహునిపాలి ఆదిమూలము
కలఁడన్నవారిపాలి కన్నులెదుటిమూరితి
వెలయ శ్రీవేంకటాద్రివిభుఁడితఁడు ॥రామ॥

(సంపు-10. సంకీ-147)

-"ఆంధ్రప్రభ" దినపత్రికలో ప్రచురితం

# 23. దశావతారములు - అన్నమయ్య

**" పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే । "**

అని శ్రీకృష్ణుని వచనము. దుర్జనులను శిక్షిస్తూ, సజ్జనులను రక్షిస్తూ ధర్మాన్ని నిలుపుటకై భగవంతుడు యుగయుగాల్లోను అవతరిస్తాడని భావం. గూఢముగనున్న ఆ పరమేశ్వరుడు తాను ప్రకటితమగుటయే అవతారము'.

కాలం అనాది. గడచిన అనంతకాలంలో పుట్టిన లోకకంట కులనే కులను తునుమాడి లోకంలో ప్రశాంతతను కలిగించుటకై పరమాత్ముడు ఎన్నోమార్లు అవతరించాడు. వానిలో ముఖ్యంగా చెప్పుకొని స్మరింపదగ్గవి దశావతారాలు. ఈ దశావతారాలు

**" మత్స్యః కూర్మో వరాహ శ్చ నారసింహోఽథ వామనః ।**
**రామో రామ శ్చ రామ శ్చ బుద్ధః కల్కిరేవ చ ॥"**

అని వరుసగా శ్లోకరూపంలో చెప్పబడ్డాయి ఈ దశావతారాల్లో కొందరు బలరామావతారానికి బదులుగా కృష్ణావతారాన్నికూడా చేరుస్తారు. మరికొందరు పెద్దలు బలరామకృష్ణుల్లో ఏ ఒక్కర్ని స్వీకరించినా ఇరువురను స్వీకరించినట్లే అనిచెప్పడం కద్దు.

మన భారతీయవాఙ్మయంలో ఈ దశావతారాలు అనేకచోట్ల అనేకగ్రంథాల్లో వర్ణింపబడ్డాయి. ప్రధానంగా మన ఆంధ్రవాఙ్మయంలో 'దశావతారాలు - వానిపరిశీలన' ను గూర్చి అన్వేషించినట్టయితే ఒక పరిశోధనాగ్రంథమే తయారౌతుందని చెప్పవచ్చు. మన జానపద వాఙ్మయంలోను. శతకవాఙ్మయంలోను, భారత భాగవతాది మహాకా వ్యాల్లోను, మనుచరిత్రాది ప్రబంధాల్లోను, అనేక యక్షగానాల్లోను ఈ దశావతారాలు చాల చక్కగా చిక్కగా వర్ణింపబడి వున్నాయి. పూర్వం నుంచీ





జానపదుల్లో పాటలుగాను. పదకవితలుగాను, కీర్తనరూపంలోను దశావతారాలు తెలుగునాట, తెలుగునోట అత్యంత ప్రచారాన్ని పొందాయి. లలితకళల్లో చరకళలైన సంగీత సాహిత్యాల్లోనేకాక, స్థిరకళలైన చిత్రలేఖన శిల్పకళల్లోకూడ దశావతారాలు ప్రముఖస్థానాన్ని ఆక్రమించి వున్నాయని వక్కాణించవచ్చు. అందుచేతనే ప్రతి విష్ణ్వాలయ గోపురాలమీదా, కుడ్యాలమీదా ఈ దశావతారాల శిల్పాలు, చిత్రాలు నయనానందకరంగా దర్శనమిస్తుంటాయి.

ఈ దశావతారాలు 'హరియవతార' మని కొనియాడబడిన తాళ్లపాక అన్నమయ్య వాఙ్మయంలో, అంటే ఆ సంకీర్తనాచార్యులు సృజించిన పదాల్లో ఆవిష్కరించిన తీరును స్థాలీపులాకంగా పరికించడమే ప్రకృత వ్యాసలక్ష్యం.

అన్నమాచార్యులు మనసా, వాచా, కర్మణా శ్రీవేంకటేశ్వరుని భక్తుడు. భక్తుడేకాదు కవీ, పండితుడూ. సంకీర్తనాచార్యుడుకూడ. శేషాద్రిపైన

నెలకొనిఉన్న 'అభయప్రదాత' శ్రీ అలమేల్మంగావల్లభుడే ధర్మసంస్థాపనార్థమై యుగ యుగాల్లో అవతరించినాడనీ, ఎన్నో ఘన కార్యాలుసాధించినాడనీ అన్నమయ్యభావన. ఆ భావనలోనే తన్మయుడై అన్నమయ్య అహోరాత్రాలు ఆలాపించినాడు ఆ ఆశుకవితాలాపనలే "సర్వమంత్ర రహస్యోద్భావ నములైన" పదకవితలుగా విరాజిల్లినాయి. అందుకే అన్నమయ్య కేవలం భక్తుడుగానే గాక 'పదకవితాపితామహుడు' గా కూడ లోకంచే కీర్తింపబడ్డాడు.

తెలుగువారి దేశీయతకు అద్దం పట్టేవి పొడుపుకథలు. ఈ పొడుపు కథలు ఆబాలగోపాలంలో జిజ్ఞాసను రేకెత్తించి ఆలోచనాసక్తిని పెంపొందింపజేస్తాయి. ఉదాహరణకు

**" మూఁడుకన్నులుండుగాని ముక్కంటియును గాఁడు"**
**జుట్టు గలదు నెమలిపిట్ట గాదు"**

అని ఆలంకారికంగా టెంకాయనుగూర్చి చెప్పబడిన పొడుపుకథలో ఒక అర్థోత్సుకత ద్యోతకమౌతుంది. ఈ పొడుపుకథల సరళిలోనే అన్నమయ్య దశావతారాలను ఈ క్రిందిపాటలో ఎలా వర్ణించాడో చిత్తగింపవచ్చును.

**రామక్రియ**

**ఎవ్వఁడోకాని యెరుఁగరాదు కడు**
**దవ్వులనే వుండు తలఁపులోనుండు ॥పల్లవి॥**

**ఎడయవు తనరెక్కలెగసి పోలేఁడు**
**కడుదాఁగు గాని దొంగయుఁ గాఁడు**
**వడిఁ గిందుపడును సేవకుఁడును గాఁడు**
**వెడఁగు గోళ్లువెంచు విటుఁడునుఁగాడు ॥ఎవ్వఁ॥**

**మిగులాఁ బొట్టివాఁడు మింటికినిఁ బొడవు**
**జగడాలు, తపసివేషములును**



**మగువకైపోరాడు మరి విరక్తుఁడును**
**తగుఁగాపుఁబనులు నెంతయుఁదెల్లఁదనము ॥ఎవ్వఁ॥**

**తరుణుల వలపించు తగిలిపైకొనఁడు**
**తురగముఁ దోలు, రౌతునుఁ గాఁడు**
**తిరువేంకటాద్రిపైఁ దిరుగు నెప్పుడును**
**పరమమూర్తియై పరగు నీ ఘనుఁడు ॥ఎవ్వఁ॥**

**(సంపు - 11. భాగ-3. సంకీ-8)**

భగవంతుడు దవ్వులా, అవ్వలా, తలపులో మలపులో అంతటా వుంటాడు. వాడు సర్వాంతర్యామి. కాని వాడే వీడని, ఇలా వుంటాడనీ, ఎరుగుట కడు అసాధ్యమనీ పల్లవిలో అన్నమయ్య వాకొన్నాడు. కాని పాట చివరి రెండుపాదాల్లో వేంకటాద్రిపై వెలసినఘనుడే వాడనీ, వాడే యుగయుగాల్లో అవతారాలెత్తాడనీ వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

'ఎడయవు తన రెక్కలెగసి పోలేఁడు' అనుపాదంలో మత్స్యావ తారం వర్ణింపబడింది. చేపకు రెక్కలుఁటాయి. అంతమాత్రముచేత అది పక్షివలె ఎగరలేదని సారాంశం.

'కడు దాఁగుఁగాని దొంగయుఁగాడు'! దాక్కునేలక్షణం దొంగది. తాబేలు కూడా తనతలను లోపలికి ముడుచుకొని దాక్కుంటుంది. అంతమాత్రం చేత అది దొంగగాదు. అందువల్ల పైవాక్యంలో విష్ణువుయొక్క కూర్మావతారం వర్ణింపబడింది.

'వడిఁగిందు పడును సేవకుఁడును గాఁడు'. ఎప్పుడూ తలవంచుకొని వస్తువులనుమోస్తూవుంటాడు సేవకుడు. అట్లే అతనూ తనతలనువంచి భూమిని మోసినాడు వరాహావతారంలో. సేవకుడుగా మాత్రంకాదని అర్థం.

'వెడఁగు గోళ్లువెంచు విటుఁడునుఁగాడు' అనడంలో నరసింహావతారం చెప్పబడింది. నరసింహుఁడు శ్రద్ధగా, వాడిగా పెంచిన గోళ్లను

హిరణ్యకశిపుని చీల్చుటకేగాని, భూదేవిని కవయగోరు విటుడుగా మాత్రంకాదని సారాంశం.

"మిగులాఁ బొట్టివాఁడు మింటికినిఁ బొడవు" అని చెప్పడంలోమొదట పొట్టిగానుండి తదుపరి 'ఇంతంతై వటుఁడింతై' అన్నట్లు బ్రహ్మాండాన్నా వరించిన వామనావతారం విరోధాభాసంతో వర్ణింపబడింది.

'జగడాలు తపసివేషములును' తాపసులకు శాంతం సహజలక్షణం. వేషం చూస్తే తాపసి. కాని ముక్కోపి! క్షత్రియులతో జగడాలాడిన శ్రీపరశురాముడిందు వక్కాణింపబడ్డాడు.

'మగువకైపోరాడు మరి విరక్తుఁడును' అన్నవాక్యంలో సీతకోసం రావణునితో పోరాడి జయించిన తదుపరి సీతను త్యజించిన రామావతార మిందు స్పష్టం చెయ్యబడింది.

'తగుఁగాఁపుఁ బనులు నెంతయుఁ దెల్ల ఁదనము'. నాగేలి (మడక) ధరించిన కాపులు సేద్యంచేసి నల్లబడి వుంటారు. కాని నాగేలిని ధరించినవాడైనా తెల్లగా ఉంటాడనడంలో బలరాముడిందు పేర్కొన బడ్డాడు.

'తరుణుల వలపించు తగిలి పైకొనఁడు'. అన్న వాక్యంలో త్రిపురస్త్రీలను వలపించుకొని తానుమాత్రం వారివలలో తగలని బుద్ధావతారం స్పష్టం కావింపబడింది.

'తురగముఁ దోలు, రౌతునుఁ గాఁడు'. గుఱ్ఱంమీద సంచరించును. కాని గుఱ్ఱపురౌతు గాదనుటలో కల్క్యవతారం వర్ణింపబడింది.

ఇట్లు అన్నమాచార్యులు పై అధ్యాత్మసంకీర్తనలో కొన్ని విశిష్ట లక్షణాలద్వారా వర్ణించిన దశావతారాలు తన జీవితసర్వస్వమైన శ్రీవేంకటేశ్వరస్వామిలో దర్శించి తనివి చెందినాడు.

* * * * *



యాచకులకోరికలను తీర్చువారిని దాతలంటారు. కాని యాచకుల సమస్తకోరిలన్నీ నెరవేర్చెడి దానపరులు లోకంలో చాల అరుదు. అట్టి దాతను అన్నమయ్య వెతికి వెతికి చివరకు తిరుమలలో కను గొన్నాడు. ఆ ఉత్తమ దానపరుడు చేసినదానాలను వల్లెవేస్తూ తద్వారా 'అల్పాక్షరాలలో అనల్పార్థరచన' అన్నట్లుగా తునక తునక తేటతెలుగుమాటలలో శ్రీ మహావిష్ణువుయొక్క దశావతారాలను ఈ క్రింది అధ్యాత్మకీర్తనలో పేర్కొన్నాడు భక్తకవి అన్నమయ్య.

**సామంతం - అవతారాలు**

**తానే కాకెవ్వరు మాకు దాతయు దైవము**
**లోనఁబెట్టుకొని మాకు లోనైనవాఁడు ॥పల్లవి॥**

**చదివించి, కూడువెట్టి, జారకుండ నిల్లుగట్టి,**
**బెదురులేని బుద్ధి పిన్ననాఁడే చెప్పి,**
**యెదిరి నడిగి, ద్రవ్యమిది గొమ్మనుచు నిచ్చి,**
**పదిలమై తమ్ముఁ బాలించువాఁడు ॥తానే॥**

**మోహవియోగమ్ము, మోహానురాగమ్ము,**
**దేహవిభాగంబు దెలిపిన కలికి**
**ఐహికమున వేంకటాచలాధీశుఁడై సర్వ -**
**దేహరక్షకుఁడై తిరుగుచున్నాఁడు ॥తానే॥**

**(సంపు-11. భాగ-3. సంకీ-63.)**

'మాకు దాతా, దైవమూ నీవేనయ్యా! నీవుకాక మరెవ్వరుమాకు దిక్కు? మమ్ము కడుపులో బెట్టుకొని రక్షించే కొంగుబంగారము నీవేనయ్యా!' అని అన్నమాచార్యులు శ్రీవేంకటేశ్వరుని 'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' అన్నట్లు పల్లవిలో శరణువేడి ప్రార్థించినాడు.

తదుపరి 'చదివించి' అన్నచిన్నపదంలో మొదట సోమకాసుర సంహారం పిమ్మట వేదరక్షణచేసి వాటిని లోకులందరు చదివేటట్లు ఒనర్చిన మత్స్యావతారం పేర్కొనబడింది.

'కూడువెట్టి' అన్న నాల్గక్షరాల్లో కూర్మావతారం వర్ణింపబడింది. సముద్రమథనానికి కవ్వంగా మందరాద్రి ఉపయోగపడింది. అప్పుడు విష్ణువు కూర్మావతారమెత్తి దాన్ని ధరించినాడు. అమృతం వెలువడింది. దాన్ని దేవతలంతా కూడుగా తిన్నారని సారాంశం.

'జారకుండ నిల్లుగట్టి'. అందరికీ భూమే నివాసం. దాన్ని హిరణ్యాక్షుడు నీటిలో త్రోశాడు. నీటిలో జారిపోకుండా విష్ణువు వరాహావతారమెత్తి భూమిని రక్షించి నివాసయోగ్యం (ఇల్లుకట్టించుట) చేశాడనిపై వాక్యాని కర్థం

'బెదురులేని బుద్ధి పిన్ననాఁడే చెప్పి' లో శ్రీనృసింహావతారం స్పష్టం చెయ్యబడింది. ప్రహ్లాదుడు పిన్నవాడు. తండ్రిచే బెదురు తిన్నాడు. విష్ణువు నృసింహావతారమెత్తి హిరణ్యకశిపుణ్ని సంహరించి, ఆ చిన్నవాని బెదురు పోగొట్టినాడని తాత్పర్యం

తాను ఒకరికి ఇవ్వడమే కాదు ఇతరులకొరకై తాను ఇంకొకరిని 'దేహి' యని యడగడమే 'ఎదిరి నడుగడం' అంటే లోక కల్యాణార్థమై బలిచక్రవర్తిని మూడడుగుల నేలను యాచించిన విష్ణువు యొక్క వామనావతారం ఇందులో వక్కాణింపబడింది.

భూమండలమంతా జయించిపగదీర్చుకొన్న వాడు పరశురాముడు. దానిని ద్రవ్యంగా కశ్యపునికి దానమిచ్చిన పరశురామావతారం "ద్రవ్యమిది గొమ్మనుచు నిచ్చి" అన్న వాక్యంలో స్పష్టం.

"పదిలమై తమ్ముఁబాలించువాఁడు". త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు పదిలంగా రాజ్యమేలి 'రామరాజ్య' మని కీర్తికెక్కిన రామావతారమిందు పేర్కొనబడింది.



'మోహవియోగమ్ము' అని అనడంలో, అష్టభార్యలు, పదారు వేలగోపికలు వున్నప్పటికీ తాను అంటీ అంటనట్లుగావున్న శ్రీకృష్ణావ తారం యొక్క విశిష్టత ఉట్టంకింపబడింది. "మోహానురాగమ్ము" ద్వారా త్రిపురాసురల భార్యలమానములను గుల్లచేసిన బుద్ధవతారమిందు విదితం చెయ్యబడింది. వీరు పుణ్యులు వీరు పాపాత్ములు అని 'దేహ విభాగంబు' చేసిన కల్క్యవతారాన్నిగూర్చి, తాళ్ళపాక అన్నమాచార్యులు వర్ణించినాడు.

పె పాటలో మరొకవిశేషం! విద్యాదానం, అన్నదానం, గృహదానం, అభయప్రదానం, ఇతరులకై తాను యాచనచెయ్యడం, దానమివ్వడం, రక్షించడం, తనప్రేమను త్యాగం చెయ్యడం. ప్రేమించడం, పరులభాధలను తొలగించడం వంటి గుణాలను అన్నమాచార్యులు తెలుపుతూ ఇవన్నీ ఉత్తమదాత అనబడేవాని లక్షణాలనీ పైపాటలో చెప్పక చెప్తున్నాడు.

* * * * *

సాధారణంగా భూతాలు ఎవరినోఒకరిని పట్టుట వాటి సహజలక్షణం. కాని అన్నమయ్య శ్రీవేంకటగిరిపైన కనుగొన్న నల్లని పొడవైన వింత భూతం వాళ్ళనూ, వీళ్ళనూ అనకుండా భూమిలో అందరినీ ఆవహించి వుందట!

తాళ్ళపాకఅన్నమయ్య క్రింది పాటలో "పెద్ద ఓడలను మ్రింగుట, ఎముకలను మోయుట. కోపముతో పైబడుట. భీతిగొల్పుముఖం కలిగివుండుట. పెద్ద చేటకాళ్ళు కలిగిండుట, పోటైన మగలనుకూడా పట్టుట, బిరుసైనజడలు కలిగివుండుట, నల్లనిముసుగుతో నుండుట. ఉత్తబిత్తల తిరుగుట. పెద్ద పెద్దఅంగలతో నడచుట, పరుగెత్తుట" వంటివి భూత లక్షణాలుగా చెప్తూ వానిలో శ్రీవేంకటేశ్వరుని దశావతారాలను చక్కగా నిర్దేశించినాడు.

**వరాళి**

**పుడమి నిందరిఁ బట్టె భూతము కడుఁ**
**బొడవైన నల్లనిభూతము ॥పల్లవి॥**

**కినిసి వోడమింగెడి భూతము**
**పునుకవీఁపు పెద్దభూతము**
**కనలి కవియు చీఁకటిభూతము**
**పొనుగు సోమపుమోముభూతము ॥పుడ॥**

**చేటకాళ్ల మించిన భూతము**
**పోటుదారుల పెద్ద భూతము**
**గాఁటపు జడల బింకపుభూతము**
**జూటరి నల్లముసుఁగుభూతము ॥పుడ॥**

**కెలసి బిత్తలే తిరిగేటి భూతము**
**పొలుపుదాంట్ల పెద్దభూతము**
**బలుపు వేంకటగిరిపయిభూతము**
**పులుగుమీఁదిమహాభూతము ॥పుడ॥**

**(సంపు - 11. భాగ-3. పంకీ-43)**

'కినిసి వోడమింగెడి భూతము', ఓడలు సముద్రాల్లోనే వుంటాయి. ఆ ఓడలనుమింగే సముద్రభూతంగా చెప్పినందువల్ల మత్స్యావతారం స్పష్టం చెయ్యబడింది.

'పునుకవీఁపు పెద్దభూతము'. పునుక అనగా పుఱ్ఱె లేదా ఎముక. ఎముకను వీపునమోస్తున్న భూతంగా చెప్పినందువల్ల. వీపున చిప్పగల కూర్మావతారంగూర్చి వర్ణింపబడింది.

'కనలి కవియు చీఁకటిభూతము' చీకటి భూతమనగా నల్లని భూతం లేదా చీకట్లో సంచరించే భూతమని అర్థం. అది ఎట్లావుంది. కోపంతోకూడి మీదికి కవ్వించినట్లుగా దూకుతుంది అంటే హిరణ్యాక్షుడు భూమిని నీళ్లలో త్రోసినప్పుడు లోకం చీకటయ్యింది. ఆ చీకట్లోనే శ్రీమహావిష్ణువు కోపోద్రిక్తుడై



నల్లనివరాహావతారమెత్తాడని సారాంశం "ఉద్ధృతాపి వరాహేణ కృష్ణేన శతబాహునా" అని ఫలశ్రుతి.

'పొనుగు సోమపుమోము భూతము'. అనగా భయంకరమైన మొగంగల భూతం. కనుక విష్ణువు భయంకరవదనంతో నృసింహుడై ప్రహ్లాదవరదుడుగా అవతారమెత్తాడని విదితం చెయ్యబడింది.

'చేటకాళ్ల మించిన భూతము' తనకాళ్లతో బ్రహ్మాండాన్నంతా ఆవరించిన వామనావతారం ఇందు వర్ణింపబడింది.

పోటుమగలైన క్షత్రియులను వధించిన పరశురాముడు 'పోటు దారల పెద్దభూతంగా వర్ణింపబడినాడు. అట్లే జడలుధరించి పద్నాలు గేళ్లు అరణ్యావాసం చేసిన రాముడు' గాఁటపు జడల బింకపుభూతమట!

బలరాముడు నీలివస్త్రాన్ని ధరిస్తాడట 'నీలాంబరో రౌహిణేయః' అని అమరము. అందువల్ల 'నల్లని ముసుగు భూతంగా' బలరామావతారం నిర్దేశింపబడింది

'కెలసి బిత్తలే తిరిగేటి భూతము' అన్నవాక్యంలో ఉత్తబిత్తల (దిగంబరిగా) తిరిగి త్రిపురాసురల భార్యలను మోసంచేసిన బుద్ధావతారం వాకొనబడింది.

చివరగా గుఱ్ఱాన్నెక్కి పెద్ద అంగలతో దాటిపోయే కల్కి 'పొలుపుదాంట్ల పెద్దభూతం' గా విమర్శింపబడినాడు.

ఈ విధంగా తాళ్ళపాక అన్నమాచార్యులు భూతలక్షణాలద్వారా శ్రీ మహావిష్ణువుయొక్క దశావతారాలను వర్ణిస్తూ, ఇన్నిరకాల వికారాలను చూపించిన ఈ మహాభూతం వేంకటగిరిపై వేంచేసివుందనీ, పక్షిపై ఎక్కి తిరుగుతుందనీ శ్రీవేంకటేశ్వరస్వామిని ఒక విచిత్ర భూతమని తనివితీరా చిత్రీకరించినాడు.

* * * * *

భక్తకవి అన్నమాచార్యులు శ్రీవేంకటేశ్వరుని వరదహస్తాన్ని కీర్తిస్తూ హరి దశావతారాలను ప్రస్తుతించిన రీతి తీరు క్రింది పాటలో కదు ప్రశంసనీయము.

**సామంతం**

**ఇందరికి నభయంబు లిచ్చుఁ జేయి**
**కందువగు మంచి బంగారు చేయి ॥పల్లవి॥**

**వెలలేని వేదములు వెదకి తెచ్చినచేయి**
**చిలుకుగుబ్బలికిందఁ జేర్చుచేయి**
**కలికియగు భూకాంతఁ గాఁగిలించినచేయి**
**వలనైన కొనగోళ్ళవాఁడిచేయి ॥ఇంద॥**

**తనివోక బలిచేత దానమడిగిన చేయి**
**వొనరంగ భూదానమొసఁగుచేయి**
**మొనసి జలనిధి యమ్ముమొనకుఁ దెచ్చినచేయి**
**యెనయ నాగేలు ధరియించుచేయి ॥ఇంద॥**

**పురసతుల మానముల పొట్ల సేసినచేయి**
**తురగంబుఁ బరపెడి దొడ్డచేయి**
**తిరువేంకటాచలాధీశుఁడై మోక్షంబు -**
**తెరువు ప్రాణుల కెల్లఁ దెలిపెడిచేయి ॥ఇంద॥**

అన్నమాచార్యురు, ఎందరికో అభయములిచ్చే శ్రీవేంకటేశ్వరునిమంచి బంగారుచేయిని కొనియాడుతూ, ఆ హస్తము యుగ యుగాల్లో ఎన్నెన్మి పనులను సాధించిందో స్మరించి స్మరించి తన్మయించి పోతున్నాడు.

'వెలలేనివేదములు వెదకితెచ్చినచేయి'. సోమకాసురుడు వేదాలను అపహరించాడు. విష్ణువు మత్స్యావతారుడై వానినుండి అమూల్యములైన



వేదాలను రక్షించాడని అర్థం 'చిలుకుగుబ్బలి కిందఁ జేర్చుచేయి'. చిలుకుగుబ్బలి అనగా మందరాద్రి దేవదానవులు మందరాద్రిని కవ్వంగా చేసుకొని సముద్రాన్ని మథించారు. విష్ణువు కూర్మావతారమెత్తి ఆ చిలుకుగుబ్బలిని మోశాడని సారాంశం.

'కలికియగు భూకాంతఁ గాఁగిలించినచేయి' లో హిరణ్యాక్షుని బారినుండి భూకాంతను రక్షించి, ఆమెను తన చేతులలో కౌగలించుకొనిన వరాహవతారమిందు స్పష్టం చెయ్యబడింది

'వలనైన కొనగోళ్ల వాఁడిచేయి' తో హిరణ్యకశిపుణ్ని పొట్టి చీల్చినవాడు శ్రీ నరసింహస్వామి. అందుచే ఇందు నరసింహవతారం పేర్కొనబడింది. 'బలిచేత దానమడిగిన చేయి' బలిచక్రవర్తిచేత మూడడుగులనేలను దానంగా పొందిన వామనావతారమిందు స్పష్టం.

'భూదాన మొసఁగుచేయి' రాజులనుండి భూమినంతా జయించి దాన్ని కశ్యపునికి దానమిచ్చిన పరశురామావతారమిందు వర్ణింపబడింది.

'మొనసి జలనిధి యమ్ముమొనకుఁ దెచ్చినచేయి'. రావణ సంహారార్థమై లంకకు పోదలచిన రామునికి సముద్రుడు అడ్డుగా వుండినాడు. అమ్మును ప్రయోగించి సముద్రునిచే దారిప్పించుకున్న రామావతారమిందు వర్ణింపబడింది.

'నాగేలు ధరియించుచేయి' ద్వారా హలధారియైన బలరాముడూ, పురసతుల మానముల పొల్ల సేసినవాఁడు బుద్ధుడనీ, గుఱ్ఱాన్ని నడపేవాడు కల్కి అని స్పష్టం.

ఇట్లు అన్నమయ్య దశావతారాలను వర్ణిస్తూ పైపనులన్నీ సాధించింది వేంకటాచలముపైనున్న వరదహస్తమేనని వాకొనినాడు. ఈ సంకీర్తనా చార్యుని భావనలో శ్రీవేంటేశ్వరుని మూర్తిమాత్రమే దశావతారాలకు

చాలినదనికాదు. శ్రీవేంకటేశ్వరుని ఏ అవయవాన్నైనా దశావతార నిర్వహణకు జోడించి కృతకృత్యుడయినాడు అన్నమాచార్యులు.

* * * * *

**భైరవి**

**వీఁడివో యిదె వింత దొంగ**
**వేఁడిపాలు వెన్న వెరఁజిన దొంగ ॥పల్లవి॥**

**వెలయ నీటఁజొప్పు వేసేటి దొంగ**
**తల గాననీక దాఁగు దొంగ**
**తలఁకక నేల దవ్వేటి దొంగ**
**తెలిసి సందెకాడఁ దిరిగేటి దొంగ ॥వీఁడి॥**

**అడుగుకింద లోకమడఁచేటి దొంగ**
**అడరి తల్లికినైన నలుగు దొంగ**
**అడవిలో నెలవైయున్న దొంగ**
**తొడరి నీలికాసెతోనుండు దొంగ ॥వీఁడి॥**

**మోసమింతులఁ జేయు మునిముచ్చు దొంగ**
**రాసికెక్కిన గుఱ్ఱపు దొంగ**
**వేసాల కిటువచ్చి వేంకటగిరి మీఁద**
**మూసినముత్తైమై ముదమందు దొంగ ॥వీఁడి॥**

**(సంపుటము-11. భాగ-3. సంకీర్తన-110)**

ఈ పాటలో అన్నమాచార్యులు శ్రీవేంకటేశ్వరునికి ఎక్కడలేని దొంగతనాలన్నీ అంటగడ్డి ఆయనను ఒక వింత దొంగగా చిత్రించినాడు. గొల్లెతలఇండ్లలోని వేడి వేడిపాలు వెన్నలు దొంగిలించడమే వాని పనికాదు. వాడొక చిత్రపుదొంగ. దొంగకు దొరబుద్ధులెలావస్తాయి ఈ దొంగపనులు



వాడు యుగ యుగాలనుంచీ చేస్తున్నవే. చేస్తూకూడ తెలియనట్టు ముసి ముసి నవ్వులతో మూసినముత్తెంవలె చిన్మయహాసంతో వెలుగుతున్నా డీ వెఱ్ఱిదొంగ అని చెప్తుతూ తద్వారా తిరువేంకటాధీశుని దశావతారాలను భావస్ఫోరకంగా చిత్రించినాడు అన్నమయ్య.

'నీటఁ జొప్పువేసేడి దొంగ' అన్నదానిలో మత్స్యావతారం పేర్కొన బడింది. నీటిలో దారివేసి ఈదునది మత్స్యమే కదా! 'తల కనపడకుండా దాగే దొంగగా కూర్మావతారం పేర్కొనబడింది. ఏ చిన్న అలికిడైనా తాబేలు తన తల కనపడకుండా చిప్పలోనికి ముడుచు కొంటుంది. నేల తవ్వేటిదొంగ యని చెప్పినందువల్ల హిరణ్యాక్షుని సంహరించి భూమిని రక్షించిన వరాహావతారం చెప్పబడింది. సందెచీకట్లో తిరిగేదొంగగా వర్ణించినందువల్ల సందెచీకట్లో ఆవిర్భవించిన హిరణ్యకశిపుణ్ని వధించిన శ్రీనృసింహావతారం ఇందు వక్కాణింప బడింది.

'అడుగుక్రింద లోకమడఁచేటి దొంగ' అనడంలో తనకాళ్ల క్రింద లోకాలన్నీ అణచిన వామనావతారమిందు స్పష్టం చెయ్యబడింది. సాధారణంగా దొంగలు స్వ పరభేదాలు పాటించరు. వారికి అందరూ సమానులే. అట్లే తల్లినికూడ కోపించినదొంగగా పరశురాముడు పేర్కొన బడ్డాడు. దొంగలకు నిర్మానుష్యమైన అడవులు వుండడానికి అనువైన ప్రదేశాలు. అట్లే ఈ దొంగకూడ అడవిని స్థావరం చేసికొన్నాడని అనడం ద్వారా అరణ్యవాసంచేసిన శ్రీరాముడిందు తెలుపబడినాడు. దొంగలు నల్లనిముసుగుతో సంచరిస్తారు. అట్లే వీడుకూడ నీలికాసె[1] తో నుండేటి దొంగగా వర్ణించినందువల్ల బలరాముడిందు చెప్పబడినాడు.

మోసమింతులఁ జేయు మునిముచ్చు దొంగగా బుద్ధుడు వర్ణింప బడినాడు. మునివేషంలోవుండి త్రిపురాసురుల స్త్రీలను మోసవంచేసిన వాడు బుద్ధుడు. అంతేకాదు వీడు ప్రసిద్ధికెక్కిన గుఱ్ఱపుదొంగ అనుట వల్ల కల్క్యవతారం వర్ణింపబడింది.

నీళ్లలో యీదుకుంటూ వెళ్లడం, తల కనపడకుండ దాగడం, నేల తవ్వడం. చీకట్లో తిరగడం, వస్తువులను దాచిపెట్టడం, స్వ పర భేదం లేకపోవడం, అడవుల్లో జీవించడం, నల్లముసుగులు ధరించడం స్త్రీలను మోసంచెయ్యడం, గుఱ్ఱాలమీద పారిపోవడంవంటి దొంగలలక్షణాల ద్వారా అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని దశావతారాలను వర్ణించినాడు.

ఈ విధంగా దశావతారాలను వర్ణిస్తూ అన్నమయ్య వ్రాసిన పాటలు కోకొల్లలుగా ఉన్నాయి. ఏపాట పాడినా. ఏ భావనచేసినా, అది శ్రీవేంకటే శ్వరునిపైనే. అదే అన్నమయ్య జీవితపరమాశయం. అందువల్లే ఆయన సృష్టించిన సాహిత్యంలోఅంతటా శ్రీతిరుమలేశుని లీలావినోదాలే, చిన్మయహాసాలే, శృంగారలీలలే నిండివున్నాయి. ఆ మాదిరి వర్ణించడం ఒక్క అన్నమయ్యకే సాధ్యం అయ్యింది. అందుకే తాళ్ళపాక అన్నమాచార్యులు పరమభాగవతోత్తముడుగా నిలిచినాడు. ఆయన జీవన్ముక్తుడు.

**వేదంబులు పౌరాణిక**
**వాదంబులు వరకవిత్వవాణీవీణా**
**నాదంబులు కృత సుజనా -**
**హ్లాదంబులు తాళ్ళపాక యన్నయపదముల్**

**- చినతిరుమలాచార్యులు.**

## 24. పవనసుతుడు - అన్నమయ్య

**క॥ సారంబులు హరికరుణా**
**సారంబులు విబుధనికరసంపూర్ణసుధా**
**హారంబులు బహుదేశవి -**
**హారంబులు తాళ్ళపాక యన్నయ పదముల్**

**- చినతిరుమలాచార్యులు.**

భారతీయ వాఙ్మయాల్లోకెల్లా ఆదికావ్యం రామాయణం. తరతరాలుగా మనదేశంలో వర్ధిల్లుతూవున్న వివిధ ప్రాంతాల సారస్వతాలపైనా, ప్రజలపైనా ఆ మహాకావ్యప్రచారప్రభావాన్ని క్రోడీకరించిచూస్తే అది అమోఘంగా, ఆశ్చర్యజనకంగా మనకు దర్శనమిస్తుంది. రామకథ మన సాహి త్యాలన్నింటిలో ఉత్తమకావ్యంగా నాటకంగా - గేయంగా ఇత్యాది వివిధ వాఙ్మయప్రక్రియల్లో అవతరించి ఆరాధ్య పీఠాన్ని అధిష్ఠించివుంది. ఇటు ప్రజాజీవనంలో పరికిస్తే రామమందిరాలు, నామజపాలు, పురాణాలు, హరికథలు, గోష్ఠులు, భజనలు, గుళ్ళు, గోపురాలు, సుందర కాండపారాయణాలు, హనుమదుపాసనలు......... ఇలాగ ఒకటేమిటి! ఆ గాథప్రభావంయొక్క విశ్వరూపం మన మనోనేత్రం ఎదుట సర్వసాధారణంగా సాక్షాత్కరిస్తుంది.

మన సాంస్కృతికజీవనపథంపై ఇంతప్రగాఢంగా ప్రభావం నెరపిన రామాయణంవంటి మహాకావ్యం విశ్వవాఙ్మయంలో మరేది లేదు. రామాయణమహామాలలో రత్నంగా ప్రకాశించేమూర్తి మారుతి. ఆ మహనీయుని పేరు విన్నా లేదా ఆయన కమనీయ స్వరూపం కంటబడినా ఆ రామకార్యధురంధరుని స్వామిభక్తి, సహజశ్రద్ధ సమయజ్ఞత, అకుంఠిత బ్రహ్మచర్యదీక్ష, భక్తులపాలిటి అభయప్రదానతా, ధీరత్వమూ మనకు మనోజ్ఞంగా స్ఫురిస్తాయి. ఆ సంజీవరాయడు చిరంజీవి యని

అశ్వత్థామా బలి ర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః ।
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః ॥

అను పౌరాణిక శ్లోకం చాటుతూవున్నది.

యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥

ఎక్కడైతే రామనామ సంకీర్తన చెవినపడుతుందో అక్కడంతా రాక్షసాంత కుడగు ఆ రామదూత అంజలి ఘటించి ఆనందబాష్పాలతోనిండిన నేత్రాలతో నెలకొని వుంటాడట.

రామాయణమహాకావ్యంలో ఆంజనేయుడు తొలుదొల్త కిష్కింధ కాండలో మనకు దర్శనమిస్తాడు. అంజనానందనుడు సుగ్రీవాజ్ఞపై రామలక్ష్మణుల కడకేగి "ఆజానుబాహులు, విశాలవక్షులు, శరచాప ఖడ్గధారులూనైన ఓ సుందరమూర్తులారా! ఎవరు మీరు? మీ రాకవల్ల ఈ ప్రదేశమంతా పవిత్రమయింది. సందేహమెందులకు? మీరు దేవతలే అయ్యుంటారు. నేను వానరరాజు సుగ్రీవుని మంత్రిగా హనుమంతు దంటారు! అని ఇలాగ ఏకధాటినా తనవాక్చాతుర్యాన్ని నెరపుతాడు. అంతవరకూ నిశ్చేష్టుడై వింటున్న రాముడు, లక్ష్మణునితో హనుమంతుని ఔన్నత్యాన్నిగూర్చి ఇలా ముచ్చటిస్తాడు.

"వాక్యజ్ఞం మధురైర్వాక్యైః స్నేహయుక్త మరిందమమ్
నానృగ్వేద వినీతస్య నాయజుర్వేదధారిణః
నాసామవేద విదుషః శక్యమేవం విభాషితుమ్
నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతం
బహు వ్యాహరతా నేన న కించిదపశబ్దితమ్





అవిస్తర మసందిగ్ధం అవిలంబిత మవ్యథం
ఉరస్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమస్వరమ్
సంస్కారక్రమ సంపన్నా అద్భుతామవిలంబితామ్
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహర్షిణీమ్ ॥"

ఆంజనేయుడు వ్యాకరణపండితుడనీ, వేదత్రయాన్ని క్షుణ్ణంగా తెలిసినవాడనీ, మహావిద్వాంసుడనీ, శాస్త్రవిశారదుడనీ, సమయజ్ఞుడనీ, వాక్చాతుర్యం కలవాడనీ పైరాముని పల్కులవల్ల స్పష్టమౌతుంది.

రామభక్తాగ్రగణ్యుడూ, అపరిమితవిక్రమోన్నతుడూ, అపార మహిమాన్వితుడూ, కామరూపుడూ అయిన ఆ కపివీరుణ్ని పదకవితా పితామహుడైన తాళ్ళపాక అన్నమాచార్యులు తన సంకీర్తనాసందోహంలో ఎలాకీర్తించి కృతకృత్యుడయినాడో దిఙ్మాత్రంగాపరిశీలించి చిత్రించడమే ప్రకృతోద్దేశం.

వరకవితాగుణచతురుడైన అన్నమయ్య సర్వమంత్రపరమరహస్యోద్భావనములైన తనపదకవితల్లో శ్రీ ఆంజనేయస్వామినిగూర్చి ఈ క్రిందిరీతిని వీనులవిందుగా గానం చేసినాడు.

**శంకరాభరణం**

**ఆతఁడా యీతఁడు పెద్ద హనుమంతుఁడు**
**చేతులారా నక్షునిఁ జెండివేసినాఁడట ॥పల్లవి॥**

**తొలుత రామునిగాంచి, తోడనే సుగ్రీవుని**
**కొలువబెట్టి. యాతని కొమ్మ నిప్పించి**
**జలనిధి దాఁటి, లంకసాధించి చొచ్చి, సీతకు**
**నలర నుంగరమిచ్చె నతిసాహసమున ॥ఆతఁ॥**

**సీతాదేవి యానవాలు శ్రీరామునికి నిచ్చి**
**నీతి విభీషణుని మన్నించఁజేసి**
**చేతులనే పోట్లాడి చెండివేసి రాక్షసుల**
**ఘాతల సంజీవికొండ గక్కనఁ దాఁదెచ్చెను ॥ఆతఁ॥**

**గక్కన రావణుఁగొట్టి కాంతను రామునిఁగూర్చి**
**తక్కడ నయోధ్యఁ బట్టమటు గట్టి**
**నిక్కి కలశాపురిని నిండి శ్రీవేంకటాద్రిని**
**వుక్కుమీరి హరిఁగొల్చి వున్నాఁడు వేడుకల ॥ఆతఁ॥**

**(సంపు - 10 సంకీ - 141)**

అక్షకుమారుడనేరాక్షసుణ్ని చేతులతో చెండాడిన హనుమంతు డీతడే అని పల్లవిలో చెప్పుతూ ఆ కపివీరుణ్ని గూర్చి అన్నమయ్య ఇంకా ఇలాగ కీర్తించాడు.

కిష్కింధలో రామలక్ష్మణులసందర్శనానంతరం, వారితో సుగ్రీవునికి స్నేహం కలపడం. సుగ్రీవునిభార్యావియోగం పోగొట్టడం, అతిసాహసంతో జలనిధిని దాటడం, దాటడమే కాకుండ లంకను సాధించడం, తదుపరి సీతకు ఆనవాలుగా రాముని ముద్దుటుంగరాన్ని ఇవ్వడం, మైథిలి ఒసగిన



శిరోమాణిక్యాన్ని తెచ్చి రామునికివ్వడం నీతిమంతుడైన విభీషణునికి శ్రీరామునిచే శరణు ఇప్పించడం రాక్షసులను సంహరించడం, లక్ష్మణ మూర్ఛాసమయంలో సంజీవికొండను అమాంతంగా పెకలించుకొని తేవడం రావణసంహారం చేయించి రామునికి సీతనుకూర్చడం, చివరగా అయోధ్యానగరంలో రాములవారికి పట్టం కట్టించడం ఇత్యాది మహాకార్యాలన్నీ బహుప్రజ్ఞతో ఘటించిన వానరేంద్రుడు ఇటు కలశాపురంలో నిండి, అటు శ్రీ వేంకటాద్రిలోనూ చేరి వేడుకతో హరిని కొలుస్తున్నాడనీ, తాళ్ళపాక అన్నమాచార్యులు, ఆంజనేయుడు కిష్కింధకాండ మొదలు ఆద్యంతమూ నిర్వహించిన పాత్రను చక్కగా సంగ్రహంగా వీనులవిందుగా పై కీర్తనలో గానం చేశాడు.

రాముడు హనుమంతుణ్నే ఎందుకు నమ్మినబంటుగా ఏలినాడు? ఆ రాముణ్నే ఆంజనేయుడు తన ఏలికగా ఎందుకు ఎన్నుకోవలసి వచ్చింది? అనే ప్రశ్నలకు సరియైన సమాధానాలు అన్నమయ్యపాడిన ఈ క్రిందిపాటలో పల్లవిస్తున్నాయి.

**మాళవిగౌళ**

**ఇతఁడే యతండు గాఁబో లేలిక బంటును నైరి**
**మితిలేని రాఘవుఁడు మేఁటి హనుమంతుఁడు ॥పల్లవి॥**

**జలధి బంధించి దాఁటె చలపట్టి రాఘవుఁడు**
**అలరి వూరకే దాఁటె హనుమంతుడు**
**అలుకతో రావణుని యదటణఁచె నతఁడు**
**తలఁచి మైరావణుని[1] దండించెనితఁడు ॥ఇతఁ॥**

**కొండ వెల్లగించెఁ దొల్లి గోవర్ధనుఁడతఁడు**
**కొండతో సంజీవియెత్తెఁ గోరి యీతఁడు**

1. మైరావణునిగాథ వాల్మీకిరామాయణంలో లేదు. జనవ్యవహారంలోనున్న కథలే ఇతర రామాయణాల్లో, అన్నమయ్యసంకీరర్తీనలో చేరివుండవచ్చు.

**గుండు గరఁచె నహల్యకొరకు సీతాపతి**
**గుండు గరఁగఁగఁబాడె కోరి యీతఁడు ॥ఇతఁ॥**

**అంజనాచలముమీఁద నతండు శ్రీ వేంకటేశుఁ**
**డంజనీ తనయుఁ డాయ ననిలజుఁడు**
**కంజాప్తకులరామఘనుఁడు దానును దయా**
**పుంజమాయ మంగాంబుధి[1] హనుమంతుఁడు ॥ఇతఁ॥**

**(సంపు-11 భాగ-1. సంకీర్తన-148)**

సముద్రాలను దాటడంలో శ్రీరామ హనుమంతులిద్దరూ సమర్థులే. జలనిధిని రాముఁడు బంధించిదాటగా. ఊరకే లంఘించి దాటినాడు కపివీరుడు. దుష్టసంహారం చెయ్యడమే వీళ్లిద్దరికీ ఇష్టమైన కర్తవ్యం. ఒకరు రావణసంహారం చేయగా. మరొకరు మైరావణ సంహారం చేశారు.

సంద్రాలను దాటడమే కాదు. ఇద్దరూ కొండలనుకూడా ఎత్తగల భుజబలాఢ్యులే. రాముడు (కృష్ణావతారంలో) గోవర్ధనగిరి నెత్తగా హనుమంతుడు సంజీవికొండను ఎత్తాడు. ఈ స్వామి భృత్యులిరువురూ రాళ్లను సయితం కరగింపజేయగల కరుణామయులే. రఘురాముడు రాతిని కరగించి నాతి (అహల్య) గా చేశాడు. హనుమంతుడేమో తన సంగీత స్వారస్యంచేత రాళ్లను కరగించాడు.

ఒకరికేమో అంజనాచలమే నివాసం. మరియొకరు సాక్షాత్తు అంజనాతనయులు, ఒకరు కంజాప్తకులరాముడు. మరియొకరేమో దయాపుంజమైన మంగాంబుధి హనుమంతుడు.

1. 'మంగాంబుధి' మంగంపేటచెరువు కావచ్చునేమో? అ చెరువుగట్టున ఒక హనుమంతుడున్నాడట. లేదా తిరుపతికి సమీపంలోని మంగాపురం కావచ్చునేమో పరిశీలింపవలసియున్నది. 'మంగసముద్ర' మనుగ్రామం చిత్తూరుజిల్లాలో ఉన్నదట. అక్కడేమైన ఆంజనేయస్వామి యున్నాడేమో!



ఇందుచేతనే కాబోలు ఒకరు ఏలికగా, మరొకరు బంటుగా అయ్యారు అని పల్లవిలో ప్రకటించి అందుకుగల కారణాలను తర్వాతిచరణాల్లో వివరించినాడు అన్నమాచార్యులు.

సర్వదేవాత్మకస్వరూపుడైన హనుంతుని విశ్వరూపాన్ని తాళ్ళ పాక అన్నమాచార్యులు ఈ పాటలో మనకు దర్శింపజేస్తున్నాడు చిత్తగించండి.

**మాళవి**

**ఇతఁడు రామునిబంటు యితని కెవ్వరెదురు**
**చతురత మెరసె నిచ్చట హనుమంతుఁడు ॥పల్లవి॥**

**ఆకాసమంతయ నిండి యవలికిఁదోఁక చాఁచి**
**పైకొని పాతాళానఁ బాదాలు మోపి**
**కై కొని దశదిక్కులు కరములఁ గబళించి**
**సాకారము చూపినాఁడిచ్చట హనుమంతుఁడు ॥ఇతఁ॥**

**కొంచక సురలు రోమకూపముల విహరించ**
**ముంచి ధ్రువమండలము మొగమైయుండ**
**యెంచఁగ లోకములెల్లా యెడనెడ సందులుగా**
**చంచల మెరసినాఁడిచ్చట హనుమంతుఁడు ॥ఇతఁ॥**

**గరిమ రవిచంద్రులు కర్ణకుండలములుగా**
**ధరణి మేరు కటితటము గాఁగా**
**ఇరవుగా శ్రీవేంకటేశుని సేవకుఁడై**
**బెరసె నిచ్చట నిదె పెద్దహనుమంతుఁడు ॥ఇతఁ॥**

**(సంపు-6. సంకీ-218)**

తన శరీరాన్ని ఆకాశమంతయు నిండించి, తోకను పైకి చాచినాడట. పాదాలేమో ఎక్కడోపాతాళాన మోపినాడట. ఇంక చేతులతో దశదిక్కులను ఆక్రమించి తన పెద్దదైన ఆకారాన్ని చూపంచినాడట హనుమంతుడు.

ఆయన శరీరంలోని రోమాల్లో దేవతలు సంచరిస్తుంటారు. ఆయన మొగము ధ్రువమండలంవరకు వ్యాపించినపుడు లోకాలన్ని చిన్న చిన్న సందులుగా కనపడి హనుమంతుడు ప్రకాశించినాడట.

బ్రహ్మాండా న్నావరించిన హనుమంతునికి సూర్యచంద్రులు చెవికమ్మల మాదిరిగా ప్రకాశించినారట. ఇక మేరుపర్వతమేమో కటితటమైనదట. అట్టి పెద్దహనుమంతుడు నేడు శ్రీవేంకటేశుని సేవకుడై వెలుగొందినాడట అని అన్నమయ్య హనుమంతుని సర్వవ్యాపకత్వాన్ని హృదయంగమంగా వర్ణించినాడు.

శ్లో॥ హనుమానంజనాసూనుః వాయుపుత్రో మహాబలః
రామేష్టః ఫల్గుణసఖః పింగాక్షోఽ మితవిక్రమః
ఉదధిక్రమణశ్చైవ సీతాశోకవినాశకః

లక్ష్మణప్రాణదాతా చ దశగ్రీవస్య దర్పహా।
ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః
స్వాపకాలే పఠేన్నిత్యం యాత్రాకాలే విశేషతః
తస్య మృత్యుభయం నాస్తి సర్వత్ర విజయీ భవేత్॥

శ్రీ ఆంజనేయస్వామివారి పవిత్రద్వాదశనామాలను శ్రీ వేంకటేశ్వరుని ఆంతరంగికభక్తుడైన అన్నమాచార్యుడు గౌళరాగంలో ఎలా సంతరించాడో సహృదయులు తిలకించి పులకించి పులకించి తరించగలరు.

**గౌళ**

**తలఁచరో జనులు యీతని పుణ్యానామములు[1]**
**సులభముననే సర్వశుభములు గలుగు ॥పల్లవి॥**

1. పై శ్లోకంలోని పవిత్రద్వాదశనామాలను కొంచెం ఎచ్చుతగ్గులుగా పుణ్యానామాలుగా చెప్పినాడు అన్నమయ్య. కాని అన్నమయ్యపాటకు పైశ్లోకమే ప్రేరకమని చెప్పవచ్చు.



**హనుమంతుఁడు వాయుజుఁ డంజనాతనయుండు**
**వనధిలంఘనశీలవై భవుఁడు**
**దనుజాంతకుఁడు సంజీవనీశైలసాధకుఁడు**
**ఘనుఁడగు కలశాపురహనుమంతుఁడు ॥తల॥**

**లంకాసాధకుఁడు లక్ష్మణప్రబోధకుఁడు**
**శంకలేని సుగ్రీవసచివుఁడు**
**పొంకపురామునిబంటు భూమిజసంతోషదూత**
**తెంకినేకలశాపురదేవహనుమంతుఁడు ॥తల॥**

**చటులార్జునసఖుఁడు జాతరూపవర్ణుఁడు**
**ఇటమీఁద బ్రహ్మపట్టమేలేటివాఁడు**
**నటన శ్రీ వేంకటేశునమ్మిన సేవకుఁడు**
**పటు కలశాపురప్రాంత హనుమంతుఁడు ॥తల॥**

**(సంపు-11. భాగ-1. సంకీ-188)**

సంజీవనీశైలసాధకుడైన హనుమంతుని పుణ్యానామాలను నిత్యమూ తలచి ఆయురారోగ్యైశ్వర్యాది సర్వశుభాలను పొందవలసినదని ప్రజానీకాన్ని పల్లవిలో ప్రబోధిస్తూ, చరణాల్లో అన్నమాచార్యులు ఆ కపీంద్రుని పుణ్యానామాలను భావస్ఫోరకంగా ఏకరవు పెట్టాడు.

శ్రీ వేంకటేశ్వరుని సేవకాగ్రగణ్యుడూ. సర్వదేవాత్మకస్వరూపుడూ, సమస్తబాధానివారకుడూ, జానకీశోకనాశకుడూ, 'పోఁడిమిదైత్యులగెల్చి వాఁడిప్రతాపతో చేయెత్తుకొన్నవాఁడూ' విద్యుత్ప్రభా భాసమా నమైనవాడూ, పసిడికుండలాలతో, మణిమేఖలతో, స్వర్ణయజ్ఞోపవీతంతో ప్రకాశిస్తున్నవాడు, తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనల్లోదండిగ నిండివున్నవాడూ అయిన పెద్దహనుమంతుడు తిరుమల తిరుపతి దేవస్థాన ప్రధానకార్యాలయ

ప్రాంగణంలో ప్రతిష్ఠింపబడటం ఎంతో ఆనందదాయకమై అలరారుతూ వుంది. ఈ పెద్దహనుమంతుణ్ని దర్శించి తరించండి!

**సాళంగనాట**

పెరిగినాఁడుచూడరో పెద్దహనుమంతుఁడు
పరగి నానావిద్యల బలవంతుఁడు ॥పల్లవి॥

రక్కసులపాలికి రణరంగశూరుఁడు
వెక్కసపు యేకాంగవీరుఁడు
దిక్కులకు సంజీవనిదెచ్చిన ధీరుఁడు
అక్కజమైనట్టి యాకారుఁడు ॥పెరి॥

లలిమీరినయట్టి లావులభీముఁడు
బలు కపికులసార్వభౌముఁడు
నెలకొన్న లంకా నిర్ధూమధాముఁడు
తలఁపున రామునాత్మారాముఁడు ॥పెరి॥

దేవకార్యముల దిక్కువరేణ్యుఁడు
భావింపగల తపఃఫలపుణ్యుఁడు
శ్రీవేంకటేశ్వరు సేవాగ్రగణ్యుఁడు
సావధానుఁడు సర్వశరణ్యుఁడు ॥పెరి॥

(సంపు-11. భాగ-1. సంకీ-233)

-"సప్తగిరి"లో ప్రచురితం

# 25. ఆనందనిలయుని ఆరగింపులు

'కలౌ వేంకటనాయకః' అని ప్రసిద్ధికెక్కిన ఏకైక నాయకుడైన కలియుగ దేవుడు శ్రీ వేంకటేశ్వరస్వామి. ఎప్పుడో ఏనాడో కలియుగాదిలో వేంకటాచలక్షేత్రంపై స్వయంభువుగా వెలసి, భక్తుల నాదుకొని రక్షించడంలో తనకు సాటి ఎవరూ లేరంటూ దశదిశలా చాటుకొంటూ, అత్యంత భక్తప్రియుడుగా పేరొందిన స్వామి శ్రీనివాసుడు. అందుకే "వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి" అన్న ప్రసిద్ధి ఏర్పడింది.

భక్తులపాలిటి కొంగుబంగారమయిన ఈ స్వామిని కేవలం మానవులే కాదు. బ్రహ్మాది దేవతలు సయితం.

**"వృష శైలాధిప ఏవ దైవతం నః**
**వృషభాద్రీశ్వర ఏవ దైవతం నః**
**ఫణిశైలాధిప ఏవ దైవతం నః**
**భగవాన్ వేంకట ఏవ దైవతం నః**

అని అహరహం కీర్తిస్తూ, బంగారు వాకిలివద్ద శ్రీ స్వామివారిదర్శనం కొరకు పడిగాపులు కాస్తారట! కేవలం దర్శనంతోనే తృప్తిపడక సామాన్యభక్తులు నుండి బ్రహ్మదేవుని వరకు, ఆ తిరుమల గోవిందునికి ఎన్నో ఉత్సవాలు చేయిస్తారు. ఊరేగింపులు నిర్వహిస్తారు.

అందుకనే తిరుమలక్షేత్రం ఉత్సవాలతో, వేడుకలతో ఎప్పుడూ సందడిగానే వుంటుంది. అహరహం ఆనందనిలయుడు ఆనందంగా కొండలమధ్య కోలాహలంగా వుంటాడు.

నిజమే మరి! ఆ స్వామి నిత్యకల్యాణచక్రవర్తి. శ్రీదేవి భూదేవులు నిత్యనూతన వధువులు. అందుకే తిరుమల క్షేత్రం "ని(త్య)చ్చల కల్యాణం పచ్చలతోరణం"గా ప్రసిద్ధికెక్కింది. తిరుమలక్షేత్రంలో ప్రతి రోజూ పండగే!

ప్రతిపూటా పాయసాలే, పరమాన్నాలే! పిండివంటలే! ఆహాహా! శ్రీనివాసుడిది ఎంతటి భోగం! ఎంతెంతటి వై భోగం!!

తిరుమలప్పని వైభవానికి, వైభోగానికి కారణం ఆయన భక్తప్రియత్వమే. భక్తులు కోరిన వరాలనన్నిటిని ఇవ్వడం, ఆ భక్తులు చెప్పినట్లుగా, చేసినట్లుగా ఉత్సవాలు చేయించుకోవటం. వారు పెట్టింది సుష్టుగా ఆరగించడం.

నిజంగా ఆలోచిస్తే వేంకటేశ్వరుని భక్తప్రియత్వం ఈనాటిదా. ఏమన్నానా. ఈ భక్త ప్రియత్వమే త్రేతాయుగంలో శబరిచేత ఎంగిలి పండ్లు తినిపించింది. ఈ భక్తప్రియత్వమే ద్వాపరంలో కుచేలుడిచ్చిన ముక్కిపోయిన అటుకులు తినిపించింది.

ఆనాటి శ్రీరామచంద్రుణ్ణి నేనే? అప్పటి గోపాలకృష్ణుణ్ణి నేనే? నంటూ "కౌసల్యా సుప్రజా రామ పూర్వాసంధ్యా ప్రవర్తతే..." ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద!... అంటూ నిత్యమూ మేలుకొలుపు పాడించుకుంటున్నాడు ఈ తిరుమల గోవిందుడు. కేవలం మేలుకొలుపులు పాడించుకోవడమే కాక బహు ప్రయాసల కోర్చి తనకోసం వచ్చిన భక్తులకు మంచి రుచికరమైన లడ్లు, వడలు, అప్పాలు వగైరా పిండివంటలు పంచిపెడుతున్నాడు. కమ్మనైన పాయసాల్ని, పులిహోరల్ని భక్తులచేత ఆరగింప చేస్తున్నాడు.

తిరుమల శ్రీనివాసుడు ఎంతటి అలంకారప్రియుడో అంతటి నైవేద్యప్రియుడట! ఎంతటి నైవేద్యప్రియుడో అంతటి భక్త ప్రియుడట! అందుకే తాను ఆరగించినవన్నీ భక్తులు తింటేనే ఆయన కానందం! తాను తిన్నవన్నీ భక్తులు తింటేనే ఆయనకు ఒక తృప్తి. అసలు భక్తులకు తినిపించడానికే శ్రీ వేంకటేశ్వరుడు మంచి మంచి కమ్మనైన పిండివంటల్ని అన్నప్రసాదాల్ని ఆరగిస్తాడట! ప్రపంచంలో ఈ స్వామిని మించిన నైవేద్యప్రియుడూ, భోజనప్రియుడు మరొకడు కన్పడడు. అందుకే అన్నమయ్య ఒకచోట.

**ఇందిర వడ్డించ నింపుగను**
**చిందక యిట్లే భుజించవో స్వామి–** అంటూ



అక్కాళపాశాలు, అప్పాలు, వడలు, పేణులు, మిరియపు దాళింపులు, కూరలు, పిండి వంటలు, పెరుగులు, పాలు... ఇలా స్వామి వారి ఆరగింపు వర్ణిస్తాడు. మరోచోటకూడ

**అరసెలు నూనెబూరియలు నౌగులు**
**జక్కెర మండెగల్ వడల్**
**బురుడలు పాలమండెగ లపూపము**
**లయ్యలమేలుమంగ నీ**
**కరుదుగ విందువెట్టు బరమాన్న**
**శతంబుల సూపకోట్లతో**
**నిరత వి నిర్మలాన్నముల నేతుల**
**సోనల వేంకటేశ్వరా!**

అంటూ పేర్కొన్నాడు తాళ్లపాక అన్నమయ్య. మరో అజ్ఞాతకవి, తిరుమల శ్రీ వేంకటేశ్వరుని భోజనప్రియత్వాన్ని చాటుతూ

**పాలువెన్న బకాళబాతు దధ్యోదనం**
**బుపుళి యోరెము వెన్న బూరియలను**
**సరడాల పాశముల్, చక్కెర పులగముల్**
**నువ్వు మండిగలు మనోహరములు**
**అప్పము లిడ్డెన లతిరసాల్ హోళిగల్**
**వడలు, దోసెలు గలవంటకములు**
**శాకముల్ సూపముల్ చారు లంబళ్ళు**
**శుద్ధోదనములును సద్యోఘృతమ్ము**
**పండ్లు తేనెలు హొంబ్బట్లు పచ్చడులును"**

అని ఆనంద నిలయుడు ఆరగింపు చేసే పదార్థాల్ని ఏకరువు పెట్టాడు. కాని ఇవి కొన్ని మాత్రమే. తిరుమల స్వామి ఎన్నెన్ని ఆరగిస్తాడో వాటిని

ఏకరువు పెట్టలేక తెనాలి రామకృష్ణుడు "తిండిమెండయ్యగారు" అంటూ ఒక్క మాటలో తిరుమలప్పనికి పెద్ద బిరుదునే తగిలించాడు.

ఇలా ఇన్ని విధాలుగా, ఇందరి చేత పొగడబడిన తిరుమలస్వామి నిత్యమూ "తోమని పళ్లాల్లో' ఆరగిస్తాడు తెలుసా! తోమని పళ్లాల్లో ఆరగించే శ్రీ వేంకటేశ్వరుని భోగం ఎంతటిదోకదా అని మురిసిపోతూ ఆశ్చర్యపోతున్నారు కదూ! వినండి!

ఆ స్వామి ఒకసారి ఆరగించిన పళ్లాన్ని మళ్లీ తోమకుండా పారవేస్తారు. మళ్లీ భోజనానికి మళ్లీ కొత్త పళ్ళెం, వినియోగిస్తారు. ఆ "తోమని పళ్లాలు" ఏమిటో తెలుసా! మట్టి కుండలు. అది కూడా సగం పగిలిన మట్టికుండ! దాన్నే "ఓడు" అంటారు. భక్త ప్రియుడైన వేంకటేశ్వరుడు తాను పగిలిన మట్టి పెంకులో భోజనం చేస్తూ, భక్తుల చేత విందారగింప చేస్తున్నాడు. భక్తులే తనకు పరమార్థం! భక్తుల ఆనందమే తన కానందం! అంటూ మురిసిపోతూ చిరుమందస్మిత వదనంతో ప్రకాశిస్తున్న స్వామిని భక్తులు.

**"వేడుకొందామా వెంకటగిరి వెంకటేశ్వరుని" ॥పల్లవి॥**

**ఆమటి మొక్కులవాడే ఆదిదేవుడే వాడు**
**తోమని పళ్లాలవాడే దురిత దూరుడే ॥వేడు॥**

**వడ్డికాసులవాడే వనజనాభుడే పుట్టు-**
**గొడ్డురాంద్రకు బిడ్డలనిచ్చే గోవిందుడే ॥వేడు॥**

**ఎలమి గోరిన వరాలిచ్చే దేవుడే వాడు**
**అలమేల్మంగా శ్రీ వేంకటాద్రి నాథుడే ॥వేడు॥**

అని చిందులేస్తే పాడుకొంటూ వేడికొంటారు. ఇలా 'తోమలపళ్లాల వాడని' ప్రసిద్ధి పొందిన శ్రీ స్వామికి తరతరాలుగా ఎందరో రాజులు, రారాజులు, చక్రవర్తుల దగ్గర నుంచి, సామాన్య మానవుల దాకా తమ శక్తి



కొద్దీ ఎన్నో నివేదనలు చేశారు. ఆరగింపులను చేయించారు. ఆ శ్రీ వేంకటేశ్వరుడు భక్తులు సమర్పించిన నివేదనల్ని అత్యంత ప్రియంగా ఆస్వాదించి వాటికి దివ్యత్వాన్ని ప్రసాదించి, వాటిని మళ్లీ భక్తులకే వినియోగింపచేస్తూ వున్నాడు. ప్రస్తుతం తిరుమల స్వామివారికి సుప్రభాతం మొదలు ఏకాంతసేవ వరకు ఏ ఏ పదార్థాలు, పిండి వంటలు, అన్న ప్రసాదాలు నివేదనమవుతాయో క్లుప్తంగా పరిశీలిద్దాం.

ప్రతి రోజు తెల్లవారు జామున సుప్రభాతంలో శ్రీవారికి వెన్న, పాలు, చక్కెర నివేదిస్తారు. ద్వాపర యుగంలో ఉదయం లేచిన వెంటనే యశోదాదేవి వెన్నముద్దలు తినిపించేదట! ఆ నాటి అలవాటేమో మరి?

ఇక ఆ తర్వాత శ్రీ శ్రీనివాసస్వామివారికి కొలువు (దర్బార్) జరుగుతుంది. బంగారు సింహాసనంపై ఛత్ర చామర మర్యాదలతో మహా దర్పంగా వేంచేసి ఉన్న శ్రీనివాసప్రభువుల వారికి రాజోచిత మర్యాదలన్నీ సమర్పించి, పంచాంగ శ్రవణం వినిపించిన తర్వాత, వేయించిన నువ్వులను బెల్లంతో కలిపి దంచిన ఈ పిండిని ప్రతిరోజూ శ్రీనివాసుడు ఆరగించడం విశేషం.

పిదప "మొదటి గంట" అని పిలువబడే తొలి నైవేద్యంలో శ్రీవారికి ఎదురుగా పులిహోర, పొంగలి, దధ్యోదనం, చక్కెర పొంగలి మున్నగు అన్న ప్రసాదాలు, లడ్డు, వడలు, అప్పాలు, వగైరా పిండివంటలు కులశేఖరపడికి ఇవతలే ఉంచుతారు. ఇంతలో ప్రధాన వంటదారుడు 'ఓడు' అని పిలువబడే పగిలిన మట్టి కుండలో "మాత్ర" అనబడే మాతృదధ్యోదనాన్ని మాత్రమే ఆనందనిలయంలోనికి తీసుకెళ్ళి ఏర్పాటు చేస్తాడు. ఈ ఓడు ప్రసాదం తప్ప మిగిలిన ప్రసాదాలన్నీ శ్రీ స్వామివారికి ఎదురుగా గడప కివతలే నివేదన చెయ్యబడతాయి.

ఇక మధ్యాహ్నం గంట నివేదనలో శుద్ధాన్నంతోపాటు, పైన పేర్కొన్న అన్నప్రసాదాలు, లడ్డు వగైరాలతోపాటు, భక్తులు తాము సమర్పించదలచిన

ప్రసాదాలు ఇప్పుడే నివేదింపబడతాయి. రెండవ గంట అయిన వెంటనే శ్రీ స్వామివారు ఉభయదేవేరులతో కల్యాణోత్సవానికి వచ్చేస్తారు. నిత్య కల్యాణోత్సవంలో లడ్లు, వడలు, దోసెలు, అప్పాలు, చక్కెర పొంగలి, పులిహోర, పొంగలి, దధ్యోదనం వగైరాలు నివేదింపబడతాయి.

ఆ తర్వాత శ్రీ స్వామివారు వసంతోత్సవంలో పాల్గొంటారు. పై మాదిరే దోసెలు, అన్నప్రసాదాలు నివేదింపబడతాయి. ఇక స్వామివారికి అద్దాల మహల్లో డోలోత్సవంలోనూ, ఆ సాయంత్రం సహస్ర దీపాలంకరణ సేవలోను "పంచకజ్జాయం" అనే ప్రసాదం నివేదింపబడుతుంది. చక్కెర, గసగసాలు, కలకండ ముక్కలు, ఎండుద్రాక్ష, గోడంబి, బాదం పలుకులు అన్నీ కలిపి తయారు చేసిన పొడి ప్రసాదం ఈ పంచకజ్జాయం.

ఇక సాయంత్రం నివేదనంలో తోమాలదోసెపడి అనే నెయ్యి దోసెలు మొళహోర, కదంబం, మున్నగు ప్రసాదాలు నివేదింపబడతాయి. ఆ తర్వాత మళ్ళీ తిరువీసంగంట అనే ప్రత్యేక నివేదనలో చెకెరపొంగలిని శ్రీ స్వామివారికి నివేదించడం జరుగుతుంది. పిదప రాత్రి ఏకాంతసేవలో శ్రీ వేంకటేశ్వరునికి బాగా కాగిన, గోరువెచ్చని పాలు, చక్కెర, పండ్లు, పంచకజ్జాయంతోపాటు "మేవా" అనబడే పంచామృత ప్రసాదం నివేదింపబడుతుంది.

ఇవికాక ప్రతి సోమవారం విశేషపూజలో పెద్దవడలు, లడ్లు, వగైరా ప్రసాదాలు నివేదింపబడతాయి. బుధవారం సహస్రకలశాభిషేకంలో ప్రత్యేకంగా 'క్షీరాన్నం' అనబడే పాయసం నివేదించబడుతుంది. ఇక ప్రతి గురువారం "తిరుప్పావడ" అనే నివేదనలో 420 కిలోల బియ్యంతో తయారుచేసిన 'పులిహోర' శ్రీ స్వామివారిమూలవిరాట్టునకు ఎదురుగా బంగారు వాకిలి దగ్గర ఏర్పాటు చేయబడి నివేదింపబడుతుంది. దీనితోపాటు ప్రత్యేకంగా జిలేబీలు, తేనెతొళ అనే పెద్ద మురుకులు కూడా గురువారంనాడు నివేదింపబడతాయి. ఇక శుక్రవారంనాడు శ్రీ స్వామివారికి హోళీలు లేదా





పోళీలు, నివేదింపబడతాయి. దీనితోపాటు "సుఖియ" లనబడే ఉండ్రాళ్ళు ప్రతి శుక్రవారం నివేదిస్తారు. ఇక ప్రతి ఆదివారం "ఆదివారం ప్రసాదం" అనబడే "చలిపిండి" ప్రత్యేకంగా శ్రీ స్వామికి నివేదింపబడిన తర్వాత దీన్నే బంగారు వాకిలి ఎదురుగావున్న గరుడాళ్వారుకు నివేదిస్తారు. దీన్నే "అమృతకలశం" అంటారు. ఇవిగాక ఏకాదశి మున్నగు సందర్భాల్లో దోసెలతోపాటు, శనగపప్పుతో తయారుచేసి "శుండలు" (గుగ్గిళ్ళు) నివేదిస్తారు. ఇవేగాక, "పానకం వడపప్పు" అనబడే పెసరపప్పు పణ్యారం నివేదింపబడతాయి. ధనుర్మాస సమయంలో "బెల్లపుదోసె" ప్రత్యేకంగా నివేదింపబడుతుంది.

పైన పేర్కొన్న ప్రసాదాలేగాక, ఇంకా సీరా, పాయసం, కేసరీబాత్, శాకరీబాత్, బకాళాబాత్, మనోహరం అనబడే విశేష వంటకాలు నివేదించడం కూడా కద్దు.

ఇలా ఎన్ని పిండి వంటలు సమర్పించినా, ఎన్ని రకాల పాయసాలు నివేదించినా వాటిని మళ్లీ భక్తులకే సమర్పిస్తూ పునీతులను చేస్తూ భక్తుల్ని సంతృప్తి పరుస్తున్న శ్రియఃపతి శ్రీ వేంకటేశ్వరుడు. తోమని పళ్లాలవాడైన తిరుమలేశుని రక్ష అందరికీ శ్రీరామరక్షగా వరలుగాతయని ప్రార్థిద్దాం!

**సీ॥ చెక్కిళ్ళఁజిఱునవ్వు చిందుద్రొక్కెడుతేఁడ!**
**యేడుకొండలవాఁడ! యేలుకొమ్ము**
**అలమేలు మంగాంబ చెలికాఁడ! యడుగడ్డ**
**దండాలవాఁడ! మాకండ వగుము**
**ఆమటమ్రొక్కులస్వామి! గోవింద గో**
**వింద సందడివేల్ప! వందనమ్ము**
**కలియుగ ప్రత్యక్ష కులదైవమా! యెల్ల**
**డెందాల విహరించు విందా! శరణు**

**గీ॥ పిండివంటకములు కుండలవండిన**
**యోరెములును, మాత్ర లారగించి**
**భక్తులకుఁబ్రసాదపఱుచు మహాభోగీ**
**వరకటాక్ష! పరమ పురుష! రక్ష!**

**("ఆంధ్రప్రభ" దినపత్రిక బ్రహ్మోత్సవ సంచికలో ప్రచురితం)**

# 26. పరంధాముని పంచ బేరాలు (మూర్తులు)

అనంతకోటి బ్రహ్మాండాలలో భూమండలం కేవలం సూక్ష్మాతి సూక్ష్మమైన ఒక చిన్నగ్రహం మాత్రమే. అంతమాత్రమే అయినా విశ్వాంతరాళంలో ఈ భువికి అనంతమయిన, అమృతత్వమయిన, ఆదరణీయమయిన ఒక విశిష్ట స్థానం వుంది. బహుశా అద్భుతావహమైనటువంటి ఆశ్చర్య కరమైనటువంటి, ఆనందమయమైనటువంటి, ఎంతకూ తరగనటువంటి ఒక ఆధ్యాత్మికతేజోనిధి ఈ భువిలో నెలకొని వుండడం అందుకు ప్రధానకారణం కావచ్చు. ఆ అద్భుత తేజోరాశి భూమండలంపై నెల కొనివున్నా, ఆ శక్తియొక్క వింత వింత వెలుగులు విశ్వాంతరాళమంతా విరజిమ్మబడుతున్నాయి.

అనాదిగా ఆ దివ్యశక్తి కేంద్రీకృతమైన పుణ్య స్థలాన్ని వేంకటాచలమనీ, శేషాచలమనీ, సప్తగిరులనీ అంటున్నారు. అలాగే ఆ అనంతశక్తిని. శ్రీనివాసప్రభువనీ, సప్తగిరీశుడనీ, వేంకటరమణుడనీ, గోవిందుడనీ, తిరుమలేశుడనీ... ఇలా ఎన్నో పేర్లతో పిలవటం జరుగుతున్నది.

ఇలాగ అనంతమైన పేర్లతో పిలువబడుతున్న దివ్యమైన కాంతిపుంజం ఎలాంటిది? అంటే కోరిన వారి కల్పతరువు. పట్టినవారి చేతి బంగారం. ముట్టి కొలిచినవారి ముందు జీతం. సేవ చేసినవారి చేతిలో మాణిక్యం . భావించువారి పరబ్రహ్మ. కావలె నన్నవారికి ఘనమనోరథసిద్ధి నిచ్చే గురుతైన దైవం. పూజించేవారిని రక్షించే వజ్రపంజరం. తన్మయించి నుతించేవారి ఆనందరూపం. అందుకే

**వేంకటాద్రి సమం స్థానం**
**బ్రహ్మాండే నాస్తి కించన**
**వేంకటేశసమో దేవో**
**న భూతో న భవిష్యతి**

బ్రహ్మాండంలో వేంకటాద్రికి సమానమైన పుణ్యక్షేత్రం లేనే లేదనీ, అలాగే ఆ కొండపై వెలసిన శ్రీ వేంకటేశ్వర స్వామికి సాటి రాగల దేవుడు ఇటు భూతకాలంలోను, అటు భవిష్యత్తులోను లేడు, వుండబోడని అన్నారు.

కనుకనే భక్తుల పాలిటి కొంగు బంగారమై వెలుగుతున్న శ్రీనివాసుణ్ణి దర్శించడానికి నిరంతరం నిరంతరాయంగా ఎందరో భక్తులు తిరుమల యాత్ర చేస్తారు. తిరుమలలో తమ ఇష్టాన్ని అనుసరించి కొందరు భక్తులు శ్రీ స్వామివారి సుప్రభాతంలో పాల్గొంటారు. మరి కొందరు శ్రీ వేంకటేశుని విశ్వరూపాన్ని కన్నులారా దర్శిస్తారు. ఇంకొందరు శ్రీ వేంకట ప్రభువునకు కల్యాణోత్సవం చేయిస్తారు. మరి కొందరు తిరుమలప్పని పూలంగిసేవను చూసి పులకించి పోతారు. అలాగే శ్రీ స్వామివారి సహస్రకాలశాభిషేకాన్ని దర్శించి పాపదూరులవుతారు. కొందరు స్వామికి తిరుప్పావడ సేవ చేస్తారు. శుక్రవారాభిషేకంలో భక్తితో పాల్గొంటారు. ఇలా ప్రతినిత్యం భక్తులు శ్రీవేంకటేశ్వరస్వామివారికి కల్యాణోత్సవాలు, ఆర్జితబ్రహ్మోత్సవాలు, వసంతోత్సవాలు,...ఇలా ఎన్నో సేవలు చేసి మొక్కులు చెల్లించుకుంటారు.

ఇలాగ ఎన్నో విధాలుగా, ఎన్నో సేవల్లో, ఎన్నో ఉత్సవాల్లో శ్రీ స్వామివారి వైభవాన్ని కన్నులారా తిలకించి తరిస్తారు. భక్తులకు ఒక్కొక్క ఉత్సవంలో ఒక కొత్త ఉత్సాహం. ఒక్కొక్క ఊరేగింపులో ఒక తృప్తి...ఒక మైమరపు... ఇలా భక్తులకు ఎన్నో... ఎన్నెన్నో... అనుభవాలు, అనుభూతులు.

ఇలా అనేక విధాలుగా అనేక ఉత్సావాల్లో అనేక మంది భక్తులకు దివ్యానుభూతులను అనుగ్రహిస్తున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారిమూర్తి (విగ్రహం) అన్నిచోట్ల ఒక్కటేనా? వేరు వేరా? వేర్వేరు అయితే స్వామివారి మూర్తులెన్ని వున్నాయి. ఏ ఏ మూర్తులు ఏ ఏ సేవల్లో పాల్గొంటాయి? అన్న ప్రశ్న పరంపరలకు సంగ్రహ సమాధానమే ఇది.

తిరుమల పుణ్యక్షేత్రంలో స్వయంవ్యక్తమై వెలసిన శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి అనాదిగా వైఖానసాగమం ప్రకారం పూజా నివేదనలు





జరుగుతున్నాయి. భక్తులు తమ కిష్టమైన రీతుల్లో సేవచేసి, భగవంతుణ్ణి ప్రసన్నం చేసికొంటారు. అలాగే భక్తుడు స్నానం (అభిషేకం), అర్చనం (పూజ), భోజనం (నైవేద్యం), యాత్ర (ఊరేగింపు), శయనం (పాన్పు సేవ) మున్నగు సేవలు చేయడం కద్దు. భక్తులు చేసే ఈ అన్ని కార్యక్రమాలకు, ఆలయంలోని మూలమూర్తి (మూలవిగ్రహం) స్థిరంగా వుంటుంది కనుక అనువుగా వుండదు. అందువల్ల వైఖానస ఆగమ శాస్త్రం పై ఉత్సవాలన్నింటికి వీలుగా 1. ధ్రువబేరం, 2. కౌతుక బేరం, 3. స్నపన బేరం, 4. బలి బేరం, 5. ఉత్సవ బేరం అను పంచమూర్తులను అనుమతించింది.

తిరుమల పుణ్యక్షేత్రంలో కూడ శ్రీ వేంకటేశ్వరస్వామివారు ధ్రువమూర్తిగా, కౌతుకమూర్తి, స్నపనమూర్తిగా, కొలువు మూర్తిగా, ఉత్సవ మూర్తిగా, ఇలా ఐదురూపాల్లో వేంచేసి భక్తుల మొక్కులందుకుంటున్నాడు. ఇష్టార్థ ప్రదాతమై వరలుతున్నాడు.

**1. ధ్రువబేరం:**

మూలవిరాట్టు, ధ్రువమూర్తి, స్థానకమూర్తి అని ఇలాగ ఈ మూర్తికి పేర్లు. ఆనందనిలయంలో స్వయంభువుగా శంఖు చక్రాలతో వెలసిన సాలగ్రామ శిలామూర్తి. ఈ విగ్రహం ఎత్తు 8 అడుగులుంటుందని అంచనా. ప్రధానంగా మూలవిరాట్టునకు ప్రతి రోజు రెండుమార్లు తోమాలసేవ, మూడు మార్లు అర్చన, నైవేద్యాలు జరుగుతాయి. ప్రతిరోజు భక్తులు క్యూలో వెళ్ళి దర్శించి పులకించేది శ్రీస్వామివారి ఈ దివ్యమంగళ విగ్రహాన్నే. ఈ విగ్రహం వక్షః స్థలంలో శ్రీ మహాలక్ష్మీదేవి కొలువై వున్నది. శ్రీ స్వామివారికి అర్చన జరిగిన వెంటనే వక్షఃస్థల వ్యూహలక్ష్మికి మళ్లీ అర్చన జరుగుతుంది. ప్రతి మంగళవారం మధ్యాహ్నం 11 గంటలకు రెండవ అర్చన గా మూలవిరాట్టునకు 108 బంగారుకమలాలతో 'అష్టదళ పద్మారాధన' అనే పుష్పార్చన జురుగుతుంది. ప్రతి గురువారం రెండవ అర్చన సమయంలో నేత్ర దర్శనం, తిరుప్పావడ, ఆ సాయంత్రం పూలంగి సేవ ఈ స్వామి వారికే జరుగుతాయి. ఆ మరునాడు శుక్రవారం పొద్దున సుగంధ ద్రవ్యాలతో అభిషేకం జరిగేది స్థిరమూర్తి అయిన మూలవిరాట్టునకే.

ప్రతిరోజు రాత్రి బ్రహ్మాదిదేవతలు వచ్చి అర్చించే రూపం కూడ ఇదే. ప్రతిరోజు సుప్రభాతానంతరం భక్తులు చేసుకొనే "విశ్వరూప దర్శనం" శ్రీస్వామివారి మూలమూర్తిదే. ఈ విగ్రహమూర్తికే వజ్రకిరీటాది ఆభరణాలు ఎన్నో నగలు, దివ్యమాలలు అలంకరిస్తారు.

**2. కౌతుకబేరం:**

మనవాళ ప్పెరుమాళ్, భోగశ్రీనివాసమూర్తి, కౌతుకమూర్తి అని ఈ విగ్రహానికి పేర్లు. శంఖ చక్రధారియై చతుర్భుజుడైన ఈ భోగమూర్తి అన్ని విధాలా మూలవిరాట్టునకు చిన్న ప్రతిరూపం. ఈ వెండి విగ్రహాన్ని క్రీ.శ. 614లో పల్లవరాణి సామవాయి బహూకరించింది. శ్రీస్వామివారి మూలమూర్తి పాదాలముందర వున్న ఈ భోగమూర్తిని భక్తులు దర్శించవచ్చు.



ఈ భోగమూర్తికే ప్రతిబుధవారం ఉదయం బంగారువాకిలి ముందర సహస్రకలాశాభిషేకం, సహస్ర ధారాభిషేకం జరుపబడుతాయి. ఆ సమయంలో శ్రీస్వామివారి మూలమూర్తితో భోగ శ్రీనివాసమూర్తిని అనుసంధానిస్తూ, బంగారు తీగతోకాని లేదా పట్టుదారంతో కడతారు. అంటే సాక్షాత్తు మూలమూర్తి యొక్క శక్తులను మంత్రపూర్వకంగా ఈ చిన్న విగ్రహానికి ప్రవహింపచేస్తారు.

సూమారు 1.5 అడుగుల ఎత్తువున్న ఈ భోగ శ్రీనివాసమూర్తికి ప్రతినిత్యం ఆకాశగంగ తీర్థంతో అభిషేకం జరుగుతుంది.

రాత్రి ఏకాంత సేవా సమయంలో శయన మండపంలో పట్టుపాన్పుపై ఈ భోగ శ్రీనివాసమూర్తినే శయనింపజేస్తారు. అయితే ఒక ధనుర్మాసంలో 30 రోజులు మాత్రం ఈ శయన భాగ్యం శ్రీకృష్ణ విగ్రహానికి మాత్రమే కలుగుతుంది.

**3. స్నపన బేరం:**

ఉగ్రశ్రీనివాస మూర్తి, వేంకటత్తురైవార్,స్నపన మూర్తి అని ఈ స్వామికి పేర్లు. శ్రీదేవి భూదేవి సహితుడైన ఉగ్రశ్రీనివాసుని పంచలోహ విగ్రహాలు భోగ శ్రీనివాసునికంటె ముందుగానే ఈ ఆలయంలో ఉండి ఆ యా ఉత్సవాల్లో పాల్గొన్నట్లు తెలియవస్తున్నది.

కాని ఒకానొక బ్రహ్మోత్సవ సమయంలో కొన్ని భయంకర పరిణామాలు సంఘటనలు జరిగినందువల్ల, ఆ యా ఉత్సవాల్లో ఈ ఉగ్ర శ్రీనివాసమూర్తి విగ్రహాలను ఉపయోగించడం మానివేశారు.

అయినా సంవత్సరంలో ఉత్థానైకాదశి, ద్వాదశి, తిరువారాధన అను ప్రత్యేక పర్వదినాల్లో మాత్రమే ఈ స్వామికి ఉత్సవం జరుపబడుతున్నది. సూర్యరశ్మి తగిలితే స్వామికి ఉగ్రత్వం వస్తుందనీ, నేటికీ పై ఉత్సవాలు సూర్యోదయానికి ముందుగానే జరుగుతాయి. ఈ ఉగ్ర శ్రీనివాసమూర్తి

విగ్రహం సుమారు 18 అంగుళాలు ఎత్తుకలిగి, 7 అంగుళాల పీఠంపై ఏర్పాటు చేయబడింది.

**4. బలిబేరం:**

కొలువు శ్రీనివాసమూర్తి, లేఖన శ్రీనివాసమూర్తి, దర్బార్ శ్రీనివాసమూర్తి అని ఈ స్వామివారికి వున్న పేర్లు. ఇంచుమించు వెండి భోగ శ్రీనివాసునివలె వున్న పంచలోహ విగ్రహం ఇది.

ప్రతిరోజు తొలి అర్చనకు ముందుగా మూలమూర్తికి తోమాల సేవ (పుష్పమాలాలంకరణ) వైభవంగా జరుగుతుంది. ఆ తర్వాత స్నపన మండపంలో ఈ కొలువు శ్రీనివాసుణ్ణి బంగారుసింహాసనంపై వేంచేపు చేసి, ఛత్ర చామర మర్యాదలతో ఆస్థానం జరుగుతుంది. ఈ కొలువులో స్వామివారికి పంచాంగ శ్రవణం జరుగుతుంది. ఆనాటి తిథి, వార, నక్షత్ర విశేషాలతో పాటు ఉత్సవ విశేషాలు వినిపిస్తారు. అంతేగాక ముందునాటి ఆదాయాన్ని ఆర్జితం టిక్కెట్లవల్ల, హుండీ వల్ల, వచ్చిన ఆదాయాన్ని, బంగారం వెండి నగలు, పాత్రలు మున్నగు సమస్త వస్తువుల విలువను లెక్కలను గట్టి మొత్తం నికరాదాయాన్ని పైసలవరకు కూడ శ్రీస్వామివారికి అత్యంత భక్తి ప్రపత్తులతో చదివి వినిపిస్తారు. ఈ కొలువు శ్రీనివాసమూర్తిని దేవస్థానం లెక్కలను పర్యవేక్షించే 'అధికారమూర్తి'గా తలంచవచ్చు. ఈ కొలువులో శ్రీనివాసమూర్తికి బెల్లంతో కలిపిన నువ్వుల పిండిని నివేదిస్తారు.

**5. ఉత్సవబేరం:**

మలయప్పస్వామి, మలయకునియ నిన్రపెరుమాళ్, ఉత్సవమూర్తి అని ఈ స్వామికి, పేర్లు.

ఈ ఉత్సవమూర్తుల ప్రస్తావన క్రీ.శ.1339 నాటి శాసనంలో కనపడుతున్నది. ఆనాటినుండి కల్యాణోత్సవం, ఉత్సవాల్లో, ఊరేగింపుల్లోను, వసంతోత్సవం, బ్రహ్మోత్సవం వంటి వార్షికఉత్సవాలలోను ఈ మలయప్పస్వామివారే ఉపయోగింపబడేవారు. అయితే ఈయన కంటే





భోగ శ్రీనివాసమూర్తి



కొలువు శ్రీనివాసమూర్తి

ముందుగా శ్రీదేవి భూదేవులతో కూడియున్న ఉగ్రశ్రీనివాసమూర్తి వారే ఉత్సవాదుల్లో పాల్గొనేవారు. ఈ ఉగ్రశ్రీనివాసమూర్తికి బదులుగా ఈ మలయప్పస్వామి ప్రవేశించటానికి ఒక కథ వినవస్తున్నది.

పూర్వం ఒకానొక బ్రహ్మోత్సవంలో ఉగ్రశ్రీనివాసమూర్తి ఊరేగింపబడు చుండగా తిరుమల గ్రామంలోని ఇండ్లన్నీ తగులబడ్డాయట! ఈ భయంకర ప్రమాదానికి అర్చకులు, తిరుమల గ్రామస్థులు, భక్తులు భయపడి శ్రీస్వామివారిని వేడుకున్నారట. అప్పుడు స్వామివారు ఒకనియందు ఆవేశించి ఇక మీదట ఈ విగ్రహాలను ఉత్సవాల్లో ఉపయోగింపవద్దనీ, అందుకు అనువుగా వుండే వేరే విగ్రహాలు ఈ కొండలోనే వున్నాయనీ, వానిని తెచ్చి ఉపయోగించవలసిందని ఆదేశించారట. అర్చకులు వానిని వెదకి తెచ్చి నెలకొల్పినారు. పర్వతమైదానాల్లో దొరికినందువల్ల ఈ విగ్రహాలను 'మలయకునియనిన్ర పెరుమాళ్' అని పిలవడం జరిగింది. ఈ విగ్రహాలు దొరికిన స్థలాన్ని 'మలయప్పకోన' అంటారు. ఆనాటినుండి

శ్రీదేవి భూదేవులతో కూడి ఉత్సవాదుల్లో పాల్గొంటున్న ఈ స్వామివారిని మలయప్పస్వామి అంటారు.

ప్రస్తుతం బంగారు వాకిలికి వెలుపల శ్రీవేంకటేశ్వరస్వామివారికి జరిగే కల్యాణోత్సవాలు, బ్రహ్మోత్సవాలు, డోలోత్సవాలు, వసంతోత్సవాలు, పుష్పయాగోత్సవం, పవిత్రోత్సవం వంటి అనేక ఉత్సవాల్లో ఊరేగింపుల్లో శ్రీమలయప్పస్వామి వారే పాల్గొంటున్నారు.

ఈ మలయప్పస్వామివారి విగ్రహం 14 అంగుళాల పద్మపీఠం పై 3 అడుగుల ఎత్తు కలిగి వున్నది. శ్రీ స్వామివారికి కుడివైపున 4 అంగుళాల పీఠం పై 30 అంగుళాల ఎత్తు కలిగిన శ్రీదేవి విగ్రహం, ఎడమవైపున అంతే ఎత్తు కలిగిన భూదేవి విగ్రహం వున్నాయి.

ఇలా తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి ఆనందనిలయంలో పంచ మూర్తులుగా కొలువై వుండి, భక్తులచే పూజలందుకుంటున్నాడు. నిండుగా అనుగ్రహిస్తున్నాడు. ఇలా పంచబేరాలుగా వెలసివున్న శ్రీనివాసమూర్తికి భక్తులు తమకు ఇష్టమైన రీతుల్లో, తీరుల్లో మొక్కుకొని కైంకర్యం చేస్తుంటారు. తిరుమలస్వామి ఆ అన్ని రూపాల్లో వేంచేసి భక్తుల ఆచారవ్యవహారాల వేర్వేరు అయినా, వారి భాషలు ఒక్కటి కాకపోయినా, వారు మొక్కులను వింత వింతలుగా చెల్లించినా, వాటి నన్నింటిని స్వీకరించి, వారు కోరిన కోరికల నన్నింటినీ తీరుస్తుంటారు. ఒక్క మానవమాత్రులే కాదు. ముక్కోటి దేవతలు సైతం కలియుగ వైకుంఠనాథుని దర్శనానికి వస్తారు. ఇటు రాత్రి బ్రహ్మాదిదేవతలచేతా, అటు పగలు మానవులచేతా నిరంతరం నిరంత రాయంగా సేవింపబడుతూ, తన కడగంటి చూపులతో అందరినీ సంపూర్ణంగా అనుగ్రహిస్తున్న శ్రీనివాస ప్రభువునకు సాటిరాగల దేవుడు ఇంకొకడు లేడు, లేనే లేడు. ఆ దేవునికి సాటి ఆ దేవుడే!

**("సప్తగిరి" జనవరి 1993)**

# 27. బ్రహ్మాండ నాయకునికి బ్రహ్మాపూజ

**"నిత్యాత్ముడై యుండి నిత్యుడై వెలుగొందు**
**సత్యాత్ముడై యుండి సత్యమై తానుండు**
**ప్రత్యక్షమై యుండి బ్రహ్మమై యుండు**
**సంస్తుత్యు డీ తిరువేంకటాద్రి విభుడు"**

అని ప్రస్తుతించాడు శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులు.

సువిశాలమైన ఆధ్యాత్మిక ప్రపంచంలో సుందరాంధ్ర భూమికి ఒక విశిష్టమయిన స్థానముంది. బహుశా ఆంధ్రదేశంలో నెలకొన్న వేంకట్రాది క్షేత్రం – ఆ క్షేత్రంపై అనాదిగా కేంద్రీకృతమైవున్న "దివ్య తేజస్సే" అందుకు ప్రధానకారణం కావచ్చు. అందుకే

**"వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన**
**వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి"**

బ్రహ్మాండంలో వేంకటాద్రికి సమానమైన పుణ్యక్షేత్రం లేనేలేదనీ, అలాగే ఆ కొండపై వెలసిన శ్రీవేంకటేశ్వరస్వామికి సాటి రాగల దేవుడు ఇటు భూతకాలంలోను లేడు, అటు భవిష్యత్తులోను వుండబోడని అన్నారు.

ఈ వేంకటాచల క్షేత్రంలో అంజనాద్రి, వృషభాద్రి, నీలాద్రి, శేషాద్రి, గరుడాద్రి, నారాయణాద్రి, వేంకటాద్రి అను ఏడుకొండలు నెలకొని వున్నాయి. అందుకే ఈ స్వామికి ఏడుకొండలవాడని, సప్తగిరీశుడని ప్రసిద్ధి కలిగింది.

ఈ ఏడుకొండలలో శ్రీస్వామిపుష్కరిణి, ఆకాశగంగ, చక్రతీర్థం, పాపవినాశనం, గోగర్భం, తుంబురుతీర్థం, కుమారధారా తీర్థం, రామకృష్ణ తీర్థం ఇత్యాది 365 పవిత్ర తీర్థాలు వున్నాయి.

సుప్రభాతం, తోమాలసేవ, అర్చన, కల్యాణోత్సవం, డోలోత్సవం వంటి నిత్యోత్సవాల్లోను, విశేషపూజ, అష్టదళపాదపద్మారాధన, సహస్ర

కలశాభిషేకం, తిరుప్పావడ, పూలంగిసేవ, శుక్రవారాభిషేకం, డోలోత్సవం, సహస్ర దీపాలంకరణ సేవవంటి వార, పక్ష, మాసోత్సవాలలోను, పుష్పయాగం, తెప్పోత్సవం వంటి వార్షిక ఉత్సవాలలోను శ్రీదేవి, భూదేవి ఉభయనాంచారులతో కూడియున్న తిరుమలప్పని వైభవం అవ్యక్తం అనిర్వచనీయం. అయితే సంవత్సరాది నుంచి సంవత్సరాంతం వరకు జరుగుతున్న అనేక ఉత్సావాల్లో తిరువేంకటగిరి దేవునికి ఏడాదికి ఒకమాటు జరిగే పదినాళ్ల బ్రహ్మోత్సవాలు అత్యంత ప్రాధాన్యతను సంతరించుకున్నాయి.

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామికి ప్రతి ఏటా ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి ఆశ్వయుజ శుద్ధ దశమి వరకు పదిరోజుల పాటు బ్రహ్మోత్సవాలు జరుపబడుతున్నాయి. ఒకవేళ అధికమాసం వస్తే భాద్రపదమాసంలో ఒక బ్రహ్మోత్సవం, ఆశ్వయుజమాసంలో మరొక బ్రహోత్సవం నిర్వహింపబడుతున్నాయి. సాధారణంగా ప్రతి మూడవ ఏటా రెండు బ్రహ్మోత్సవాలు స్వామివారికి జరుపబడుతుంటాయి. ఇలాగ ఒకే మారు రెండు బ్రహ్మోత్సవాలు జరిగినపుడు భాద్రపద మాసంలో జరిగే మొదటి ఉత్సవాన్ని వార్షిక బ్రహ్మోత్సవమనీ ఆశ్వయుజమాసంలో జరిగే రెండవ బ్రహోత్సవాన్ని నవరాత్రి బ్రహ్మోత్సవమనీ అంటారు. మొదటి ఉత్సవాలకు రెండవ ఉత్సవాలకు ఊరేగింపులూ, ఉత్సవాలు–సమంగానే జరుగుతాయి. కాని రథోత్సవానికి మాత్రం మొదటి బ్రహ్మోత్సవంలో కొయ్య తేరును, రెండవ బ్రహ్మోత్సవంలో వెండి తేరును ఉపయోగిస్తారు.

ఈ ఉత్సవాలు తొట్టతొలుత చతురుఖ్ముడైన బ్రహ్మదేవుడు తిరుమల శ్రీవారికి నిర్వహించినట్లు, అందువల్లనే వీటికి బ్రహ్మోత్సవాలు అని ప్రసిద్ధి కలిగినట్లు శ్రీ వేంకటాచలమాహాత్మ్యం, భవిష్యోత్తరపురాణం స్పష్టం చేస్తున్నాయి.

పురాణాల్లోనే గాక చారిత్రకంగా శాసన పరంగా క్రీస్తుశకం 7వ శతాబ్దం నుంచి కూడా శ్రీవేంకటేశ్వరస్వామికి బ్రహ్మోత్సవాలు జరగుతున్నట్లు ఆధారాలున్నాయి.



క్రీస్తుశకం 7వ శతాబ్దంలో పల్లవరాణి సమవాయి, మనవాళ పెరుమాళ్ విగ్రహాన్ని బహూకరించి తిరుమలలో కన్యామాసం(పురట్టాసి నెల)లో జరిగే బ్రహ్మోత్సవాలకు ముందు ఈ విగ్రహాన్ని ఊరేగింపు చేసేటట్లు ఏర్పాటు చేసిందట. అప్పటి నుండి ప్రారంభమైన (మనకు స్పష్టమైన ఆధారం) ఈ బ్రహ్మోత్సవాలు తెలుగు పల్లవరాజు విజయగండ గోపాల దేవర్ (1254) చైత్ర మాసంలోను, మూడవ రామరాజు సామంతుడు వీరనరసింగ దేవుడు పంగుణి ఉత్సవం పాల్గుణ మాసంలోను, త్రిభువన చక్రవర్తి తిరువేంకటనాధ యాదవరాయలు (1328) 'ఆడితిరునాళ్' పేర ఆషాఢమాసంలోను, వీరప్రతాప్ దేవరాయలు (1429) ఆశ్వయుజమాసంలోను, హరి హరరాయలు (1446) 'మాసి తిరునాళ్' బ్రహ్మోత్సవాన్ని, అచ్యుత రాయలు అచ్యుతరాయ బ్రహ్మోత్సవం (1530) అనీ ఇలాగ 1583 నాటికి బ్రహ్మోత్సవాలు సంవత్సరానికి పదుకొండుగా అంటే ఇంచు మించు ప్రతినెలా ఒక బ్రహ్మోత్సవంగా జరిగేదన్నమాట.

రాజ్యాలు, రాజరికాలు, కాలగర్భంలో కలిసి పోయినందువల్ల వారు ఏర్పరచిన ఉత్సవాలు మధ్యలోనే నిలిచి పోయాయి. కాని అనాదిగా చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడు నిర్వహించిన బ్రహ్మోత్సవాలు మాత్రం అఖండంగా నేటికి సాగుతూనే వున్నాయి.

బ్రహ్మోత్సవాలు ధ్వజ ఆరోహణంతో ప్రారంభమై ధ్వజ అవరోహణంతో ముగిసే పదినాళ్ల వేడుకలు. ధ్వజారోహణకు ముందురోజు "కోయిల్ ఆళ్వారు తిరుమంజనం" చేస్తారు. అంటే శ్రీవారి గర్భాలయాన్ని సుంగధ ద్రవ్యాలతో శుద్ధి చేసే కార్యక్రమాన్ని తిరుమంజనం అంటారు.

ధ్వజారోహణం రోజు వైఖానసాగమ శాస్త్రోక్త రీతిలో అంకుర్పాణ, కంకణధారణ, బలి ఆవరణలోని అష్ట దిక్కులను, స్వామివారి అనుమతితో అర్చకస్వాములు ఆహ్వానిస్తారు. దేవతల ఆహ్వానానంతరం గరుడాకృతి చిత్రించిన నూతన కేతనాన్ని శ్రోత్రియులు వేదగానం మధ్య మంగళ

వాయిద్యాలు మ్రోగుతుండగా స్వామివారి ఆలయ బంగారు ధ్వజ స్తంభంపై ఎగుర వేస్తారు. ఈ గరుడకేతనం ఎగుర వేయడం కన్నుల పండువుగా వైభవంగా జరుగుతుంది. ఆ సమయంలో నివేదించబడే ముద్గాన్న (పెసర పుగం) ప్రసాదాన్ని స్వీకరిస్తే సంతాన భాగ్యానికి నోచుకొని స్త్రీలు సంతాన వతులు అవుతారని చెప్తారు.

తరువాత ఆ బంగారు ధ్వజస్తంభానికి ప్రక్కగానున్న తిరుమల రాయమండపంలో సర్వాభరణాలతో పుష్పాలతో అలంకృతులైన శ్రీవారిని ఉభయదేవేరులతో వేంచేపు చేసి ఆస్థానం జరుపుతారు. ఆ తర్వాత అదే రోజు రాత్రి శ్రీదేవిభూదేవి సమేతంగా శ్రీమలయప్పస్వామి వారికి పెదశేషవాహనోత్సవం ఘనంగా జరుగుతుంది.

ఇక మరుసటిరోజు నుంచి తొమ్మిది రోజుల వరకు వరుసగా శ్రీవేంకటేశ్వరస్వామికి ప్రతిరోజు ఉదయం సాయంత్రం రెండువేళలా ఒక్కొక్క వాహనం మీద ఊరేగింపు జరుగుతుంది. సాయంత్రంపూట ఊరేగింపునకు ముందుగా శ్రీవారికి డోలోత్సవం (ఊయల సేవ) శోభాయమానంగా జరుగుతుంది.

ఈ పదినాళ్ల పండగ దినాల్లో అయిదవనాటి రాత్రి జరిగే బంగారు గరుడోత్సవం, తొమ్మిదవ నాటి ఉదయం జరిగే రథోత్సవం అత్యంత దర్శనీయమై, దివ్య సుందరమై సాక్షాత్తు వైకుంఠాన్ని దర్శింపజేసే విశేషోత్సవాలుగా ప్రసిద్ధి నంది వున్నాయి. పై గరుడోత్సవ, రథోత్సవ దినాల్లో లక్షల సంఖ్యలో భక్తులు శ్రీవారి ఉత్సవంలో పాల్గొంటారు.

పదిహేనవ శతాబ్దంలో జరిగిన తిరుమలేశుని బ్రహ్మోత్సవ వైభవాన్ని పదకవితా పితామహుడు అన్నమాచార్యులు వర్ణించిన తీరు, రీతి కడు కమనీయం, హృదయంగమం కూడ.

ఈ విశేష ఉత్సవాలు సాధారణంగా ప్రతిసంవత్సరం భాద్రపద, ఆశ్వయుజ మాసాల్లో జరుగుతుంటాయి. ఆ సమయం మంచి వర్షాకాలం.



జడివానలు కురుస్తుంటాయి. అయినా పిలిస్తే పలికే కొండలయ్య ఉత్సవాలను దర్శించడానికి ఆ వానల్లోనే తడుస్తూ వస్తున్న అశేషభక్త కోటిని గూర్చి అన్నమయ్య ఇలా వర్ణిస్తాడు.

**ఆహిరి**

**నానా దిక్కుల నరులెల్లా**
**వానలలోననె వత్తురు గదలి ॥పల్లవి॥**

**సతులు సుతులుఁ బరిసరులు బాంధవులు**
**హితులు గొలువఁగా నిందరును**
**శతసహస్ర యోజన వాసులు సు-**
**వ్రతముల తోడనె వత్తురు గదలి ॥నానా॥**

**ముడుపులు జాళెలు మొగిఁదలమూఁటలు**
**కడలేని ధనముఁ గాంతలును**
**కడు మంచి మణులు కరులుఁ దురగములు**
**వడిగొని చెలఁగుచు వత్తురు గదలి ॥నానా॥**

**మగుట వర్ధనులు మండలేశ్వరులు**
**జగదేక పతులుఁ జతురులుఁ**
**తగు వేంకటపతి దరుశింపంగ బహు**
**వగల సంపదల వత్తురు గదలి ॥నానా॥**

వారు వీరనకుండా సామాన్య ప్రజలు బంధు సహితంగా ముడుపులు, కానుకలతో చాలా దూరం నుండి ఎంతో శ్రమకోర్చి, నియమ నిష్ఠలతో ఉత్సవాలకు వస్తారు. సామాన్య ప్రజలే కాదు. మకుట వర్ధనులు మండలాది పతులు జగదేక పతులు ఇలాగ ఒక్కరేమిటి ఆ బాలగోపాలం శ్రీవేంకటేశుని దర్శించడానికి తమ శక్తి కొద్దీ స్వామికి కానుకలు, మొక్కులు చెల్లించడానికి వానలలోనే కదలి వస్తారు.

పదినాళ్ల బ్రహ్మోత్సవ సంరంభంలో అంగరంగ వైభోగంగా తిరుమల పురవీధుల్లో ఆ యా వాహనాల మీద ఊరేగింపబడే శ్రీవారి వైభవాలను అన్నమాచార్యులు ఒక పాటలో ఇలా కీర్తించాడు.

**శ్రీరాగం**

**తిరువీధుల మెరసీ దేవ దేవుఁడు**
**గరిమల మించిన సింగారముల తోడను ॥పల్లవి॥**

**తిరుదండలపై నేఁగీ దేవుఁడిదె తొలునాడు**
**సిరుల రెండవనాడు శేషుని మీఁద**
**మురిపేన మూఁడోనాడు ముత్యాల పందిరి క్రింద**
**పొరి నాలుగోనాఁడు పువ్వుఁ గోవిలలోను ॥తిరు॥**

**గ్రక్కున నైదవనాఁడు గరుడుని మీఁద**
**యెక్కెను ఆరవనాఁడు యేనుగు మీఁద**
**చొక్కమై యేడవనాఁడు సూర్యప్రభలోనను**
**యిక్కువఁ దేరును గుఱ్ఱ మెనిమిదో నాఁడో ॥తిరు॥**

**కనకపు టందలము కదిసి తొమ్మిదోనాఁడు**
**పెనచి పదోనాఁడు పెండ్లి పీట**
**యెనసి శ్రీవేంకటేశుఁ డింతి యలమేల్మంగతో**
**వనితల నడుమను వాహనాల మీఁదను ॥తిరు॥**

ఇంచుమించు నేడు తిరుమల శ్రీవారికి జరుపబడే బ్రహోత్సవాల మాదిరిగానే అన్నమాచార్యుల (1408-1503) నాటికి కూడ జరుగుతున్నట్లు పై సంకీర్తన స్పష్టం చేస్తున్నది. కాని ఉదయం, సాయంత్రం రెండు వేళల్లో ఉత్సవాలు జరుగుతున్న ఈనాటివలె గాక అన్నమయ్య నాటికి రోజు కొక్క ఉత్సవం మాత్రం జరిగేదని స్పష్టం.



పై విధంగా ఉత్సవాల సంరంభాన్ని ఒక్క కీర్తినలోనే గాక ఒక్కొక్క ఉత్సవాన్ని ప్రత్యేకంగా ఒక్కొక్క కీర్తనలో అన్నమయ్య గానం చేసిన ఘట్టాలు కూడ ఉన్నాయి. మచ్చునకు కొన్ని.

**శేష వాహనం**

విశిష్టమైన ఈ ఉత్సవ క్రమంలో మొదటిరోజు రాత్రి పెద్దశేషవాహనం కాగా, రెండవనాటి ఉదయం చినశేషవాహనం వీటిపై ఊరేగుతున్న శ్రీవారి వైభవం, ఆదిశేషుని గొప్పదనం వర్ణింపబడ్డ కీర్తన ఇది.

**మాళవి**

**వీఁడుగదే శేషుఁడు శ్రీవేంకటాద్రి శేషుఁడు**
**వేఁడుక గరుడనితోఁ బెన్నుద్దైన శేషుఁడు ॥పల్లవి॥**

**వేయి పడగల తోడ వెలసిన శేషుఁడు**
**చాయమేని తళుకు వజ్రాల శేషుఁడు**
**మాయని శిరసులపై మాణికాల శేషుఁడు**
**యేయెడ హరికి నీడై యేఁగేటి శేషుఁడు ॥వీడు॥**

**పట్టపు వాహనమైన బంగారు శేషుఁడు**
**చుట్ట చుట్టుకొనిన మించుల శేషుఁడు**
**నట్టుకొన్న రెండువేల నాలుకల శేషుఁడు**
**నెట్టన వారిఁ బొగడ నేరుపరి శేషుఁడు ॥వీడు॥**

**కదిసి పనుల కెల్ల గాచుకొన్న శేషుఁడు**
**మొదల దేవతల కెల్లా మొక్కే శేషుఁడు**
**అదె శ్రీవేంకటపతి కలమేలుమంగకును**
**పదరక యేపొద్దూ పానుపైన శేషుఁడు ॥వీడు॥**



అదిగో పట్టపు వాహనమైన బంగారు శేషుడు! చుట్ట చుట్టుకొని ప్రకాశిస్తూ శ్రీవేంకటపతిని అలమేలుమంగను వీడక ఎల్లప్పుడు పొన్పుగా అమరి సేవిస్తున్న ఆదిశేషుడు. రెండువేల నాలుకలతో హరిని పొగడ తగిన నేరుపరి. శ్రీవేంకటేశుని పనులకెల్ల కాపున్న సేవాపరాయణుడు. దర్శించండి!! ఆ శేషుని పై వేంచేసి వున్న తిరువేంకటగిరిదేవుడు!! అని అన్నమయ్య తిరుమల శ్రీవారి శేషవాహనాన్ని వర్ణించాడు.





## గరుడోత్సవం

బ్రహ్మోత్సవాలలో ఐదవనాటిరాత్రి జరిగే బంగారు గరుడసేవ ప్రాధాన్యత ఇంతింతని వర్ణింపలేనిది. ఆనాడు ఆనంద నిలయంలోని మూలవిరాట్టునకు అలంకరించే మకరకంఠి, లక్ష్మీహారాది విశిష్టాభరణాలు శ్రీవారి ఉత్సవమూర్తికి అలంకరిస్తారు. అంతేకాక తమిళనాడు శ్రీవిల్లి పుత్తూరు గోదాదేవికి అలంకరింపజేసిన పూలమాల నియమం ప్రకారం ఆ

రోజుకు తీసుకరాగా, దానిని శ్రీవారికి ధరింపజేస్తారు. అనంతరం మద్రాసు నుంచి మిరాశిదార్లు కొత్త గొడుగులను కాలి నడకన తెస్తారు. శ్రీవారు గరుడునిపై వేంచేసి తిరుమల పురవీధుల్లో అశేష భక్తజన ప్రవాహం మధ్య ఊరేగుతారు. అదేరోజు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరపున ముఖ్యమంత్రి శ్రీవారికి పట్టు వస్త్రాలు సమర్పించడం జరుగుతుంది. ప్రస్తుతం (బ్రహ్మోత్సవం) మొదటిరోజునే ఈ పట్టువస్త్రాలు సమర్పించడం జరుగుతున్నది. ఆ వస్త్రాలను కూడ స్వామివారికి ధరింపజేస్తారు. అలా బంగారు గరుడని పై ఊరేగుతున్న ఆ కమనీయ దృశ్యాన్ని స్వామివారి మహిమను తాళపాక అన్నమాచార్యులు ఇలా కీర్తిస్తున్నాడు.

**నాట**

**ఇటు గరుడని నీవెక్కినను**
**పటపట దిక్కులు బగ్గనఁ బగిలె ॥పల్లవి॥**

**ఎగసిన గరుడని యేపున 'ధా' యని**
**జిగి దొలఁక చబుకు చేసినను**
**నిగమాంతంబులు నిగమ సంఘములు**
**గగనము జగములు గడగడ వడఁకె ॥ఇటు॥**

**బిరుసుగ గరుడని పేరెము దోలుచు**
**బెరసి నీవు గోపించినను**
**సరస నఖిలములు జర్జరితములై**
**తిరుపున నలుగడ దిరదిరఁ దిరిగె ॥ఇటు॥**

**పల్లించిన నీ పసిఁడి గరుడనిని**
**కెల్లున నీవెక్కిన యపుడు**
**ఝల్లనె రాక్షస సమితి నీ మహిమ**
**వెల్లి మునుగుదురు వేంకటరమణా ॥ఇటు॥**



అని అన్నమాచార్యులు శ్రీవారి గరుడోత్సవ వైభవాన్ని రమణీయంగా వర్ణించాడు.

## రథోత్సవం

శ్రీవారి బ్రహోత్సవాలలో తొమ్మిదవనాటి ఉదయం జరిగే ఉత్సవమే రథోత్సవం. ఇది తిరుమల కోనేటి రాయనికి జరిగే ఉత్సవాల్లో అన్నింటికంటె విశిష్టంగా మకుటాయమానంగా ఉంటుంది. భక్తజనులు బారులుతీరి రథంయొక్క పగ్గాలను లాగుతూ "గోవిందా! గోవిందా! ఏడుకొండలవాడా! వెంకటరమణా" అని ఆర్తిగా ఆనందంగా తన్మయించి పెద్దగా ఘోషిస్తూ వుండగా ఆ జగన్నాటక సూత్రధారి చిఱునవ్వులు చిందిస్తూ భక్తజనాన్ని వరదహస్తంతో అనుగ్రహిస్తూ, అలా అలా రథంలో పయనిస్తూ, భక్తుల మనోరథాల్ని ఫలియింపజేస్తున్న దృశ్యం వైభవంగా ఆనందదాయకంగా కన్నుల పండువుగా వుంటుంది. ఆ కొండలరాయని రథోత్సవాన్ని అన్నమయ్య అనేక కీర్తనల్లో సుసంపన్నంగా నోరార గానం చేశాడు. శ్రీవారి రథాన్ని రథంపై వేంచేసివున్న శ్రీవేంకటేశుణ్ని మనకు కన్నులకు కట్టినట్లు వర్ణించిన అన్నమయ్య కీర్తన ఇది.

**శంకరాభరణం**

**మొక్కరో పరుషలు మోహనమూర్తికి**
**వెక్కసమగు శ్రీవేంకటపతికి ॥పల్లవి॥**

**హరిరథ మదె ముందరి నొగ లవిగో**
**గరుడధ్వజ మదె ఘంటలవే**
**సరిఁదిరిగేటి కాంచన చక్రములవే**
**తిరువీధుల నేతెంచీఁ గనరో ॥మొక్క॥**

**తేరు పడగలవే తెల్ల గొడుగులవే**
**తోరణంబు లవే సారధి వాఁడే**

**ధీరతఁ గట్టిన దివ్య హయము లవే**
**మేరువు వలెనే మెరసీ నదివో ॥మొక్కు॥**

**పసిఁడికుండ యదె పట్టు కుచ్చు లవే**
**వెస నడుమ వాడేఁ శ్రీవేంకటేశుఁడు**
**యెసఁగి యురమునను యిదె యలమేల్మంగ**
**వసుధ పెండ్లి తేరు వచ్చీ నిదివో ॥మొక్కు॥**

ఓ పరుస (యాత్రికులు) జనులారా! విశ్వమోహనమూర్తియైన శ్రీవేంకటపతికి మొక్కండి! అదిగో దివ్యరథం!

అదిగో ముందర నొగలు! గరుడధ్వజం! ఘంటలు! వేగంగా తిరుగుతున్న బంగారు చక్రాలు! తిరుమల పురవీధుల్లో వస్తున్న దివ్యరథాన్ని కనరో!!

తేరుపైని శేషుని పడగలు! తెల్లగొడుగులు! పచ్చని తోరణాలు. అదిగో రథసారథి! దివ్యహయాలు, మేరువువలె ప్రకాశిస్తున్న దివ్యరథ మదిగో మొక్కండి!!

బంగారు కుండలతో పట్టు కుచ్చులతో నున్న రథమదో! దాని నడుమ నున్న దివ్యమూర్తి శ్రీవేంకటేశుడు! అదిగో ఆయన ఉరంలో అలమేల్మంగ!! వారిరువురి పెండ్లితేరు వస్తున్నది! భక్త జనులారా దర్శించి మ్రొక్కండి!!

ఇక ఆ మరుసటి రోజు అంటే పదవరోజు ఉదయం శ్రీసుదర్శన చక్రత్తాళ్వారుతో, శ్రీదేవి భూదేవులతో కూడియున్న తిరుమలప్పను శ్రీవరాహస్వామి ఆలయ మండపానికి వేంచేపు చేస్తారు. అక్కడ శ్రీస్వామివారికి చక్రత్తాళ్వారుకు పంచామృత స్నపన తిరుమంజనం చేయించిన తదుపరి శ్రీసుదర్శన చక్రాత్తాళ్వారుకు పుష్కరిణిలో పవిత్ర స్నానం చేయిస్తారు. ఆ చక్రాన్ని పుష్కరిణిలో ముంచే సమయంలో వేలాది యాత్రికులు గోవింద నామాన్ని దిక్కులు పిక్కటిల్లేట్టుగా ఉచ్చరిస్తూ పవిత్ర స్నానాలు చేస్తారు.



ఆ సాయంవేళ ధ్వజఅవరోహణ, ఉత్సవానికి విచ్చేసిన దిక్పాలురకు దేవతలకు వీడ్కోలు ఇవ్వడంతో శ్రీవారి బ్రహ్మోత్సవాలు సమాప్తమవుతాయి. కనుకనే అన్నమయ్య ఈ ఉత్సవాలకు వచ్చి సేవించిన బ్రహ్మాది దేవతలకు, భక్తులకు వీడ్కోలిచ్చినాడు. మీదటి తిరునాళ్లకు మళ్లీ రమ్మని తిరుమల ఘన వేంకటరాయని అనుగ్రహాన్ని పొందవలసిందని ఇలా ఆహ్వానిస్తున్నాడు.

**ముఖారి**

**భోగీంద్రులును మీరుఁ బోయి, రండు**
**వేగగ మీఁదటి విభవాలకు ॥పల్లవి॥**

**హరుఁడ పోయిరా అజుఁడ నీవునుఁ బోయి**
**తిరిగి రా మీఁదటి తిరునాళ్లకు**
**సురలు మునులును భూసురులుఁ బోయి రండు**
**అరవిరి నిన్నాళ్ల నలసితిరి ॥భోగీం॥**

**జముఁడ పోయిరా శశియు నీవును బోయి**
**సుముఖుఁడవై రా సురలఁ గూడి**
**గుములై దిక్పతులు దిక్కులకుఁ బోయిరండు**
**ప్రమదాన నిన్నాళ్లు బడలితిరి ॥భోగీం॥**

**నారద సనకసనందనాదులు**
**భూరి విభవములఁ బోయిరండు**
**దూరముగాఁ బోకిట్టె తొరలి వేంకటగిరిఁ**
**జేరి నన్నిట్లనే సేవించుఁడీ ॥భోగీం॥**

ఈ రీతిగా రోజు కొక వింతగా తిరుమల క్షేత్రం వైభోగం. పది రోజులపాటు జరిగే బ్రహ్మోత్సవాలు భక్తుల హృదయ క్షేత్రాలలో మధుర భక్తిలతలను పెంపొందించి ఆ ఆనందాను భూతి పరిమళాలను అంతటా వెదజల్లుతూ వుంటాయి.

"బ్రహ్మ చ వేంకటేశస్య
చకార పరమోత్సవమ్
ఉత్సవే దర్శనం పుణ్యం
శ్రీనివాసస్య శార్ఙ్గిణః"

–"ఆంధ్రప్రభ" దినపత్రికలో ప్రచురితం

# మరికొన్ని ఉత్సవాల కీర్తనలు

## గరుడోత్సవం

**రామక్రియ**

ఎక్కడ నీ వుద్యోగమెటు విచ్చేసేవయా
యిక్కువ నీ మహిమకు నెవ్వరెదురయ్యా ॥పల్లవి॥

పల్లించి గరుడనిపై నీవుబ్బున నెక్క
అల్లనాడె పారిజాత మడవి కెక్కె
పల్లదపు రుద్రుడును బాణుని వాకిలి దొక్కె
చుల్లరి రాక్షస మూఁక సురసుర సుక్కె ॥ఎక్కడ॥

గరుడనిపై నీవు కడుఁ బేరెములు వార
ధర జలధరుల నమృతములు దేరె
నిరతిఁ గంసాదుల నెత్తురు టేరులు వారె
పరులు నీ కెదిరిన పగయెల్లఁ దీరె ॥ఎక్కడ॥

బంగారు గరుడనిపై నీవు వీధులేఁగ
చెంగట శ్రీ వేంకటేశ సిరులు మూఁగె
సంగతి నలమేల్మంగ సంతసాన విఱ్ఱవీగె
పొంగారు దేవదుందుభులు పైపై వాఁగె ॥ఎక్కడ॥



**రథోత్సవం**

అమరాంగన లదె యాడేరు
ప్రమదంబున నదె పాడేరు ॥పల్లవి॥

గరుడవాహనుఁడు కనకరథముపై
యిరువుగ వీధులనేఁగీని
సురలను మునులును సొంపుగ మోఁకులు
తెరలిచి తెరలిచి తీసేరు ॥అమ॥

యిలధరుఁడదివో యింద్రరథముపై
కెలయిచు దిక్కులు గెలిచీని
బలు శేషాదులు బ్రహ్మశివాదులు
చెలఁగి సేవలటు సేసేరు ॥అమ॥

అలమేల్మంగతో నటు శ్రీవేంకట
నిలయుఁ దరదమున నెగడీని
నలుగడ ముక్తులు నారదాదులును
పొలుపు మిగులఁగడుఁ బొగడేరు ॥అమ॥

**బౌళి**

ఎత్తరే ఆరతులు యియ్యరే కానుకలు
యిత్తల నేఁగి వచ్చీని యిందిరానాథుడు ॥పల్లవి॥

గరుడ ధ్వజపుతేరు కనకమయపుతేరు
సిరులతో వేదముల చేరులతేరు
సురలు మునులుఁ బట్టి సొంపుతోడ దియ్యఁగాను
యిరువుగ నేఁగి వచ్చీ నిందిరానాథుడు ॥ఎత్తరే॥

జీవకోట్లున్న తేరు శేషుఁడే రూపైనతేరు
వేవేలు సింగారముల వెలయుతేరు
మూవరస నిత్యులును ముక్తులును గొలువఁగా
యీవల నేఁగివచ్చీ నిందిరానాథుడు ॥ఎత్తరే॥

పంచభూతములతేరు బ్రహ్మాండమైనతేరు
మించిన శ్రీవేంకటాద్రి మీఁదటి తేరు
కొంచక యలమేల్మంగఁగూడి వచ్చీనదె తేరు
యెంచరాని మహిమల నిందిరానాథుడు ॥ఎత్తరే॥

**మాళవిగౌళి**

నానా వర్ణముల నడగొండవలెను
దానవారి తేరదె తగ తిరువీథుల ॥పల్లవి॥

కదలె కదలె నదె గరుడధ్వజుని తేరు
అదె మిన్ను మోచిన నీలాద్రివలెను
యెదిరె నెదిరె నదె యిందిరాధిపుని తేరు
కదిసి చుక్కలు మోచే కనకాద్రి వలెను ॥నానా॥

తిరిగె తిరిగె నదె దేవదేవుని తేరు
అరుదైన ఘనమందరాద్రి వలెను
పరువులిడీ నదె పట్టపు శ్రీపతితేరు
విరివిఁ గైలాసపు వెండికొండవలెను ॥నానా॥

దగ్గరె దగ్గరె నదె దైవశిఖామణి తేరు
అగ్గలపు శ్రీవేంకటాద్రి వలెను
అగ్గమై శ్రీవేంకటేశుఁడలమేలుమంగఁ గూడె
తగ్గులేని మొత్తపు దొంతర కొండవలెను ॥నానా॥

## 28. శ్రీవారి మెట్టు - తిరుమల

**శేషాచలే యన్మాహాత్మ్య మన్యక్షేత్రే నతత్ క్వచిత్**
**తద్గతశ్రీనివాసస్య మహిమా నాన్యగః శుభః.**

శేషాచల క్షేత్రానికి ఉన్నట్టి మహిమ ఇతర క్షేత్రాలకు దేనికీ లేనే లేదు. అలాగే ఈ దివ్యక్షేత్రంలో కొలువై ఉన్న వేంకటేశ్వరుని వంటి మహిమాన్వితమైన దేవుడు, దయాంతరంగుడైన దేవుడు ఇంకెక్కడా కానరాదు!

ఇంతటి అద్భుతమైన దేవుడు ఎక్కడి నుంచి వచ్చాడు? ఎందుకు వచ్చాడు?

**వైకుంఠం వా పరిత్యక్ష్యే న భక్తాంస్త్యక్తుముత్సహే ।**
**మేఽతిప్రియా హి మద్భక్తా ఇతి సంకల్ప వానసి ॥**

శ్రీ వైకుంఠాన్నయినా విడిచి ఉంటానుగాని, నా భక్తులను ఒక్క క్షణమైనా విడిచి ఉండలేనన్న సంకల్పంతో, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు శ్రీవైకుంఠం నుండి దిగివచ్చి 'శ్రీ వేంకటేశ్వరుడు' అన్న పేరుతో అద్భుత సాలగ్రామ శిలామూర్తిగా స్వయంవ్యక్తరూపంతో తిరుమల క్షేత్రంలో కొలువై ఉన్నాడు.

**'కలౌ వేంకట నాయకః'** అన్నట్లు 'ఈ కలియుగంలో అందరికీ ఏకైక దిక్కును నేనే' నంటూ – తమ కోసం వెలసివున్న దేవుణ్ణి, కేవలం దర్శన మాత్రం చేతనే కష్టాలకడలినుండి ఉద్ధరించే దేవుణ్ణి దర్శించడంకోసమే ఆనాటి నుండి భక్తులు తిరుమలయాత్రకు వస్తూనే ఉన్నారు.

ప్రాచీనకాలంలో తిరుపతియాత్రలో ఇంటినుండి బయలుదేరి దిగువ తిరుపతి చేరుకోవడం ఒక ఎత్తైతే, దిగువ తిరుపతి నుంచి ఎగువ తిరుపతికి (తిరుమలకు) చేరుకోవడం మరో ఎత్తు! అప్పట్లో తిరుపతి నుంచి తిరుమల కొండకు నడచి మాత్రమే వెళ్ళాలి. కొండపైకి వెళ్ళడానికి ప్రాచీన కాలంలో

మూడు లేదా నాలుగు మార్గాలున్నాయని చెప్పబడినా, ప్రధానంగా సోపానమార్గాలు (మెట్లదారులు) మాత్రం రెండే ఉన్నాయి.

**ఒకటి అలిపిరిమెట్లదారి. రెండవది శ్రీవారిమెట్టు మార్గం.**

**1. అలిపిరి నుండి మెట్లదారి :**

తిరుపతి అలిపిరిలో పాదాలమండపం నుండి ఈ నడకదారి ప్రారంభమౌతుంది. శ్రీవారి పాదాలమండపంలో శ్రీస్వామివారి అద్భుతమైన పెద్ద శిలాపాదాలు మరియు శ్రీనివాసుడు విగ్రహరూపంలో దర్శనమిస్తాడు. ఇక్కడ 'తిరుమల నంబి' అనే భక్తుని కోసం, శ్రీస్వామివారి తన పాదాలను ప్రత్యక్షంగా దర్శింపజేశాడు. అవే అలిపిరిలోని నేటి శిలాపాదాలు. అక్కడి నుంచి మొదలైన ఈ మార్గంలో తలయేరు గుండు, చిన ఎక్కుడు, పెద ఎక్కుడు, గాలిగోపురం, ముగ్గుబావి, త్రోవనరసింహుడు, అవ్వాచరికోన, మోకాళ్లమిట్ట, త్రోవభాష్యకార్లు, సీతమ్మసారెపెట్టెలు, రావిమాను, బేడి ఆంజనేయస్వామి, శ్రీవారిసన్నిధి వరకు సాగే అలిపిరి మెట్లదారిలో అక్కడక్కడా శ్రీస్వామివారి 'శిలాపాదాలు' భక్తులకు దర్శనమిస్తూ భక్తిని పెంపొందిస్తుంటాయి.

సాలగ్రామమయమైన తిరుమలకొండనే సాక్షాత్తు శ్రీనివాస భగవానునిగా దర్శించిన ఆళ్వారులు, భగవద్రామానుజులవారు అలిపిరి నుంచే ఆ దివ్యక్షేత్రాన్ని భక్తితో సేవించారు. నమస్కరించారు. కొండను మాత్రం ఎక్కలేదు. కాని అప్పట్లో అస్తవ్యస్తంగా సాగుతున్న శ్రీవారి అర్చనావిధానాన్ని క్రమబద్ధీకరించడం కోసం భక్తుల కోరికమేరకు భగవద్రామానుజులవారు కేవలం మూడుమారులు ఆహారపానీయాలు లేకుండా మోకాళ్ళపై తిరుమల కొండకు నడచి వెళ్లారని చరిత్ర చెబుతోంది. ఆ తర్వాత ఎందరో, ఎందరెందరో మహాభక్తులు, యాత్రికులు అలిపిరి మెట్లదారిలో నడచి వెళుతూ తిరుమల యాత్రను సంపూర్ణంగా ఫలప్రదం చేసుకొన్నారు.



ఈ అలిపిరి మార్గాన్ని అభివృద్ధి చేసి, యాత్రికుల సౌకర్యం కోసం తి.తి.దేవస్థానం నీటి సౌకర్యం, విద్యుత్తు, వైద్యం, షెల్టర్లు, ఆహారం, పారిశుద్ధ్యం, భద్రత వంటి ఎన్నెన్నో సౌకర్యాలు కల్పిస్తున్నది.

**2. శ్రీవారిమెట్టు :**

శ్రీనివాసమంగాపురం మొదలుకొని తిరుమల వరకు గల సోపాన మార్గాన్ని **'శ్రీపతిమెట్టు'** లేదా **'శ్రీవారిమెట్టు'** అంటారు. ఆధ్యాత్మిక పురోగతికి తొలిమెట్టు ఈ శ్రీవారిమెట్టు. చంద్రగిరివైపు ఉన్న సోపానమార్గం కనుక 'చంద్రగిరి సోపాన మార్గం' అని కూడ పిలువబడుతున్నది. కాని ప్రస్తుతం విస్తృతంగా ఉన్న వ్యవహార నామం "శ్రీవారిమెట్టు".

భువిపై శ్రీ ఆదివరాహక్షేత్రం ఆవిర్భవించిన తర్వాత, శ్రీవైకుంఠం నుంచి శ్రీనివాసుడు శ్రీమహాలక్ష్మిని వెదుకుతూ, ఈ క్షేత్ర శిఖరంపై తొలిగా కాలూనినాడు. అదే నేటి నారాయణగిరి పర్వతం! సాక్షాత్తు శ్రీమన్నారాయణుడైన శ్రీనివాసుడు 'పాదాలు' మోపిన గిరి కనుక 'నారాయణగిరి' అని పిలువబడింది. అందుకు గుర్తుగా ఆ నారాయణగిరి శిఖరాన శ్రీవారి దివ్యపాదాలను (శిలాపాదపద్మాలను) భక్తులు దర్శించవచ్చు. 'నారాయణగిరి' ఆకాశపుటంచులను తాకుతున్న పర్వతశిఖరం కాగా, దాన్ని ఆనుకొని వేంకటాచలక్షేత్రం నుండి భువికి దిగివచ్చే లోతైన మార్గమే 'శ్రీవారిమెట్టు' నడకమార్గం!

వైకుంఠం నుంచి నేరుగా దిగివచ్చిన శ్రీనివాసుడు నడయాడిన దివ్యక్షేత్రం వేంకటాచలం కాగా, అక్కడినుంచి పలుమార్లు కొండదిగివచ్చి నారాయణోద్యానవనానికి వేటకు వెళ్లి పద్మావతిని మోహించి తిరిగివచ్చిన మార్గం కూడా ఈ శ్రీవారిమెట్టు మార్గమే!

ఆ తర్వాత శ్రీనివాసుడు ఆకాశరాజు కూతురు పద్మావతిని వివాహమాడి అగస్త్యమహర్షి కోరికమేరకు ఆరునెలలపాటు ఇక్కడి ఆశ్రమంలో విడిది

చేశాడు. ఆ తర్వాత పద్మావతీ శ్రీనివాసులు ఇరువురు కలిసి శ్రీ వరాహక్షేత్రానికి నడచి వెళ్లిన మార్గం కూడా శ్రీవారిమెట్టు మార్గమే! అందుకు గుర్తుగా శ్రీనివాస మంగాపురంలో కల్యాణ వేంకటేశ్వరునిగా వెలసిన తనను దర్శించిన వారికి కల్యాణ పరంపరలు కలుగతాయని, వివాహం కావలసిన వారికి వివాహం కాగలదని కూడా వరమిచ్చాడు శ్రీనివాసుడు.

సాక్షాత్తు పద్మావతీ శ్రీనివాసులు నడయాడిన మహిమాన్వితమైన శ్రీవారిమెట్టు మార్గమే, ఆ తర్వాతికాలంలో ఎందరో రాజులకు, యాత్రికులకు వేంకటాచలయాత్రకు ప్రధాన రాజమార్గమైంది.

నారాయణవర ప్రభువులు ఆకాశరాజు, తొండమానుడు మొదలు విజయనగర ప్రభువుల వరకు 'శ్రీవారిమెట్టు' మార్గాన్ని తమ యాత్రా మార్గంగా చేసుకున్నారు. విజయనగర రాజులు చంద్రగిరి కోటలో విడిది చేసిన సమయంలో శ్రీవారి నైవేద్యఘంటానాదాన్ని అంచలంచెలుగా ఉన్న ఘంటామండపాలద్వారా విన్న తర్వాతనే భోజనం చేసేవారట!

శ్రీకృష్ణదేవరాయలు, అచ్యుతరాయలు వారి రాణులు గుర్రాలపైనా, మేనాలపైనా ఈ మార్గం ద్వారానే తిరుమల చేరుకొని శ్రీవారికి మొక్కులు చెల్లించుకున్నారు.

సువర్ణముఖీనది, కల్యాణీనదీ పరీవాహక ప్రాంతంలో ఉన్న చంద్రగిరి, శ్రీనివాసమంగాపురం, నరసింగాపురం, కాశూరు, పేరూరు, పెరుమాళ్లపల్లె, చెర్లోపల్లె మున్నగు గ్రామాల పొలాలు తిరుమల శ్రీవారి ఇనాము భూములుగా ఉండేవి. ఆ పొల్లాలో రైతులు పండించిన వరిధాన్యం, పప్పుదినుసులు, శ్రీవారి వంటలకు, దీపాలకు ఉపయోగించే ఆవునెయ్యి, ఆవుపాలు, పెరుగు మున్నగు పాడి ద్రవ్యాలన్నీ శ్రీవారిమెట్టు మార్గం నుండే తిరుమల శ్రీవారి ఆలయానికి చేరవేసేవారని శాసనాలు స్పష్టం చేస్తున్నాయి.



తిరుమలకొండపై ఆలయ మండప నిర్మాణాలకు అవసరమైన గండశిలలు కూడా ఈ శ్రీవారిమెట్టు మార్గం ద్వారా మాత్రమే కొండపైకి ఏనుగులద్వారా చేరవేసి ఉంటారని భావించడం ఏ మాత్రం అతిశయోక్తి కాదు.

ఎందరో మహనీయులకు నిలయమై 'సిద్ధకూటం' అని పిలువబడిన శ్రీనివాస మంగాపురంలో, 24 మంది మహాజనం (వేదపండితులు) ఉండే వారనీ, నెలకు ఇద్దరు వంతున సంవత్సరం పొడవునా 'శ్రీవారిమెట్టు' మార్గం ద్వారా తిరుమలకు నడచివెళ్ళి శ్రీవారి ఆలయంలో వేదపారాయణం చేసేవారని క్రీ.శ.1433 నాటి శాసనం స్పష్టం చేస్తున్నది.

తిరుమల శ్రీవారి ఆలయంలో అర్చనల్లో, సేవల్లో, ఉత్సవాల్లో భక్తులుగా, ఆలయకవులుగా సముచిత స్థానాన్ని సంపాదించుకొని సత్కరింపబడిన తాళ్లపాక కవులు, ముఖ్యంగా అన్నమయ్య మనుమడు చినతిరుమలాచార్యులు శ్రీనివాసమంగాపురంలోని కల్యాణ వేంకటేశ్వరాలయాన్ని జీర్ణోద్ధరణ చేశాడు. క్రీ.శ.1540 ప్రాంతంలో తాళ్లపాకవారికి అచ్యుతరాయల చేత శ్రీనివాసమంగాపుర గ్రామం సర్వమాన్యంగా ఇవ్వబడింది. అప్పట్లో అటు తిరుమల శ్రీవారిఆలయాన్ని, ఇటు శ్రీనివాసమంగాపురంలోని ఆలయాన్ని పర్యవేక్షించిన తాళ్లపాకవారికి ఈ శ్రీవారిమెట్టు మార్గమే శరణ్యమయ్యింది. అప్పట్లో శ్రీవారిమెట్టు గుండా తిరుమలకు వెళ్లే భక్తులందరూ శ్రీనివాసమంగాపురంలోని కల్యాణవేంకటేశ్వరుని తప్పక దర్శించేవారు.

శ్రీనివాసమంగాపురం ఆలయానికి ఉత్తరం దిక్కున 6 కి.మీ. దూరంలో ఉన్న శ్రీవారిమెట్టుకు వెళ్ళేదారిలో యాత్రికులకు, భక్తులకు విశ్రాంతి సత్రాలు, దేశాంతర మండపాలు, దిగుడు బావులు, వంటశాలలు నిర్మింపబడినాయి. అప్పటి యాత్రికుల సేవలో తరించిన ఆనాటి శిథిలమండపాలను, దిగుడు బావులను నేటికీ చూడవచ్చు. అక్కడికి దగ్గర్లో భక్తాంజనేయస్వామివారి ఆలయం ఉంది. ఆ స్వామివారిని పూజించిన తర్వాతే భక్తులు కొండను

ఎక్కేవారు. ఈ శ్రీవారిమెట్టు దారిలో అక్కడ కూడా శ్రీవారి శిలా పాదాలు భక్తులకు దర్శనమిస్తాయి.

శ్రీ పద్మావతీ శ్రీనివాసులు నడయాడిన దివ్యమార్గంగా ప్రసిద్ధి చెందిన ఈ ప్రాంతం, కాలాంతరంలో సువర్ణముఖీ కల్యాణీ నదుల ఉద్ధృతమైన వరదల తాకిడికి లోనయ్యింది. ఈ వరదల వల్ల ఇతర గ్రామాలతోపాటు శ్రీనివాసమంగాపుర గ్రామంలోని కల్యాణ వేంకటేశ్వరాలయం మార్గం యాత్రికుల నిరాదరణకు లోనయ్యింది. దీనికి తోడు తిరుపతి నుంచి తిరుమలకు ఏర్పడిన బస్సు సౌకర్యంతో ప్రయాణం సుఖవంతం అవడంవల్ల చాలామటుకు యాత్రికుల రాకపోకలు శ్రీవారిమెట్టు మార్గంలో దాదాపు నిలిచిపోయాయని చెప్పవచ్చు. అడపాదడపా చంద్రగిరి, శ్రీనివాస మంగాపురం గ్రామాల ప్రజలు ఈ శ్రీవారిమెట్టు ద్వారా కొండకు వెళ్లి తిరుమల భక్తులకు అవసరమయ్యే కూరగాయలు, పాలు, పెరుగు, నెయ్యి వగైరా వాటిని అమ్ముకొనేవారు.

1843 నుంచి 1933 వరకు సాగిన మహంతుల పరిపాలన కాలంలో కూడ ముఖ్యంగా మహంతు ప్రయాగదాసు తన 33 ఏండ్ల దేవస్థానం నిర్వహణ కాలంలో అలిపిరి మార్గాన్ని అభివృద్ధి చేశారు. కాని ఎందుకో శ్రీవారిమెట్టు మార్గాన్ని విస్మరించారు. బహుశా యాత్రికులను పూర్తిగా అలిపిరి మార్గంలో తిరుమలకు రప్పించడం ద్వారా తిరుపతిలోని శ్రీ గోవిందరాజస్వామి, శ్రీ కోదండరామస్వామి ఆలయం, కపిలతీర్థం మున్నగు ఆలయాలన్నీ భక్తుల రద్దీతో సందడిగా ఉంటూ అభివృద్ధి చెందగలవన్న అభిప్రాయంకూడా అందుకు ప్రధాన కారణం కావచ్చు!

సాక్షాత్తు తిరుమలేశుడు తాను నడయాడిన ఈ దివ్యమార్గాన్ని పునరుద్ధరింపజేయాలని సంకల్పించి తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారులైన డా॥ కె.వి. రమణాచార్యులవారికి చక్కని ప్రేరణనిచ్చారు కాబోలు! వారి పట్టుదలతో సడలని దీక్షతో ఇన్నాళ్లకు,



ఇన్నేళ్లకు వారి ఆధ్వర్యంలో తిరుమల శ్రీవారిమెట్టుమార్గం పునరుద్ధరింపబడి, నిర్మింపబడింది. తొలిమెట్టు ప్రారంభాన సుమారు 38 లక్షల రూపాయల ఖర్చుతో శ్రీవారి పాదాలమండపం ఆలయం ప్రతిష్ఠింపబడింది. అక్కడి నుంచి మొదలై తిరుమల వరకు సుమారు 2.5 కిలోమీటర్ల పొడవున సాగిన కాలినడక దారిలో సుమారు 6 కోట్ల రూపాయల ఖర్చుతో గ్రానైటు రాళ్లతో 2388 మెట్లు, ఎండ తగలకుండా, వానకు తడవకుండా ఆ మెట్లపై చక్కని ఆచ్ఛాదన, దారి వెంబడి మంచినీరు, విద్యుత్తు, పారిశుధ్యం, భద్రతవంటి విస్తృత సౌకర్యాలతో శ్రీవారిమెట్టు మార్గం పునర్నిర్మింపబడింది. తిరుపతి 'శ్రీనివాసం' నుండి శ్రీవారిమెట్టు వరకు ఉచిత బస్సుసౌకర్యం కూడ ఏర్పాటు చేయబడింది.

అటు అలిపిరి నుంచి తిరుమలకు వెళ్లేమార్గంలోను, శ్రీవారిమెట్టు నుంచి తిరుమలకు వెళ్లే మార్గంలోను, 'నారాయణగిరి' పర్వత శిఖరాన ఇలా అడుగడుగునా ఎక్కడ చూచినా శ్రీనివాసుడు తన పాదాలను దర్శింపజేస్తూ తిరుమలకు వెళ్ళే భక్తుల యాత్రను పూర్తిగా ఫలవంతం చేస్తున్నాడు.

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ –** అన్నీ వదలిపెట్టి నన్ను శరణువేడండి అని శ్రీకృష్ణభగవానుడు అన్నట్లుగా, ఈ వేంకటాద్రి కృష్ణుడు తన అవతార లక్ష్యమే అది అన్నట్లుగా తన పాదాలను శరణువేడుమని చెబుతూ, భక్తులను రక్షిస్తున్నాడు.

'సంసార సాగర సముత్తరణైక సేతో' అన్నట్లుగా కుడి హస్తంతో తన పాదాలను చూపుతూ వీటిని శరణువేడితే చాలు – మీ సంసార సముద్రాన్ని మోకాళ్లబంటి మాత్రం చేసి సులభంగా దాటించడమేగాక, మిమ్మల్ని అక్కున చేర్చుకుంటానని ఎడమచేత్తో సందేశమిస్తున్నట్లుగా సొంపైన భంగిమలో దర్శనమిస్తూ వయ్యారంగా నిలిచిన శ్రీ స్వామివారి తీరు, రీతి కడు రమణీయం! ఆ భంగిమను ఒక అజ్ఞాత మహాకవి ఇలా ప్రశ్నిస్తాడు.

**కుడిహస్తం బిటు చూపు చందమిది, వైకుంఠబనే యందమో!**
**జడధివ్రాత పరీత భూ భవన రక్షా దక్షిణంబైన నీ**
**యడుగుల్ చూడుమనేవొ! కాక యొక యొయ్యారంబొ? సందేహమై**
**యడిగే నానతి యిమ్ము వేంకటనగాధ్యక్షా! జగద్రక్షకా!!**

ఆ కవిగారి సందేహంలోనే సమాధానం దొరుకుతూ శ్రీవారి పాదదర్శన ప్రాశస్త్యం స్పష్టమౌతున్నది. అందువల్లే తిరుమల శ్రీవారి ఆలయ సంప్రదాయంలో **'శ్రీవారి పాద దర్శనం పాప విమోచనం'** అన్న నానుడి రూఢిగా నిలిచి ఉంది!

కనుక ముందుగా శ్రీనివాసమంగాపురంలోని శ్రీకల్యాణవేంకటేశ్వరుని దర్శించిన తర్వాత పచ్చని చెట్లతో, పక్షుల కిల కిలా రావాలతో ప్రతిధ్వనిస్తూ వింత వింత సోయగాలతో మైమరపించే ప్రకృతి రమణీయకత ఉట్టిపడే దివ్యమైన శ్రీవారిమెట్టు మార్గంలో, జగత్కల్యాణ మూర్తులు అయిన శ్రీ పద్మావతీ శ్రీనివాసులు ఇరువురూ చెట్టాపట్టాలేసుకొని నడచిన ఈ శ్రీవారిమెట్టు మార్గంలో మనమందరం అడుగులో అడుగు వేసుకొంటూ ఆ అడుగడుగు దండాలవాణ్ణి స్మరిస్తూ, ఆ వేంకటాచల శిఖరాగ్రాన ఆ దివ్యదంపతులిద్దరూ ఒక్కటై, ఏకమై, మమేకమై అనంతమైన ఆనందమయమైన ఒకే తత్త్వంగా సహస్రారచక్రం వలె భాసిస్తూ ఉన్న ఆనందనిలయం అనే బంగారుమేడలోని 'శ్రీనివాస పరబ్రహ్మ'ను దర్శిద్దాం! చూసితరిద్దాం!!

**భవాబ్ధితారం కటివర్తిహస్తం స్వర్ణాంబరం రత్నకిరీటకుండలమ్,**
**ఆలంబిసూత్రోత్తమమాల్యభూషితం నమామ్యహం వేంకట శైలనాయకమ్.**

**"సప్తగిరి" లో ప్రచురితమైన ప్రత్యేకవ్యాసం.**

**అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తన**
**అన్నమాచార్య చరిత్ర పీఠికనుండి**



పొడఁగంటిమయ్య! మిమ్ము పురుషోత్తమా! మమ్ము
నెడయకవయ్య! కోనేటిరాయఁడా!

కోరి మమ్ము నేలినట్టి కులదైవమా! చాల
నేరిచి పెద్ద లిచ్చిన నిధానమా!
గారవించి దప్పి దీర్చు కాలమేఘమా! మాకు
చేరువఁజిత్తములోని శ్రీనివాసుఁడా!!

భావింపఁగైవసమైన పారిజాతమా! మమ్ము
చేవదేరఁగాచినట్టి చింతామణీ!
కావించి కోరిక లిచ్చే కామధేనువా! మమ్ము
తావై రక్షించేటి ధరణీధరా!!

చెడనీక బ్రదికించే సిద్ధమంత్రమా! రోగా -
లడఁచి రక్షించే దివ్యౌషధమా!
బడిఁబాయక తిరిగే ప్రాణబంధుఁడా! మమ్ము
గడియించినట్టి శ్రీ వేంకటనాథుఁడా!!





తిరుమల శ్రీవారి వజ్రకిరీటంలో 28,369 వజ్రాలు పొదగబడ్డాయి. 25 కిలోల బంగారంతో చేయబడిన ఈ అపురూప కిరీటం వెల ఆరుకోట్లరూపాయలు. అద్భుతమైన, అమూల్యమైన ఈ వజ్రకిరీటం 1985 డిశంబరు 20 తేదిన తిరుమల శ్రీవారి మూలమూర్తికి తొలిసారిగా అలంకరింపబడింది.